# REQUEST

Manimanjari is usually published and dispatched by end of February and August of every year and will be dispatched under Certificate of Posting. As limited number of copies are being published any complaints regarding non receipt can be entertained if made within 15 days of dispatch and if required the Journal will be sent by Registered Post at Party's expense

2. Prompt Payment of subscription is requested.

## గమనిక

### వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు

సభ్యులు కాగోరువారికై సభ్యత్వము గడువు ఎప్పుడైనను చేరుటకు వీలుగా పొడిగింపబడినది.

సభ్యత్వముతో నిమిత్తము లేక మా యీ ఉద్యమమునకై తమకు తోచిన రీతిని సహాయపడదలచిన సహృదయుల తోడ్పాటును ట్రస్టువారు కృతజ్ఞతతో స్వీకరించగలరని మనవి చేయుచున్నాము. రూ, 250/–లకు పైబడిన విరాళములకు ఆదాయపు పన్ను మినహాయింపు వర్తించును.

మేనేజింగ్ ట్రస్టీ,
2-2-18/15/D/1, బాగ్ అంబర్‌పేట,
హైదరాబాద్–500 013

# మణిమంజరి

**వాఙ్మయ యోగ పరిశోధన**

**సంచిక**

సంపుటం : 10 ఆగస్టు, 1985

## నన్నిచోడ - ప్రభాకర సంస్మరణ సంచిక

---

సంపాదకులు

**డా॥ వేటూరి ఆనందమూర్తి**



**వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్ట్**

**2-2-18/15/D/1 బాగ్అంబర్‌పేట,**

**దేశముఖ్‌కాలనీ, హైదరాబాదు—500 013.**

"మణిమంజరి"

కుమారసంభవము ప్రధాన విషయముగా
రూపొందింపబడిన
నన్నిచోడ—ప్రభాకర సంస్మరణ సంచిక

వెల: పదిహేను రూపాయలు

ట్రస్టు సభ్యులందరికి ఉచితము

వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు
2-2-18/15/D/1, బాగ్ అంబర్‌పేట,
హైదరాబాదు—500013

ముద్రణ :
మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్,
1-1-694/2/ఎ, గాంధీనగర్, హైదరాబాద్ 500 380
మరియు
శ్రీ లక్ష్మి వెంకటేశ్వర పవర్ ప్రెస్, హైదరాబాద్.

# విషయ సూచిక


నన్నిచోడుడు * వేటూరి ప్రభాకరశాస్త్రి 1

కుమారసంభవము (వ్యాఖ్య) * వేటూరి ప్రభాకరశాస్త్రి 25

వీరేశలింగము పంతులుగారు —తంజావూరు 59

ప్రభాకరులు —తంజావూరు లైబ్రరీ 59

ప్రబంధ రత్నావళి—కుమారసంభవము 61

కుమారసంభవము—తెలుగు మెఱుగులు * వే. ప్రభాకరశాస్త్రి 65

7. ప్రభాకరుల మార్జినల్ నోట్స్ 69

8. శ్రీ ప్రభాకరుల క్రిటికల్ నోట్స్ 77

9. కుమారసంభవము—సూచనలు 82

10. ఒక (అసంపూర్ణ) బహిరంగ లేఖ 86

11. కుమారసంభవము—సవరణలు 90

12. లేఖలు 92

13. త్రిలిఙ్గ సంపాదకీయము 95

14. వినోద విమర్శము — దీపవర్తి 97

15. లేఖలు 102

16. కుమారసంభవ ముద్రణము
కోరాడవారి లేఖలు 109

17. శ్రీ ప్రభాకరుల సమాధానము — మరికొన్ని లేఖలు 111

18 బ్లాకులు 116

౧. నన్నెచోడ కుమారసంభవ వ్యాఖ్య

—డా॥ పోచిరాజు శేషగిరిరావు ౧

౨. తథ్యమిథ్యా వివేచనము—ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి ౫

౩. మా సమాధానము —డా॥ వేటూరి ఆనందమూర్తి ౧౩

౪. నన్నెచోడుని కుమారసంభవము

కూట సృష్టియా ? —తీర్థం శ్రీధరమూర్తి ౨౧

౫. దొరికినాడు నన్నెచోడుని గురువు—వేదము వెంకటరాయశాస్త్రి ౩౭

౬. కుమారసంభవము తంజావూరిప్రతి —తిరుమల రామచంద్ర ౪౭

౭. తంజావూరు లైబ్రరీ తెలుగు కేటలాగు—

డా॥ వేటూరి ఆనందమూర్తి ౫౫

✻

# సంపాదకీయం

'మణిమంజరి' మొదలుపెట్టి ఇప్పటికి ఐదేళ్ళు నిండినవి. ఈ ఆగస్టుకి మొత్తం పది సంచికలు వెలువడినవి. ఎనిమిదో సంపుటం బ్రౌన్–ప్రభాకర సంస్మరణ సంచికగా ప్రామాణికతను సంతరించుకొని వెలువడి పలువురి మన్నన లందుకొన్నది. రాబోయే ప్రభాకర శతజయంతి (1988) సంవత్సరంలోగా ఇలాగే మరికొన్ని విశేషసంపుటాలు వెలువరించా లనుకొంటున్నాము.

"రవికి దీపమున నర్చలిచ్చు పగిదివోలె" ఈ సంపుటాన్ని నన్నిచోడ–ప్రభాకర సంస్మరణ విశేష సంచికగా రూపొందిచాము. ఆంధ్ర వాఙ్మయ రంగంతో నన్నిచోడని కుమారసంభవం కలిగించిన, కలిగిస్తున్న సంచలనాన్ని పురస్కరించుకొనీ; కుమారసంభవం అచ్చయిన నాటినుండి ప్రభాకరు లాప్రబంధం విషయంలో గావించిన మౌలికమైన కృషిని స్మరించుకొనీ, ఇప్పుడు మే మీ సంస్మరణ సంచికను వెలువరిస్తున్నాము. శాస్త్రిగారి వ్రాత ప్రతులనుండి సాధ్యమైనంత సామగ్రిని సమీకరించి; మేము సేకరించిన లేఖా రచనల్లోని వాస్తవాలను క్రోడీకరించి; స్వల్పమైనా వారు రచించిన వ్యాఖ్యానాన్ని సముద్ధరించి; కుమార సంభవ పాఠ పరిష్కరణ విషయంలోనూ పూరణములలోనూ, సంవాది రచనల నుద్ధరించడంలోనూ, విమర్శనలోనూ వారు చూపిన నేర్పును సంభావించి; సత్య శోధనమె లక్ష్యముగానెంచి మే మిందు పొందుపరచినఅంశాలలో అనేకములు విమర్శలోకానికీ, నేటి యువతరానికీ, అపరిచితములైనవే.

ఒక కాలక్రమాన కథాసూత్రాన నిబంధించిన విషయాలివి. చదువరులకు ఆసక్తిని గొల్పి కుమారసంభవ ప్రబంధ ప్రాశస్త్యాన్నీ ప్రభాకరుల ప్రామాణిక పరిశోధనదృష్టిని, పాటవాన్ని, వెలుగులోకి తేగలవనే విశ్వసిస్తున్నాము.

ఆర్థికంగాను ట్రస్టు లక్ష్యాలదృష్టితోనూ మాకున్న పరిమితుల మూలంగా మణిమంజరిలో ముందు ముందు ఈవిషయమై చర్చలను కొనసాగించే అవకాశం లేదని మాత్రం మనవి చేస్తున్నాము. అయినా పండిత పరిశోధకులు సత్యదృష్టితో అన్ని విషయాలూ పరిశీలించి పరమార్థాన్ని తేల్చగలరని ఆశిస్తున్నాము.

వ్యయప్రయాసలతో కూడిన ఈ విశేషసంచిక నిలా వెలువరించడంలో ఖర్చుకి వెరచి మామూలుగా మేమిందు కొనసాగించే శీర్షికలు కొన్ని ఈసారి నిలుపుచేయవలసివచ్చింది. అందుకు విచారిస్తున్నాము. సాహిత్యోపాసకులీసంపుటాన్ని సహృదయంతో సమీక్షించ గలరని నమ్ముతున్నాము.

- సంపాదకులు

# నన్నిచోడఁడు

## వేటూరి ప్రభాకరశాస్త్రి

ఉ. దేసి తెలుంగుఁ బల్కులను దీరిచి దిద్ది ప్రబంధశయ్యఁ గై
సేసెఁ గుమారసంభవము శ్రీగురునిం గృతినాథుఁ జేసి పే
ర్వాసి నెసంగె నట్టి కవిరాజశిఖామణి నన్నిచోడఁడౌ
కైసరుఁ డాంధ్రభూమిఁ గలకాలము సంస్మరణీయుఁడే కదా !

బ్రహ్మశ్రీ నడుకుదిటి వీరరాజు పంతులుగారు "నన్నిచోడ కవిరాజశిఖామణి కాలనిర్ణయవిమర్శము" అనుపేరితో శారదా పత్త్రికలోఁ గడచిన వత్సరమునఁ బ్రకటించిన వ్యాసమును (దానిని బుస్తకముగాఁ గూడ వేర్పఱిచి వీరరాజు పంతులుగారు నాకును బంపిరి) దానిపై మొన్నటి సాహిత్యపరిషత్పత్త్రికలో బ్రః రామయ్య పంతులుగారును వీరరాజు పంతులుగారును వేర్వేరుగా మరల వ్రాసినవ్యాసములును జూచితిని. నాలుగు వత్సరములనుండి నన్నిచోడకవి కాలమును గూర్చియుఁ గవితను గూర్చియు నాకుఁ దోఁచిన క్రొత్త విషయములఁ గొన్నింటిఁ బ్రకటింప నేనును గుతూహల పడుచుంటిని. ఈ విషయమును గ్రంథము ప్రకటించిన బ్ర॥ రామకృష్ణకవిగారు గూడ నెఱుఁగుదురు. వీరరాజుపంతులుగారి తొలివ్యాసమును జూచినపిదప నాకుతూహలము మెం డయ్యెను. ఇట్లుండఁగా రామయ్యపంతులుగా రిపుడు నన్నిచోడకవి కాలనిర్ణయమును గూర్చి యొక శాసనమును పరిషత్పత్త్రిక వ్యాసమునఁ బ్రకటించినారు. ఆ శాసనమునే ప్రధానముగా నన్నిచోడకవి కాలనిర్ణయమునకై నేనును బ్రకటింపఁ జూచుచుంటిని. నేను బ్రకటింప నుద్దేశించి యుండుట రామయ్యగారు గాని వారు ప్రకటింపఁ బూనియుండుట నేను గాని తొలుత నెఱుఁగము. ఆ శాసనమును గూర్చి పలుదడవలు శ్రీరామకృష్ణకవిగారును నేనును ఆర్చించుకొని యుంటిమి. కవిగారు కుమారసంభవము ద్వితీయ భాగము పీఠికలో దానిని స్మరించియు నుండిరి. ఈనడుమ రామయ్యపంతులుగారు మద్రాసువచ్చినపు డీశాసనమును దాము

ప్రకటించుచున్నట్టు నాతోఁ జెప్పిరి. వారు నిర్ణయించిన కాలమే నే ననుకొన్నది యగుటచే వారి సిద్ధాంతమునకు నాసిద్ధాంతమునకు నంతగా భేద ముండదు. కాని శాసనసమన్వయమున నేను వారితోఁ గొంత వేర్పడుచున్నాఁడను. ఇఁక వీర రాజుపంతులు గారి వాదమునకు నేను బ్రతికూలుఁడనుగానే యున్నాఁడను. ప్రధానముగా నిందులకే యిప్పుడు నేనీవ్యాసము వ్రాయ నుద్యోగింపవలసెను. వీరరాజు పంతులుగారి వాదమునెడ నాకుఁ గలప్రాతికూల్యమును ముందు దెలిపి పిదప శాసన సమన్వయమునెడ రామయ్య పంతులుగారితో నాకుఁ గలవేర్పాటును వివరింతును.

వీరరాజుపంతులుగారు తమ తొలివ్యాసమున నన్నిచోడఁడు నన్నియకుఁ దర్వాతివాఁ డని వ్రాసినవారి వాదములను గొన్నింటిని జక్కఁగానే ఖండించిరి. కాని యాతఁడు నన్నియకంటెఁ బ్రాచీనుఁ డని సమర్థించుటకుఁ గాఁ దాము ఖండించిన వాదములకంటె దుర్బలములైన వాదములను గొన్నింటి నందుఁ గొని తెచ్చినారు. వా రిట్లు వ్రాయుచున్నారు :—

"ఒక కవికాలమును నిశ్చయించుటకు నిరాక్షేపము లైన శాసనాది దృష్టాంతము లెవ్వియు లభింపనినాఁడు అతని కవిత్వమునుబట్టి యతనికాలమును నిర్ణయింపవలసి యుండు ననుట చారిత్రవేత్తలకు నూత్న విషయము గాదు. ఇప్పు డద్దానిఁ బట్టి యాతఁ డెప్పటివాఁ డైయుండునో కనుఁగొందము.'' అని యాతనికాలము నిర్ణయించుటకుఁ బంద్రెండు సాధనములఁ జూపిరి. అవి యేవో యొక్కటొక్కటిగా ముందుఁ జూపుచు వానిపై నాయాక్షేపము లెఱిఁగింతును.

1. కవిగారు, వీరభద్రరావుగారు నందలికవిత్వము మిక్కిలి ప్రాచీన మనితోఁచు ననుట—

ప్రాచీనము కాదని యెవ్వరు ననుట లేదు. నన్నియ కింకను బ్రాచీన మనుట కాధారము లేదని పలువుర మనుచున్నారము.

2. కుమారసంభవ గ్రంథారంభమున మూర్తిత్రయ, భాస్కర, గజానన, షణ్ముఖ, మార, గౌరీ, సరస్వతీ స్తోత్రములు వేర్వేరుపద్యములఁ గావింపఁబడినవి. ఆంధ్రభారతము మొదట శ్లోకరూపమున నున్న త్రిమూర్తిస్తుతి రాజనరేంద్రున కన్వయించున ట్లొనర్చిన నన్నియభట్టు, చిరకాలమునుండి పరంపరగా వచ్చు

చున్న యీ పూర్వస్తోత్ర పద్ధతి విడిచిపెట్టలేక దానిని సంగ్రహించి యవ తారిక నడుమ—

''హరిహరాజగజాననార్క షడాస్యమార సరస్వతీ । గిరిసుతాదిక దేవతా తతికి న్నమస్కృతిఁజేసి ...'

అని సగము పద్యములో నందఱుదేవతలను జేర్చి వారి కందఱకు నొకటే నమస్కారము గావించినట్లును, పిమ్మట నది క్రమక్రమముగా మాఱి పోయినట్లును గానవయ్యెడి''

ఇది బలాత్కల్పితమయ్యును బొందకున్నది. నన్నిచోడని స్తోత్రరీతిని నన్నియ యనుకరించె ననుటకై నన్నియపద్యమునే వీరరాజుపంతులుగారు మార్చుటకు సాహసించినారు. ''హరిహరాజగజాననార్క షడాస్యమాతృసరస్వతీ'' యని నన్నియరచన ముండఁగా (వీరరాజుపంతులుగారును ''మార'' అని పాఠము వ్రాతప్రతులలోఁ జూడలే దనుచునే యున్నారు. ఇందులకై పనిఁబూని నేనును వెదకితిని. సర్వత్ర ''మాతృ'' అనియే కలదు. అయినను) ''షడాస్యమార సరస్వతీ'' యని మార్చిరి. ఇట్లు మార్పు జరిపినను వారి యభీష్టము నెఱవేఱక పోఁగాఁ బ్రతికూలసిద్ధాంతమే పై పెచ్చు వచ్చుచున్నది. ఎట్లనఁగా:—

నన్నియ పద్యమున 'మార' పాఠము నంగీకరించినను ఒకరి నింకొక రనుకరించి రనుట నంగీకరించినను ప్రాచీనుఁడైన నన్నియ ''హరిహరాజగజాననే'' త్యాదివిధమున దేవతలనందఱను నొక్కపద్యమున స్తుతింపఁగా దానిఁ జూచి కుమారసంభవకథను బ్రపంచించి ప్రబంధశయ్యతో రచించుచున్న నన్నిచోడఁడు ఒక్కొక్కరి కొక్కొక్క పద్యము చొప్పునఁ బెంచి స్తుతి నెఱపినాఁ డనుట సంగతమై యుండును గాని వీరరాజుపంతులుగారు చెప్పినట్లనుట సంగతము గాదు. నాతలఁ పేమనఁగా:— 'మార' పాఠము సరిగాదు. ఒకరి నింకొక రనుకరించిరనికూడ నిర్ణయింపఁగాదు.

3. చోడకవి తన కావ్యము షట్త్రింశదలంకారాలంకృతం బనుటచే ''పదియవ శతాబ్దివాఁడైన దండివఱకు నీయలంకారముల సంఖ్య నిలిచియుండి తరువాతఁ గ్రమముగాఁ బెరుఁగుచు'' పండ్రెండవశతాబ్దివాఁడైన మమ్మటునినాఁటి

కఱుపది దాఁక ప్రసిద్ధమైనట్లు గానఁబడుచున్నది. కావున నిదియు నాతఁడు పూర్వుఁడనుటకుఁ గొంత తోడుపడుచున్నది."

దండి పదియవశతాబ్ది వాఁడు గాఁడు. పదియవ శతాబ్ది కింకను బూర్వమే యలంకారముల షట్త్రింశత్త్వము పెరిఁగినది. నన్నిచోడఁ డొకప్రాచీనాలంకారికుని మతమునుబట్టి యట్లు చెప్పినాఁడనఁదగును గాని యలంకారములసంఖ్య షట్త్రింశత్తుగా నుండిన కాలముననే యాతఁడున్నాఁడని తలంపరాదు. అట్లయిన నాకాల మింకను బూర్వమునకుఁ బోయి నన్నిచోడని గందరగోళమునఁ జేర్చును.

4. "అట్లువోలె, పగిదివోలె, కరణివోలె, మాడ్కివోలె, భంగివోలె, ఇత్యాది (పురాతన) ప్రయోగము తిక్కవిగ్రంథమున లెక్కకు మిక్కిలి యున్నవి. నన్నియగ్రంథమున "అట్లపోలె" అనున దొక్కటియు, తిక్కనదాని యందు "ఇట్లువోలె" అనునదియుఁ గానఁబడుచున్నవి. నన్నియనాఁటినుండియే వీనికిఁ బ్రచారము విరళమైనట్లు తోఁచెడిని. పాల్కురికి సోమన మాత్రము శివభక్తుడగునీతనియెడలఁ గలభక్తి గౌరవాదులచే "కరణియుఁబోలె" 'భంగియుఁ బోలె' నిత్యాదిగ నచ్చటచ్చటఁ బ్రయోగించెను."

ఈవాద మెంతో వింతగా నున్నది. పయిప్రయోగములు నన్నియతిక్కన కృతులలోఁ గూడఁ జూచితి మని వీరరాజపంతులుగారు వ్రాయుచున్నారు. నే నిటీవల నితరకృతులలోఁ గూడఁ జూచితిని. ఇట్లుండఁగా నిది పురాతన మని కుండలీకరించి పంతులుగారు వ్రాయుట వింత. మఱియు వీని ప్రచారము నన్నియ నాఁటినుండియే విరళ మైన దనియు వ్రాసిరి!! అంతకు బూర్వము బహుళముగా నుండుటను వీరెఱిఁగిరా? ఎట్లు? సోమనమాత్రము నన్నిచోడనిమీఁది గౌరవముచే నా ప్రయోగములను బాటించె ననుట మఱియు వింత! సోమన నన్నిచోడని కంటె నర్వాచీనుఁడని వీరెట్లు నిరూపింపఁ గల్గిరి? పంౘ్రెండవశతాబ్దిలోనివాఁడు సోమన బహుళముగా నీప్రయోగమును బాటింపఁగా నిది నన్నియకుఁబూర్వపు దనియు నన్నియనాఁటి కిది విరళ మైన దనియు ననుట సంగతమా? నాతలంపేమనగా:— శివకవులు వీనిని బహుళముగాఁ బ్రయోగించిరి. ఇతరుల కృతులలోఁ గ్వాచిత్కముగా నున్నవి.

5. ఇక్కవిగ్రంథమున సంస్కృతాంధ్రకర్ణాటాది వివిధభాషా విమిశ్రము లైన సమాసములు గానవచ్చుచున్నవి. ఇవి యాతని ప్రాచీనతను జాటుచున్నవి."

అవి కొన్ని ప్రయోగములను వీరరాజుపంతులుగారు చూసిరి. అవి ప్రాచీనతను జాటుచుండె ననుట సంగతమే కాని నన్నియకంటెను ప్రాచీనతను జాటుచున్న వనఁ గాదు. ఉపక్రమమున పంతులుగా రిట్లు **సా**మాన్యముగాఁ బ్రాచీనతను జాటుచున్న వన్నను మీఁద నన్నియకంటెఁ బ్రాచీనతఁ జాటుచున్నట్లే నిర్వహింపఁ బూనినారు. ఇక్కడ వీరు చూపినపదములలో "విగుర్వ ణము కర్ణాటభాషాసంబంధి యగుపదము" అని కలదు. దీనిని గూర్చి శ్రీసాంబమూర్తిశాస్త్రులుగారు, కవిరాజు నీలాద్రిరాజుగారు నిదివఱకుఁ గొంత చర్చ నెఱపినారు. వారితో పాటు నేనును దీని సంస్కృతభాషాసంబంధియగు పదమునుగాఁ దలఁచుచున్నాఁడను. పాల్కురికి సోమనాథుని రచనలోను క్రీ. పంద్రెండవ శతాబ్దిలోని దగు గుంటూరిజిల్లాశాసనము సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్సు వాల్యుం *IV* నెం. 672 పు. 205 శక. 1061 లోను గూడ నీపదము కలదు. దీని విషయ మిం కొకప్పు డెత్తుకొందును.* వీ రిప్పుడు చూపిన ప్రయోగముల వంటి ప్రయోగములు పాల్కురికి సోమనాథుని గ్రంథములోఁ గుప్పతెప్పలుగా నున్నవి. ఇట్టివి శివకవులచే బహుళముగాఁ బ్రయోగింపఁ బడుచు వచ్చినవి. ఈ విషయము విపులముగా వేఱొకప్పుడు దెలుప నున్నాఁడను. వీనిఁ బట్టి చోడఁడు నన్నియకంటెఁ బ్రాచీనుఁ డని సాధింపఁ గాదు.

*దీనినిగూర్చి శాసనవిశేషములు అనుపుస్తకములో నే నిట్లు వ్రాసితిని
నెం. 672, పు 205, శక. 1061.

ఉ. హారతుషారశంఖ విమలాభ్ర మహోజ్జ్వలకీర్తిఁ జాలఁ బొ
ల్పారిన బుద్ధమండలికు నగ్రసుతుండగు మన్మమండఁడా
చారపరుండు నాదెండ్లఁ (?) జారుతరం బగు వెండికొండనా
గౌరి శశాంకమౌళికి విగుర్వనతో గుటినిల్పె భక్తునన్."

6 ఉ. వీఁగు నపారసత్త్వగుణ విస్ఫురణం బరమేశ్వరోరువా
మాంగమునందు మున్నుదయమై నియమస్థితిఁగొల్చి. ..కుమా. ప్ర. 4.

క. వీఁడేమి సేయుఁబంచిన, వాఁడుంతఁగ నిక్కమునకు వధ్యుఁడుగా నా
ఖండలుఁడు గాక యేలిన, వాఁడు .....ద్వి.భా. 520

ఈపూర్ణాపూర్ణ బిందుప్రాసమును నన్నెచోడు లెవ్వరును గూర్చియుండ లేదు. నాచనసోముఁ డిట్టి ప్రాసమునుగూర్చె నని సంపాదకులు వ్రాసి యున్నారు గాని యది సెల్లదు. దీనింగూర్చి పరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడు 'సోముని హరివంశము' అను శీర్షిక గలవిమర్శ గ్రంథమున విస్తరించి చర్చించి యున్నాను. కావున నిచ్చట మరలఁ బర్చింపక విడిచితిని. రామకృష్ణకవిగారు భీమకవిప్రయో

---

ఉ. మేరుగుణావళారుఁ డగు మేడనికిం గలుహారగంధి అం
భోరుహనేత్రి అప్పాయ విభూషణి నాఁదగు మేడమాంబకున్
గారవిలంబుట్టి గుణగౌరవసంపద విస్తరిల్లి గాం
ధారికి సీతకున్ శచికిఁ దానధికం బని ప్రస్తుతింపఁగాన్.''

ఇందు మొదటి పద్యము నాల్గవచరణమున శాసనాక్షరములఁ జదివినవారు తప్పుగాఁ జదివి యుందు రనుకొనెదను. గౌరి యనుచోట "గోరి'' యుండును. 'విగుర్వనతో' అనుచోట ''విగుర్వణతో'' అనియుండెనేమో ? 'భక్తునన్' అని యుండునా ? 'విగుర్వణ' అనియే యగునేని, నన్నయ, నన్నెచోడఁడు, పాల్కురికి సోమనాధుఁడు ప్రయోగించిన పదమది. రెండవ పద్యములో 'కలుహారగంధి' యని కలదు. 'కల్హార' పదము సంస్కృతభాషలోఁ బ్రఖ్యాతముగా నున్నది. 'కహ్లార' మని కొంద అందురు. కలహారమని గాని కలుహారమనిగాని సంస్కృత భాషలోఁ గానరాదు. తెలుఁగునను గానరాదుగాని నన్నెచోడఁ డొక్కఁడు మాత్రము కుమారసంభవమున 'జలజాత కైరవోత్పలకలహారాది గంధంబులోలి సద్గంధములుగ' అని 'కలహార' పదము ప్రయోగించెను. ఇందు కలుహారపద మున్నది. నన్నెచోడఁడుగూడ 'కలుహారగంధి' యనియే వచించియుండవచ్చును. మఱియు 'అంభోరుహనేత్రి' యని కలదు. నేత్రాంతముకంటె జీషను పలువురు తెనుఁగుకవులు పాటించిరి. నన్నెచోడఁడును 'నేత్రి' యనెను.

గమును గూడ నిచ్చిరి. భీమనకాల మిప్పటికిఁ దేలలేదు. ఆతఁ డెప్పటివాఁ డైనను శివభక్తుఁడే కావున పాల్కురికి సోమనాథునివలెనే యాతఁడును శైవుఁ డైనచోడ కవి వ్రాఁతయందుఁ గల ప్రమాణబుద్ధిచే, నీప్రాసము నంగీకరించి యట్లు వ్రాసి యుండును.

దీనింగూర్చి చెప్పవలసినది చాలఁ గలదు. సంక్షిప్తముగా నించుక మాత్రమే యిక్కడ చెప్పుచున్నాఁడను. పాల్కురికి సోమనాథునికృతిలో నిట్టి ప్రాసము గల దని ''శివకవులు'' అనువ్యాసములో నే నివివరకుఁ జూపి యున్నాఁడను. శివకవుల సంప్రదాయములో నిట్టివి సాధువు లని నాయుద్దేశము. నన్నియ కివి సమ్మతముగాదు. ఇట్టి పనులచేతనే నన్నియ వాగనుశాసనుఁ డై యుండు నని నాతలంపు నన్నియ భారతమున నీప్రాసములు కానరాకున్నను నాతనిసమ కాలముననే రాజరాజు చనిపోయినపిదప రెండు మూఁడేండ్లకే (శక 987) చెక్కింపఁబడిన పద్యశాసనములో నీప్రాసము గానవచ్చుచున్నది. నన్నియ నాఁటి కాసంప్రదాయ ముత్పన్నము గాలేదు. ఇది చూచునది.

“నిజభుజప్రథాని బెజయితదేవని కూఁతుసరినె పోల్పఁ గాంతలెందు”

ఈ ప్రాసము నన్నెచోడని ప్రాసమువంటిదే కదా! నన్నియ త్రోవనంగీకరింపక శివకవులు పూర్ణానుస్వారప్రాసమును బాటించిరి. దీనిచే నన్నెఁచోడఁడు నన్నెయకంటెఁ బ్రాచీనుఁ డనుట సాధితము గాదు. నన్నియకు సమ కాలమునను, దర్వాతి కాలమునను గూడఁ బ్రాసమునవచ్చుచున్నది గదా!

7. అథర్వణాచార్యుఁడు నన్నెయభట్టునకుఁ బూర్వుఁడని కొందఱును దిక్కనకుఁ గొంచెము పూర్వుఁ డని కొందఱును వ్రాసియున్నారు ఈతఁడు తన ఛందమున—

క. మగణమ్ము గదియ రగణము
నగవక కృతిమొదట నిలుపు వానికి మరణం
బగు నిక్కమండ్రు మడియఁడె,
యగుననియిడి తొల్లి తెంకణాదిత్యుఁ డనిన్.

అని వ్రాసినాఁ డని మా. రామకృష్ణకవిగారు కుమారసంభవ గ్రంథ పీఠికయం దుదాహరించినారు. వీరేశలింగము పంతులుగారు సయితము కవిచరిత్రమునఁ బై పద్య మధర్వణుఁడు వ్రాసె నని వ్రాసియున్నారు. పై పద్యమున "తొల్లి" అనుపదము గాన నగుచున్నది. ఇది కొన్ని వందల యేండ్లకు ముందున్న కాలమును దెలుపు పదముగా మనవారు ప్రయోగింతురు.

క. నరనుతుఁడు తొల్లి నలుఁ డను, ధరణీశుఁడు - నన్నియ. (ఇది యుగములనాఁటి కాలమును దెలుపు పదము).

గీ. తొల్లి నాలాయనియనంగ దొరయు నింద్ర । సేన పాంచాలి — (ఇదియు నించు మించుగ నిట్టిదే)

ఇవ్విడుపునఁ బ్రాచీనచారిత్రములఁ దెలుపు నీ తొల్లి అనుపదము ప్రయోగించిన యథర్వణుఁడు తిక్కనకు సమకాలికుఁ డనుకొనకున్నను వెంకాణాదిత్య (నన్నిచోడ) కవి యథర్వణునకు నాలు గైదువందల యేండ్లకుఁ బూర్వమున నైన నుండకుండ నాతఁ డాపదమును బ్రయోగింపఁ డనియు, కావుననే చోడకవి నన్నియకు మిక్కిలియుఁ బూర్వుఁ డై యుండు ననియుఁ దలంపఁదగును."

ఇం దసందర్భము లనేకము లున్నవి. భీమకవికాల మెట్లు తేల లేదో యథర్వణునికాలము నట్లే తేలలేదు, అథర్వణకారిక లను త్రిలింగశబ్దానుశాసనమును జూడఁగా నాతఁడు ప్రాచీనుఁడుగా దోఁపకున్నాఁడు. అనిశ్చిత మైన యాతని విషయము నాధారముగాఁ గొనుట యుక్తము గాదు. మఱియు రామకృష్ణకవిగారుదాహరించిన పైపద్యము నే నెఱిఁగినంతవఱకు లక్షణగ్రంథములలో నెక్కడను గాన రాలేదు. నేను దీనిఁ గూర్చి శ్రీకవిగారిని బలుదడవలడిగితిని. తమదగ్గఱ నథర్వణచ్ఛందస్సు కల దనియు దానినుండి యీపద్యము నుదాహరించితి మనియు వారనిరి. ఆ గ్రంథము వెల్వడిన తర్వాత నాయథర్వణుని గూర్చి విశేషము లెఱుఁగగల మేమో కాని యిప్పు డేమియు నిర్ణయింపఁ జాలము. కం వీ. గారు కవిగారిపేరు చెప్పకుండ దాని నుదాహరించిరి, కాని, వారు వేఱొకచోట దానిఁ జూచి యెఱుఁగరు. ఆపద్య మథర్వణుని కృతిలోఁ గానవచ్చినను నందుఁ గల "తొల్లి" యుగములనాఁటి ప్రాచీనకాలమును దెలుపునది గాదు. వీర

రాజుపంతులుగా రాపదము యుగములనాఁటి కాలమును దెలుపునది యని వ్రాసియుఁ దదనుగుణముగాఁ బ్రయోగములఁ జూపియు నన్నిచోడనియెడఁ గొన్ని వందలయేండ్ల ప్రాచీనతకే తృప్తిచెందినారు. "తొల్లి" పదము భూతకాలసామాన్యమును దెలుపునదే కాని, యుగములనాఁటియో వందలనాఁటియో భూతకాలమును మాత్రమే తెలుపునది గాదు. "వెండియుఁ, దొల్లిటి, యిప్పటి" ఇత్యాదులు పెక్కులు ప్రయోగములు 'తొల్లిటి' భూతకాలసామాన్యవాచిత్వమును దెలుపునవి కలవు. నన్నియనాఁటి శాసనపద్యమిది చదువఁదగును.

సీ. శ్రీవిష్ణువర్ధన భూవిభుదయఁ భూమిదేవిబోల్ రేవలదేవి కనిన
సోమలదేవి గుణారామ జగదేకసున్దరి మత్తేభమందగమన
దొల్లి భీమేశ్వరవల్లభునకు సితమణి [బన్ధమి] చ్చె సన్మణియుతముగ
నురువిచ్చె గంగనాం బరువడి విని వారిం బురుడిం [చన] ట్టి [యా]
సరసిజాస్త్ర
గనకరచితరుచిర కల్పావనీరుహ, కుసుమ మిచ్చెఁ దనకు నసము వెరుగ
వెణ్డిమణ్డతో నఖణ్డిత ద్యుతిదీప, మమరనిచ్చె విమలకమలనేత్రి.

ఇందు తొల్లి యుగములనాఁటియొండె వందలనాఁటియొండెఁ బ్రాచీన కాలమును దెలుపునదిగాదు. పూర్వకాలమును మాత్రమే (ఈపూర్వత ఎంత యెక్కువైనను నలువది యేఁబది యేండ్లకంటె మించదు. కొన్ని మాసములయినను గావచ్చును.) దెలుపుచున్నది. ఏవిధముననుబయిపద్యము వీరరాజుపంతులు గారి వాదమునకుఁ దోడ్పడఁ జాలకున్నవి.

8. "నిరుఋతి వారిమాయల కనిం బ్రతిమాయ లొనర్చి" ఇందునిర్ ఋతి అనుపదము నాలుగు లఘువర్ణములుగాఁ గవి ప్రయోగించినాఁడు. ఇది వేదోచ్చారణము ననుసరించి కాళిదాసుఁడు త్రియమ్బకం అని ప్రయోగించినట్లే మనకవీంద్రుఁడును బ్రయోగించె నని తోఁచుచున్నది. "ఇది యాతని పురాతనత్వమును ఘోషించుచున్నది"

అని పంతులుగారు వ్రాసిరి. కాని యందే మరల వారు వ్రాఁతప్రతియందు నిర్ఋతి అని యున్నది. ఇట్లున్నను నిఋురుతి యను నుచ్చారణమునే కవి

గ్రహించియుండు నని తోఁచెడి. నిర్తృతియు అని యుండఁ గూడదా యని కొంద ఱందురు. కాని నన్నయ నన్నిచోడుల "యు" వర్ణప్రయోగములు, సామాన్యా ములు గావు అని వ్రాసిరి. నన్నిచోడఁడు నిఋరుతి అని ప్రయోగించినను నది నన్నయకంటె నాతఁడు ప్రాచీనుఁ డని తెలుపఁజాలదు. అది యాతఁడు వైదిక రూపమును గ్రహించె నని మాత్ర మెఱిఁగించును. ఇంతకును మనకుఁ బ్రమాణ మైన వ్రాఁతప్రతిలో నిర్తృతి అనియే యుండఁగా వీరరాజుపంతులుగారు 'నిఋ రుతి' అను కల్పిత పాఠమును గై కొనుటయు నదియే కవి ప్రయుక్తమై యుండు ననుటయు సంగతముగా నాకుఁ దోఁపకున్నది. నిర్తృతియు అనుటయే సము చితము. పూర్వపద్యము. చూడదగునుఁ

క. ఆయిరుపురు బహుబలాక్షస, మాయావిదులగు డెఱింగి మార్కొనుమనిర
మ్మాయనుచుఁబంచె నిరు(ర్తృ?)తిను, పాయజ్ఞునసేకసమరపరిణతునజితున్.

చ. నిర్తృత (యు?) వారి మాయల కనిం బ్రతిమాయ లొనర్చి... .

ప. అంత నారణ దుర్వారులు నిరు (ర్తృ) తితో .. ..

ఇక్కడ ముందు వెనుకల నిర్తృతిపదమే ప్రయుక్త మైనది. నడుమ నున్నది గూడ నట్టిదే యగుననుట సమంజసము. నిర్తృతియు, అనుట యర్థాను గుణము తత్కాల రచనానుగుణమును. 'నిర్తృతి వారి మాయల' యని వ్రాఁతలో నుండఁగా నక్షరలోపము (యు?) అని యొకయక్షరము చేర్చినంతనే చక్కఁగా సరిపడుచుండఁగా దానిని విడిచి 'నిర్తృతి'ని 'నిఋరుతి' యని యెక్కువమార్పు చేయుట యుక్తము గాదు. ఆ పదము జతకూర్చినను నది భాషలో నప్రతీత మైనది. ఇట్టివానిచే నన్నిచోడఁడు నన్నయకంటెఁ బ్రాచీనుఁడని సాధించుట సాహ

9. నన్నిచోడఁ డెట్టిదియే నొకవిషయమును వర్ణించి వర్ణించి "అని యనేక ప్రకారంబుల వర్ణింపఁ దగిన వర్ణనల కెక్కి" అని యనేక ప్రకారంబుల ———నమరి" ఇత్యాదిగ వ్రాయుచుండును. ఇవ్వచనములపక్కిఁ జూడ, పురా తన యక్షగానాదులయందుఁబోలె వీనియందును బ్రాచీనత గోచరించుచున్నది."

ఇట్టిరచన పాల్కురికి సోమనాథుని కృతులలోఁ బెక్కుచోట్ల నున్నది. నన్నెచోడునకును బురాతనములైన యక్షగానములు గానవచ్చినవా? మున్నూఱేండ్లకుఁ బూర్వమునఁ దెనుఁగున యక్షగానము లేవిగలవో నే నెఱుంగఁ జాలకున్నాను!

10 సంఖ్యగలది బహుకవిసాధారణ మగుటచే దానిఁగూర్చి చర్చ యనావశ్యకము.

11 సీ. కాలంబుగూడ ఁగంబు లేర్చుట యెంత
యల వని హరులోచనాగ్ని 'నుఱడు'
వనరాశిఁ దగు మెత్తఁదన మెర్గి యేచు డే
బంమని బాడబానలముఁ 'దెగడు'
మూర్వెట్టనోపని మ్రాఁకు లేర్చుట యెంత
వా లగునని వనవహ్ని 'నవ్వుఁ'
గలితనం బెఱుఁగని కులగిరు లేర్చు డే
వాఁడిమి యని పవి వలనిఁ ''బలుకు''
నెలమిఁగోమలమగుతోవలేర్చు డెంత, తనదుతీవ్రత్వమనితీవ్రధాము'నెత్తుఁ'
దనకుఁబ్రతిలేకదిక్కులు దాఁకివెలుఁగుఁ' దారకాసుర మోరప్రతాపవహ్ని.

ఇందు మొదటి పాదములోని 'ఉఱడు' అనునది తక్కినపాదములలోని తెగడు, నవ్వు మొదలగు వానివలెఁ గేవలధాతురూపము. పద్యమునఁ గర్త ప్రతాపవహ్ని. నన్నియభట్టు 'ఉఱఁడు (డు?) సురేంద్రుడైన బలిరాముండు హీవెం బుఁడు వాని ఘాతికెన్, వెఱపని వారలుం గలరె—'' అని ప్రయోగించినాఁడు. కాని యతఁడే నన్నిచోడని యితరము లగు 'ఉఱరు' ఉఱక ఇత్యాది రూపములం బట్టి దీనిని సయితము 'ఉఱు' ధాతువ్యతిరేకార్థముగా గ్రహించెనో లేక ప్రత్యేక ధాతువుగానే ప్రయోగించెనో, నిర్ణయింపరాని సందిగ్ధస్థలమున దీనిని బెట్టినాఁడు. ఎట్లయిన నేమి? తరువాతికవులు దీనిని 'ఉఱడు' అని కేవల ధాతువుగాఁ బ్రయోగింపమి నీధాతువు మన నన్నిచోడకవినుండి నన్నియకడకు సందిగ్ధరూపముతో వచ్చి పిమ్మట ముచ్చముడిగె ననితోఁచుచున్నది.

పై ఉఱడు శబ్దము వలెనే నన్నిచోడని వలననుండి నన్నియచే వేఱువిధ ముగ గ్రహింపఁ బడినట్లు దోపించు విచిత్రప్రయోగము నింకొకదానినిమాత్ర మిచ్చట నిచ్చెదను.

కాంచు వరుదయ్యెన్ = కాంచుట + అరుదయ్యె; ఇచ్చుదాజి = ఇచ్చుట + ఆజి; ఒదవుడిదేమి = ఒదవుట + ఇదేమి."

ఉఱడును గూర్చి పంతులుగారు వ్రాసినది సంగతము గాదు. నన్నియ నన్నిచోడనిఁజూచి సందిగ్ధముగాఁ బ్రయోగించె ననుపంతులుగారి మాటలు దల క్రిందుచేసి నన్నిచోడఁడే నన్నయనుజూచి ప్రయోగించె నని యింకొకఁడు నన వచ్చును. అట్లుగా ననుట కేమియాధారము వారు చూపఁగలరు? ఆపద మప్పటి వాఙ్మయమున సాధారణముగా నుండుటచే నాయాకవు లట్లట్లు ప్రయోగించి రనుట బాగు. నన్నిచోడనినాఁట స్పష్టముగా నున్నపదము నన్నియనాఁటికి సందిగ్ధ రూపముతో వచ్చిన దనుట సాహసము. అది ఉఱుధాతువేయని నన్నియ నన్ని చోడాదుల ప్రయోగములు, ఉఱఁడు, ఉఱరు, ఉఱక, ఇత్యాదు లెఱిఁగించు చున్నవి. పంతులుగా రుదాహరించిన పద్యమున 'ఉఱ (ఁ?)డు కూడ వ్యతిరేక ధాతు రూపమయియుండు నని నా తలంపు. "ఉఱడు"అని కేవలధాతురూప ముండె ననుటకు దానిమీఁద నితరరూపము లెక్కడను గానరాకున్నవి. ఉఱడక, ఉఱడిన, ఇత్యాదులు గానరావుగదా! కుమారసంభవముద్రితప్రతిలో 'లోచనాగ్ని సుఱఁడు' అని సార్ధానుస్వారముగానే యున్నది. పంతులుగారు నిరనుస్వారముగా నుదాహరించినారు.

ఇఁక—కాంచు వరుదయ్యె—నిత్యాదిరూపములఁ గూర్చి పంతులుగారు సాహ సపు సిద్ధాంతముల నెలకొల్పఁబూనినారు. భావార్థకపు టకు బదులు డు పెక్కు చోట్లఁ గాన వచ్చుచున్నవి. పెక్కు లిప్పటికి నున్నవి. దూఁకుడు, అద్దుడు, ఇత్యాదులు నేఁటి వ్యవహారమునఁ గూడఁ గాననగును. డము రూపము గూడ క్వాచిత్కముగ నిట్లేకలదు. ఒత్తడము, అద్దడము మొదలగునవి. ప్రాచీన కవు లలో డము అసాధారణముగాను ట డు సాధారణముగాను గానవచ్చుచున్నవి. సందర్భానుగుణముగా నన్నియ నన్నిచోడ మంచన కేతన తిక్కనాదు లీ యా రూపములను బ్రయోగించిరి. "నన్నిచోడని గ్రంథమున భావార్థకటకారము తనకుఁ బరమైన యచ్చుతో సంబంధింపఁబడినపుడే యిట్టి డత్వముఁ జెందుచు

న్నట్లు గాన్పించుచున్నది. (గ్రంథమంతయుఁ జూడుఁడు) అని పంతులుగారు వ్రాసిరిగాని గ్రంథమంతయుఁ జూడఁగాఁ బంతులుగారి వ్రాఁతకుఁ బ్రతికూలము లగు ప్రయోగములు పెక్కులు గానవచ్చుచున్నవి. ఈ క్రిందివానిని జూడుఁడు:—

పావకో, ల్కారశిఖలఁ బురాంగపవ కాలహరంబగుటేమి పెద్ద.
కుమా. ప్ర. భా. 862 పద్యము.

మఱచితొ కాలఫాలు నజమస్తక సంహరునిట్లు పల్కుటే,
ప్ర. 171. పద్యము

నిగ్రహంబు వడుటేమి పనియని—ప్ర. 214 వచనము.

సీ, వప్పరమేశునేయుటనయంబు—ప్ర. 554. పద్యము.

రజ్జుసె, ప్పుడునది ద్వి—516.

అచ్చులో నిట్లున్నవి వ్రాఁతప్రతిలో నిట్లు లేవని పంతులుగారు నిరూపింపఁ గలరేమో! వ్రాఁతప్రతిలో వేఱువిధముగా నుండుటను వారు చూచియున్నచో నది తెలిపియుండవలయునుగదా!

కాలంబుగూడ ఇత్యాదిపద్యములో, అచ్చులో, ''యేచుటే బలమని—కుల గిరి లేర్చుచేవాఁడిమి'' అని యుండఁగాఁ బంతులుగారు ''యేచుదేబలమని;కుల గిరు లేర్చుదేవాఁడిమి'', యని మార్చి యుదాహరించినారు. మఱియు 'రజ్జుచెప్పుడు నది' యుండఁగా, రజ్జుచెప్పుడదియు నని యుదాహరించిరి. వ్రాఁతప్రతినిబట్టియే వా రట్లు మార్చిరేమోకదా! తెలుపరయిరి!

నన్నిచోడఁడొకవేళ హల్లుపరమైనపుడు చేయుడు ఇత్యాదివిధముల డుతో భావార్థకములఁ బ్రయోగింపకున్నను (పంతులుగా రన్నట్లే లేఖక మహాశయులు మార్చివేయుటచేఁ గానరాకుండెనేమో) నది యాతని కసమ్మత మనుట హృద్యము గాదు. అట్లయినను నాతఁడు నన్నయప్రయోగరీతిని గుర్తింపఁజాలక దానిని విడిచిపెట్టె నని పంతులుగారివలెనే యింకొకరు ననవచ్చును. అట్లు కాదనుట కాధార మేమి? నన్నయకంటె నన్నిచోడఁడు ప్రాచీనుఁ డని నిరూపించుట కిట్టివి తోడ్పడునా? ఇట్టి ప్రయోగములు తిక్కన కూడఁ బ్రయోగించెనని పంతులు గారు చూపుటచే నది యాతిక్కననాఁటిదాఁక సాధారణమై యున్నదని యేర్పడు

చుండెఁ గదా! దీని నాధారముగాఁ గాని నన్నిచోడఁడు నన్నియ కంటెఁ బూర్వుఁడని సాధించుట యెట్లో ! నన్నిచోడఁడు సాధుప్రయోగకర్త యని తద్రహస్యము గుర్తింప నేర్చినవాఁడు తిక్కన యని వారి నిర్వరను సంభావించి యారహస్య మెఱుఁగఁ జాలమివోలె నన్నియకుఁ జెప్పి యాతనిఁ జిన్న వుచ్చుచు నిక్కడ పంతులుగారు వ్రాసినవ్రాఁత హృద్యముగా నాకుఁ దోఁపకున్నది.

మఱియుఁ బంతులుగారు "నన్నియభట్టారకుని సంస్కారమునకుఁ దర్వాతఁ దైకవిత్వమువంటి కవిత్వమును జెప్పిన యాంధ్రకవి యొక్కఁడును గానరాఁడు. కావున నితఁడు నన్నియకుఁ దరువాతివాఁడై యుండఁడు" అని వ్రాసిరి. నన్నియకుఁ బూర్వ మిట్టికవితఁ జెప్పినవారు పెక్కురు గానవచ్చిరా ? ఇది వింత గదా? పాల్కురికి సోమనాథుఁ డెప్పటివాఁడు?

12. వక్రము—"ఇది నన్నియకుఁ బూర్వము వ్యవహారములో నున్న శబ్ద మనియు, తత్పూర్వశాసనములందు మాత్రమే కానవచ్చుచున్న దనియు, శాసనపరిశోధకుల యభిప్రాయమై యున్నది. ఇప్పదము మన ప్రాచీన కవిరాజు గ్రంథమునఁ గానవచ్చుచున్నది. శుక్రుండు "వక్రంబై" — ఇప్పద మీ యర్థమున నన్నియాదులగ్రంథమునఁ గానరాక మన రాజకవి, నన్నియభట్టారకునకు మిక్కిలిఁ బూర్వుఁడై యుండెనని వేనోళ్ళఁ జాటి చెప్పుచున్నది."

పంతులుగారీక్రిందిప్రయోగమును స్మరింపఁ గోరుచున్నాను. 'ఆకార్యము నిర్వక్రముగా నెఱవేఱెను.' అతఁ డవక్రవిక్రముఁడు—ఇత్యాది విధముల నేఁటి రచనలలోఁ గూడ వక్రపదము నన్నిచోతఁ జేయర్థమునఁ బ్రయోగించెనో యా యర్థముననే ప్రయుక్త మగుచున్నది. 'వక్రంబు వచ్చువారు,' 'వక్రంబు వచ్చిన' అను పలుకుబడి నేఁడు గానరాదు గాని వక్ర మనుపదము నేఁడు నున్నది. శాసనములోని 'వక్రంబువచ్చు' మిక్కిలి ప్రాచీన మైనదే. దానిని నన్నిచోడఁడు ప్రయోగింపలేదు ఈపదము నన్నియకంటె నన్నిచోడఁడు మిక్కిలి ప్రాచీనుఁ డని వేయినోళ్లఁజాటుచున్నదనుట యచ్చెరువు గొల్పుచున్నది.

శ్రీనడుకుదుటి వీరరాజు పంతులుగారు నన్నిచోడఁడు నన్నియకంటెఁ బ్రాచీనుఁ డనుటకు వెలయించిన సాధనముల దౌర్బల్యమును లఘుతరముగా నిక్కడ వివరించితిని. శ్రీరామయ్య పంతులుగా రిప్పుడు ప్రకటించిన శాసన విషయము

నెత్తుకొనకయే యున్నను గూడ నే నిప్పుడు విమర్శించిన విధముగ వీరరాజు పంతులుగారు చూపిన యాధారములు నన్నిచోడని నన్నయకంటెఁ బ్రాచీనునిగా నిలువరింపనేరని వగుచున్నవని నా నమ్మకము. ఇఁక సహృదయులు ప్రమాణము.

ఇట్లయి యున్నను వీరరాజు పంతులుగారు (రక్తాక్షి శ్రావణ—కార్తిక మాసముల పరిషత్పత్త్రికలో) ప్రకటించిన వ్యాసమున నిట్లు వ్రాసినారు.

"భట్టారక మహాశయునికిఁ బూర్వము తెనుఁగునఁ గవిత్వమే లేదని విశ్వసించియున్న యాంధ్రులహృదయక్షేత్రములయందు 'అతనికి మున్ను తెనుఁగు కవిత గలదు' అను వాక్యబీజముల నావాపించుటయే మొదట దుర్ఘటమయ్యెను. ఎట్టకేలకుఁ బరిశోధనములు వెల్లివిరిసినకొలఁది నవి నాటుకొన 'అతనికిఁ బూర్వ ముద్గ్రంథములు లేవు గాని స్వల్పముగఁ బాటలు పద్యములు నుండినవి' అను భావాంకురములు క్రమముగాఁ దలసూపెను. ఇట్టిచో 'నన్నయకు మున్ను ప్రబంధము లుండెడివి' అను పలుకుఁదీవలు రేకెత్తుటకుఁ గాలచక్ర మింకను దొరల వలయునేమో——నేఁటిపఱకును నన్నిచోడకవి కాలమునుగూర్చి కావింపఁబడిన విమర్శనములయం దొక్కటియు నిర్బాధకమగు నొక్క యాధారముతో నైనఁ గూడినదిగా నుండలే దనియు నాతఁడు నన్నయకుఁ బూర్వుఁడయియే యుండు ననియు నిరూపించుచు నేనొక విమర్శమును వ్రాసితిని."

ఇక్కడ నన్నయభట్టారకునకుఁ బూర్వ మాంధ్రకవిత్వము లేదనుకొను చున్న సామాన్యలోకమును వీరరాజుపంతులుగారు గేలి గొనుచున్నారు. వాస్తవమున కిక్కడ నమాయిక మగులోకముగా దధిక్షేపింపఁ దగినది! నన్నయకుఁ బూర్వ మాంధ్రకవిత యున్నదనుట కాధారము లేమియు గోచరింపకున్నపుడు లోకమంతకుముం దాంధ్రకవిత లేదేమో యనుకొనెను. యుద్ధమల్లుని శాసనము దొరకొన్న పిదపఁ బద్యరచనము కల దనుకొనెను. మఱికొన్ని యాధారములచేఁ బాటలు పదములు మొదలయిన రచన లుండె ననుకొనెను. స్పష్టముగాఁ బ్రాచీన గ్రంథములు దొరకెనేని యవియుఁ గల వనుకొనును. ఇది యుక్తమే కాదా! కాలచక్ర మింకను దొరలఁగాఁ బంతులుగారు మొదలగువారిప్పు డాంధ్రులహృదయ క్షేత్రములందు రేకెత్తింపఁ జూచుచున్న "నన్నయకుమున్ను ప్రబంధము లుండెడివి" అనుపలుకుఁ దీవలు ఐంద్రజాలిక విభ్రమములై యంతరింపఁ గలవేమో యని నే ననుమాన పడుచున్నాను. ఐంద్రజాలికు లందఱముందు బాటలో మావి

విత్తు నాటఁగలరు. మొలకెత్తింపఁగలరు. చిగురెత్తింపఁగలరు. పూవులుఁ బిందె లును బుట్టింపఁగలరు. కాని మాయికమైన యామావిమోక యెందాఁక నిలువఁ గల్గును? చిత్తగించి నలువురుఁ జూడఁబోయిన రిత్తయగునుగాదా !

క. మును మార్గకవిత లోకం, బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గునిలిపి రంధ్రవిషయమునఁ, జనసత్యాశ్రయుని దొట్టి చాళుక్యనృపుల్.

అను పద్యమును నింద్రజాలపుఁ గుంచె విసరుతో మొలకెత్తిన "నన్ని యకుఁ బూర్వ మంధ్రప్రబంధము లున్నవి" అనుభావాంకుర మాకుంచె కూలి పోయిన పిదప మాలిపోయినట్టే యయ్యెను. ఇట్టిచో—

క. మును మార్గకవిత లోకం, బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గునునిలిపి రంధ్రవిషయం, బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్.

అని బయల్పడిన యమాయికపద్యమునకు సముచితముగాఁ జెప్పఁ దగిన యర్థమును పంతులుగారు సన్నగా జాలువిడిచినారు. నన్నియభట్టున కాశ్రయ మైన రాజరాజు మొదలగువారి నీపద్యము చెప్పుచున్నదని నేను భావించితిని. (రాజనరేంద్ర నవమశతాబ్దసంచిక చూచునది) రామలింగారెడ్డిగారు నట్లే భావించిరి. పంతులుగారు దానిని పరిభావింపకున్నారు. మఱి వారు చెప్పు నర్థమేమో !

ఈపద్యము నన్నియ కాశ్రయమైన రాజరాజు మొదలగువారినే పేర్కొను చున్న దని యిప్పుడు రామయ్య పంతులుగారు ప్రకటించిన శాసనమువలన మఱింత సుదృఢముగాఁ జెప్ప నొప్పుచున్నది. ఏలయనఁగా నాశాసనమును బట్టి నన్నిచోడఁడు రాజరాజునకు నూఱేండ్లకుఁ దర్వాతికాలమున వెలసినవాఁడుగాఁ దెలియవచ్చుచున్నాఁడు. ఆ నూఱేండ్లకాలమున నంధ్రమున 'పలువుర్' కవులు తెలియవచ్చుచున్నారు.

వీరరాజు పంతులుగారు ద్వితీయవ్యాసమున నన్నిచోడని శబ్దపరికరసం పత్తినిగూర్చి వ్రాసిన గ్రంథమునకు నేను మిక్కిలియుఁ బరితోషము చెందుచు న్నాను. అది వారి భాషాపరిశ్రమను వేనోళ్లఁ జాటుచున్నది. అందుఁ గొన్నింట నేను భిన్నాభిప్రాయము గలవాఁడను; కొన్నింట వారి యభిప్రాయమును బలపఱుచువాఁడను. మఱియొకపుడు నేనును నన్నిచోడని కావ్య విశేషములఁ

గూర్చి కొంత వ్రాయ నుద్యోగించి యున్నాఁడను గాన యాయా విషయము లందుఁ జేర్కొందును.

ఇఁక రామయ్య పంతులుగారు ప్రకటించిన శాసనమును గూర్చి నేను జెప్పఁ దలఁచినది సంగ్రహముగాఁ జెప్పుచున్నాఁడను :—రామయ్య పంతులుగారు శాసనము నెంచుక తప్పుగాఁజెప్పి రని నేననుకొనుచున్నాఁడను. వారిట్లు వంశ వృక్షముం జూపిరి.

చోడబల్లి
|
నన్నిచోడఁడు

సూరరాజు — ఘటంకారుఁడు
|
మల్లిదేవుఁడు
|
నన్నిచోడఁడు
|
మల్లిదేవుఁడు

శాసనశ్లోకములఁ గూడఁ జూపుచున్నాఁడను.

తత్రసూర్యాన్మను — స్తస్మా దిక్ష్వాకు — స్తత్కులే నృపః
అ దేవీ త్కరికాలాఖ్య చోడ — స్తస్యాన్వయే జని
చోడబల్లినృప — స్తస్మా న్నని చోడ — స్తదాత్మజః
సూరభూప — స్సుత స్తస్య రాజరాజమహీపతిః —
తస్యానుజో ఘటంకారనృపోహంకారశంకరః —
తస్యచోడమహాదేవీప్రియా — తత్తనయోనయా
మల్లిదేవనృపో యత్రక్షాత్రధర్మా (ర్మో ?) న్యలీయత —
తస్యకాంతా మహాదేవీ నన్నిచోడ స్తయో స్సుతః
న్యగ్రహీదుగ్రవీరారీ న్య (న ?) గ్రహీద్విజయ శ్రియమ్ —

అథనిజప్రధానినః పౌరుషమాదృత్య రాజకన్నరదేవ స్సమాగత్య అస్మిన్ పుణ్యతీర్థే సుప్రతిష్ఠితం సోమేశ్వరం నత్వా భక్తిప్రేరితమనా దేవా యైనం కొప్పరగ్రామం దత్తవాన్ — తదైవ తదనుజన్మా చోడబల్లిదేవః పూర్వదిశి క్రోశ మాత్రే చీదెపల్లి నామగ్రామం ప్రాదాత్ .. ..

దాపయిత్వా తటాకౌ ద్వౌ దేవాయ తదనంతరం
పాలూర్పురసముత్పన్నం ధృతకాలాముఖవ్రతమ్ ।
మల్లికార్జున మభ్యర్థ్య తస్మైతత్త్వార్థభావినే
సోమేశ్వరవరం స్థానం ప్రాదాదాచంద్రతారకమ్.

శక 1037 సంవత్సరమునఁ గామదేవచోడభూపాలుని కొడుకు లగుకన్నర దేవచోడ, చోడబల్లిదేవులు చేసిన ధర్మముల నీశాసనము చెప్పుచున్నది. కన్నర దేవుని భాండాగారికుఁడు కొప్పరగ్రామమున రెండుచెఱువులఁ ద్రవ్వించెనట! కన్నరదేవుఁ డందుల కానందించి యక్కడఁ బ్రతిష్ఠితుఁ డగు సోమేశ్వర దేవునకుఁ గొప్పరగ్రామము నొసఁగె నట. ఆతని యనుజన్ముఁ డగు చోడబల్లి దేవుఁడు చీదె పల్లి గ్రామము నొసఁగె నట. మఱియు నాతఁ డక్కడఁ ద్రవ్వించిన రెండు తటాకములను దేవున కిప్పించి యటు పయి పాలూరుపురమందు జన్మించిన వాఁడును కాలాముఖవ్రతమును బూనినవాఁడును నగుమల్లికార్జునుని బ్రార్థించి తత్త్వార్థభావియగు నాయనకొఱకు సోమేశ్వరవర మను స్థానము నాచంద్రార్క ముగా నొసఁగెనట.

పెదచెఱుకూరిశాసనమున లెక్కింపఁబడిన విధమునఁ జోడబల్లికొడుకగు నన్నిచోడని (మననన్నిచోడకవి) కాలమున కీ శాసనకాలము సరివచ్చుచున్నది. నన్నిచోడకవి గురువగు మల్లికారునుఁ డీతఁడు కావచ్చు ననుట మిక్కిలి సంగ తముగానుండును. మఱియు నీశాసనములో కాలాముఖమల్లికార్జునునకు సోమేశ్వర వరము నిప్పించిన చోడబల్లియు, పెదచెఱుకూరి శాసనములో మొదటి వాఁడుగఁ జెప్పఁబడిన చోడబల్లియు (నన్నిచోడకవితండ్రి) నొక్కఁడయినను గావచ్చును. పెదచెఱుకూరిశాసనమునఁ జోడబల్లి తండ్రిపేరు గానరాదు. ఈ కొప్పర శాసనమునఁ జోడబల్లి సంతానము తెలియరాదు. చోడబల్లి,

కామదేవచోడ, కన్నరదేవచోడ, నన్నిచోడాదులు, వేర్వేరుగాఁ బెక్కుశాసనములలోఁ గానవత్తురు గాని యీ కొప్పరపు శాసనములోని వారితో వార్వెవరు నేకీభవింపకున్నారు. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్ 4 వాల్యూం 467 పేజీలో నొక చోడశాసనము కలదు. అది యొక్కటి మాత్ర మీకొప్పరశాసనమునఁ గల కన్నరదేవచోడ, చోడబల్లిదేవులదే. దాని కాలముకూడ శక 1043 అగును.

కొప్పరపుశాసనమునఁ గానవచ్చు చోడబల్లి నన్నిచోడకవితండ్రి గాకపోవచ్చును. వారిద్దఱు వేఱుపురుషులు గాకపోవుటవలన వచ్చువిశేష మంతగా లేదు. పెదచెఱకూరిశాసనమున, పాకనాఁడిరువదియొక్క వేయిటి కధీశుఁడు, చోడబల్లి కుమారుఁడు, నగు నన్నిచోడఁడు దొరకినాఁడు. కొప్పరపుశాసనమునఁ దెలుఁగుచోడులచే నారాధితుఁడు, కాలాముఖ దీక్షగొన్నవాఁడు నగు మల్లికార్జున గురువు దొరికినాఁడు. ఈనన్నిచోడ మల్లికార్జునగురువు లేకకాలపువారగుట స్పష్టమయినది. కుమారసంభవమున నన్నిచోడనిఁగూర్చి తెలియవచ్చుచున్న విషయము లంతకంటె నెక్కువలేవు. అందు నన్నిచోడని తల్లిపేరు శ్రీసతి యని యున్నది. పైశాసనమునం దది కానరాలేదుగాన నాతఁడేంవాఁడనరాదని యాక్షేపింపరాదు. అట్లాక్షేంపింపఁ బూనినచోఁ గల్గెడు ననర్థములకు మితిలేదు.

నన్నియకంటె నన్నిచోడఁడు, నూఱేండ్ల తర్వాతికాలమువాఁ డని పయి చర్చవలన నిర్ధారిత మగుచున్నది. నన్నిచోడని కవితారచనను గూర్చి వేఱొకప్పుడు విస్తరించి వ్రాయ నున్నాఁడను. ఇక్కడ నొక్కపదమునుగూర్చి యించుక యుగ్గడించుచున్నాఁడను. రామయ్యపంతులుగారు కుమారసంభవము ముద్రితప్రతిలోని దోషముల నెఱింగించుటకై తాళపత్రప్రతిలోని పద్యములఁ గొన్నింటిని చూపినారు. అందొకపద్యము :—

క. వలిమొగ్గల విరిపువ్వుల
 సలలితమయిచూడ నొప్పెఁ జనుపక (జంపక)
 మత్యుజ్జ్వలరుచి రేఖగలారక
 వెలిగెడు నుద్దీపదీపవృక్షమువోలెన్. తంజావూరు ప్రతిపాఠము.

ఇందు 'చనుపక' మని యుండఁగా నది తప్పని తలఁచి రామయ్యపంతులుగారు (చంపక) అని కుండలీకరించి సంస్కారము చూపినారు. అట్టిసంస్కారమనావశ్యకము. చనుపక మనుపదము కలదు.

''న్యగ్రహీదుగ్రవీరారీన్ అగ్రహీద్విజయశ్రియమ్ । . . తాభ్యాం భూచక్ర శక్రోభూ న్మల్లిదేవమహీశ్వరః । (రామయ్యపంతులు గారు ప్రకటించిన శాసనము).

''న్యగ్రహీ దరిచతుర్విధసైన్యాన్యగ్రహీ — దిత్యాదికమగు నీ రెండవ శాసనము శ్లోకమును జూడఁదగును. మఱియు రెండు శాసనములు నొక్కచోటివే. గణపతి చనిపోయిన తర్వాతిది గాన యీ రెండవ శాసనమున గణపతి దేవునికి ఋణ్యము గా నని లేదు. గణపతి చనిపోయిన తర్వాత నామల్లిదేవుఁడు తలయెత్తి స్వతంత్రుఁడై యుండును. ఈశాసనమునఁ దలిదండ్రులపేళ్లు లేవు గావున నీవిధమున నీమల్లిదేవుఁడే యామల్లిదేవుఁ డగుట గుర్తింపవలసెను.

శక 1221 సంవత్సరమున శాసనము నెలకొల్పిన యీ మల్లిదేవుఁడు గణపతి దేవుని జీవిత కాలమున నెలకొల్పిన శాసనాంతరము (మన ప్రస్తుతశాసనము) శక 1170- 1180 సంవత్సరముల సమీపకాలపు దగుననుట యసంగతము కానేరదుగదా! దీనిచే రామయ్యపంతులుగారు చెప్పిన కాలముకంటె మన ప్రస్తుత శాసనము మఱి ముప్పదియేండ్ల తర్వాతి దగుచున్నది. ఇట్లు ముప్పది యేండ్ల తర్వాతికి వచ్చినను, వారు వంశవృక్షమున నొకపురుషుని విడుచుటచేత నా ముప్పదియేండ్లు నాతనితరము కాలముక్రిందఁ గొట్టివేయఁగా రామయ్యపంతులు గారన్నట్టే ఘట్టకుటికా ప్రభాతన్యాయమున మొదటి నన్నిచోడనికాలము శక 1040 ప్రాంతపుదే యగుచున్నది.

రామయ్యపంతులుగారు ప్రకటించిన శాసనములోని మొదటి నన్నిచోడఁడే కుమారసంభవకర్త యని నేనును నమ్ముచున్నాను. ఇందులకై యింకను శ్రీ సోమశేఖరశర్మగారి తోడ్పాటుతోఁ దెలుఁగుచోడుల శాసనము లెన్నికలవో వానిలో నెందఱు నన్నిచోడులు గలరో యెందఱు చోడబల్లులు గలరో యెందఱు మల్లిదేవులు గలరో వారి నందఱను, ఆశాసనములను శోధించి శోధించి చర్చించి చర్చించి చివర కిదమిత్థమని యిట్లు నిర్ణయించుకొన్నాను. ఇంతవఱకుఁ జేకూరిన శాసనములలో వీరుగాక వేఱొకరు మనకు సరివచ్చువారు కానరాలేదు. ఇంక నొక్క విశేషము.

మన నన్నిచోడఁడు కుమారసంభవమును దనగురుఁడగు మల్లికార్జుననకు సమర్పించెను. ఆమల్లికార్జునుఁడు శైవులలో నొకతెగయగు కాలాముఖులలో

జేరినవాఁ డని శ్రీ రామకృష్ణకవిగారు నిరూపించిరి. ఆతఁడు బసవ మల్లికార్జున పండితారాధ్యులవంటి వీరశైవుఁడు గాఁ డని కుమారసంభవముఁ జదివినవారెల్లరు నంగీకరింతురు. అందు శక్తిపూజ, మండలార్చన, మొదలగు నాచారములు వీరశైవగర్హితములు కాలాముఖసమ్మతములు గానవచ్చుచున్నవి. కావునఁ గవిగారు నిరూపించినట్టు లామల్లికార్జునుఁడు గాలాముఖుఁడని నిశ్చయింపవచ్చును. ఇప్పు డిందు ముందు నిరూపించిన నన్నిచోడనికాలముననే (శక 1040 చేరువ) పెద్ద చెఱుకూరికిఁ జేరికం గల గ్రామముననే (కొప్పరమున) ఒక మల్లికార్జునయోగి కాలాముఖుడు గలఁడు. అతనిని వీరేశలింగము పంతులుగారించుక స్మరించినారు. కాని వారు చెప్పిన చొప్పున నన్నిచోడనివిషయ మక్కడఁ జిక్కుఁబడకుండుటచే నది యాదృతము గాదయ్యెను. ఆమల్లికార్జునుఁడు తెలుఁగుచోడులచే నారాధితుఁ డయి నాఁడు.

ఇది చెచువుఁడు—కొప్పరపుశాసనము. 1915 సం॥ గవర్నమెంటు శాసనసంచయమున నున్నది.

“స్వస్తిశ్రీ....కావేరీతీర కరికాలకులరత్నప్రదీపాహితకుమారాంకుశ శ్రీమన్మహామండలేశ్వర కన్నరదేవచోడ మహీపాల స్సకలభూపాలతిలకః.

శ్లో. శ్రీకామచోడక్షితిపాలపుత్రః, ప్రత్యర్థికాంతాగళసూత్ర దాత్రః ।
రామాంబరీషాది లసచ్చరిత్రః, సూర్యాన్వయాంభోరుహషండమిత్రః ॥
ఆసీ త్తస్య కులప్రధానపదవీవిభ్రాజితశ్రీస్సిధి
ర్భాండాగార మహాధికారమహితః ప్రత్యక్షధర్మాత్మజః ।
ధీమానీశ్వరనాయకస్య తనయో మారాభిధానః కృతీ
నిత్యం దర్మ నిబద్ధబుద్ధి రసకృత్పుణ్యక్రియావర్ధనః ॥
శ్రీశైలప్రాగ్భాగే కమ్మక్షితిమహిత కొప్పరగ్రామే
ద్వౌ ఖానితౌ తటాకౌ తేన స్వేతూపమాన ఘనసేతూ ।
గిరిరామఖేందు గణితే శకభూపాబ్దే జయాబ్దకే చైత్రే
సూర్యగ్రహణనిమిత్తే కృతవాన్ తాన్ మహాధర్మాన్ ॥

గంగాదేవి ప్రియాతస్య మహాదేశ మతిచక్రమే —
తాభ్యాం భూచక్రశక్రో భూన్మల్లిదేవ మహీశ్వరః —

పై శ్లోకములందు నేను జేసిన యన్వయమున కనుగుణముగాఁ బిర్వ్యాగేఖ లుండులను. ఈవిధముగాఁ జూడఁగా వంశవృక్ష మీక్రిందివిధమున నేర్పడు చున్నది.

చోడబల్లి

సన్నిచోడఁడు
|
సూరభూపతి

రాజరాజు — ఘటంకారనృపతిఁ (చోడమహాదేవి) భార్య
|
మల్లిదేవుఁడు (మహాదేవి) భార్య
|
నన్నిచోడఁడు (గంగాదేవి) భార్య
|
మల్లిదేవుఁడు

రామయ్యపంతులుగారు చూపిన వంశవృక్షమున రాజరాజు లేఁడు. శ్లోకములఁ జూడఁగా నేను జూపిన వంశవృక్షమే సరియైనదని యేర్పడఁగలదు. దీనిఁబట్టి వంశవృక్షమున నొకతర మెక్కువ యగుచున్నది.

రామయ్యపంతులుగారు, వంశమునఁ గడపటివాఁడును, శాసనము నెల కొల్పినవాఁడును, నగుమల్లిదేవుఁడు (శాసనమునఁ గాలనిర్దేశము లేకున్నను) శ. 1140 సంవత్సర ప్రాంతమువాఁ డగునని వ్రాసిరి. కాకతీయగణపతి దేవు నకుఁ బుణ్యముగా నాశాసనము నెలకొల్పఁబడినది కావునను గణపతిదేవుఁడు శక. 1140 సంవత్సరప్రాంతకాలమున వెలనాఁడు జయించి శక. 1182 సం॥ దాఁక రాజ్య మేలినాఁడు గావునను, ప్రస్తుతశాసనకాలమును గణపతి వెలనాఁడు జయించి నప్పటి కాలముగానె (శక. 1140) సామాన్యదృష్టిని రామయ్య పంతులుగా రట్లు వ్రాసిరి. ఈశాసనము గణపతి వెలనాఁడు జయించినకాలముననే వెలయింపఁ

ఒకిన దగునేని దయ్యాలరేవూరిశాసనమువలె నిదిగూడ గణపతిపేరనే యుండఁదగి యుండును. కావున నిది యంతకుఁ గొంత తర్వాత కాలమున వెలయింపఁబడిన దయియుండు ననవచ్చును. ఆతర్వాతికాలము గణపతియవసానకాలమగు శక. 1182—కు లోఁగా నెప్పుడేని కావచ్చును గదా!

పెదచెఱకూరిలోనే దొరకిన **శాసనాంతరమును** బట్టి యాకాలము శక 1170—1180 సం॥ దగ్గఱిదిగానే నిర్ణయింపఁదగిన దగుచున్నది.

ఇది చదువుఁడు:- ఓరియంటల్ లైబ్రరీలోని శాసనముల వాల్యూం నెం. 1 792 పేజీ పెదచెఱకూరికరణం నోరి కృష్ణయ్యగారి యింట్లో ఉన్న తామ్రశాసనము. ప్రసక్తమైన భాగమే ఉదాహరించు చున్నాఁడను.

జాతశ్శ్రీకరికాల పార్థివకులే రత్నాకరేచంద్రవత్
శ్రీమద్రాజసమాజ భూషణమణి శ్శ్రీమల్లిదేవాహ్వయః
నిస్త్రింశత్రుటితారి మోటకఘట స్తంబేరమగ్రామణీ
ర్మస్తిష్కాసి పిశాచభూతనికరశ్లాఘ్య ప్రతాపోదయః
న్యగ్రహీదరిచతుర్విధసైన్యా
న్యగ్రహీదఖిల దిగ్జయలక్ష్మీమ్
మల్లిదేవ జగతీపతిశక్ర
శ్శక్రసూనురివ చక్రిసహాయః

తారారాట్కరపద్మినీహితమితే (1221) శాకాబ్దజాలేగతే, **సాక్షాదీశ్వర** వత్సరే శుభకరే మాఘాస్యమాసేసితే। పక్షేపర్వణి సోమవారసహితే సోమగ్రహోపక్రమే! కృత్వాస్నాన మనూన మంత్రవిధినా పాథోనిధే సన్నిధౌ। ... పంచోత్తరశతఖారీపరిమేయమహీ మగస్త్యనాథాయ। శ్రీమల్లిదేవనృపతిః ప్రాదా దిహనం(పం)డికుంట నామనిశి

రామయ్యపంతులుగారు ప్రకటించిన శాసనము నెలకొల్పిన మల్లిదేవుఁడే యీశాసనము నెలకొల్పిన మల్లిదేవుఁ డగును.

చనుపకములఁ గొనఁ జనునే మాటికి, ననవిల్తునిమన్నన గలమేటికి.

యయాతిచరిత్రము.

శబ్దరత్నాకరమున నీప్రయోగము చూపఁబడినది. దీనిచే నాపదము వైకృత మని యెఱుఁగదఁగును. ఇదికూడఁ జదువఁదగినది

సీ. ధూర్జటి కోపాగ్ని ధూళిగాఁ గ్రాఁగిన
నాఁడేల నీయమ్ము వాఁడిలేదు
వాఁడికోఱల వాహువడిఁదోలి కఱచిన
నాఁడేల నీరశ్మి వేఁడిలేదు
శాపంబు శ్రీరామభూపాలుఁ డిచ్చిన
నాఁడేలకూయవో పోఁడిగాను
చనుపకములకల్గి కనుకనిడుల్లిన
నాఁడేల మ్రోయరో నేఁడుమీరు
మగువఱాయి యెఱిఁగి మగఁటిమివాటించి,
యేయఁగాయఁగూయమ్రోయ నగునె
మదన! చంద్ర! పికమ! కొరదమతుమ్మెదలార!
నాఁడు నాఁడు నాఁడు నాఁడు లేరె.

భావనపెమ్మన యనిరుద్ధచరిత్ర — ప్రబంధరత్నావళిలోఁ జూచునది.

[శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రచించిన ఈ వ్యాసము ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సంపు. 14—సంచిక. 1.లో (క్రోధన చైత్రవైశాఖ మాసములు) — 1925 సం॥ న ప్రకటింపబడినది. దాని నిట పునర్ముద్రించినాము.]

— సంపాదకుపలు

# కుమారసంభవము

## వేటూరి ప్రభాకరశాస్త్రి

స్రగ్ధర :

[1]శ్రీవాణీంద్రామరేంద్రార్పిత మకుటమణి శ్రేణిధామాంఘ్రి పద్మా
జీవోద్యత్కేసరుం [2]డాశ్రితజనలక్షితాశేషవస్తుప్రదుం [3]డా
దేవాధీశుండు [4]నిత్యోదితు [5]డజుఁడు [6]డాద్యుండు [7]విశ్వై
కావాసుం డెప్పుడుఁ మా కభిమతములు ప్రీతాత్ముఁడై యిచ్చుఁ గాతన్. 1

మహాదేవుఁడు ప్రీతాత్ముఁడై మాకు అభిమతములు ఇచ్చుఁగాత.— మహాదేవుఁ డెట్టివాఁ డనఁగా,

(1) శ్రీవాణీ..... కేసరుండు — శ్రీవాణుల యింద్రులు — శ్రీయింద్రుఁడు విష్ణువు; వాణి యింద్రుఁడు బ్రహ్మ; అమరుల యింద్రుఁడు, దేవతాధిపతి, శచీపతి; 'అమరీంద్రా' అనియేని పాఠము కావచ్చును. తొలియిర్వురును వారి దేవేరులతోను దేవేంద్రుఁడు (శచితోనే కాక తక్కుఁగల దేవతలతోను) సాష్టాంగ నమస్కారము చేయుచో (తమతమ) కిరీటములను శివుని పాదములం దర్పింపఁగా కిరీటములలోని మణిశ్రేణుల వెలుఁగులు ఆపాదము లనెడు పద్మములకు జీవకళలు గొల్పెడు కింజల్కము లయినవి. అట్టి పాదపద్మ కింజల్కములు గలవాఁడు; (2) ఆశ్రయించిన జనులు కోరిన సర్వవస్తువులను దయచేయువాఁడు; (3) ఆ దేవ + అధీశుఁడు — దేవతల (పిపీలికాదిబ్రహ్మ) పర్యంతముగల సర్వప్రాణులకు అధీశుఁడు (4) నిత్యముగా నుదయించుచునే (జన్మించుచునే, పెంపొంచునే) యుండువాఁడు — శివుఁడు అష్టమూర్తులతో జగమును ఆత్మను సృష్టించుచు, నందు వర్తిల్లుచునే యున్నాఁడనుట — అయినను (5) పుట్టుకలేనివాఁడు; (6) సృష్టి కంతకుఁ దొలుతటి యాధారమైనవాఁడు (7) విశ్వమందే ముఖ్యముగావసించువాఁడు—

మహాదేవుఁ డనుపేరు శివునకే చెల్లినది. తక్కినవారందఱు దేవతలు దేవాధిదేవులు ఇత్యాది విధముల పేళ్ళవారు.

సీ. అల దేవదేవుఁడై యలరారు శివునకే
తేజరిల్లును మహాదేవపదము
అల త్రివిష్టపవిభుం డయిన వాసవునకే
యెన్నిక గనును మహేంద్రపదము
అల కాళికాదాసుఁ డగు కవీశ్వరునకే
గణన కెక్కును మహాకవి పదంబు
అల పతంజలి కృతంబయిన భాష్యమునకే
పరిఢవిల్లును మహాభాష్యపదము —

అని యస్మద్గురుచరణులు.

'ఆజీవము' [.... ....]*

నన్నిచోడఁడు శివు నిట్లు స్రగ్ధరాకృతిపుష్పస్రజమున నలంకరించి యర్చించినాఁడు. గ్రంథారంభమున స్రగ్ధరావృత్త ముండరాదని, నన్నిచోడఁ డట్లు చేయుటచే యుద్ధమున మరణించెనని, శ్రీరామకష్ణకవిగా రొకఛందపద్యము అందుకు జ్ఞాపకమని యధర్వణచ్ఛందములోనిదానిగా కుమారసంభవ పీఠికలో నుదాహరించినారు — (చూ. ప్రథమభాగపీఠిక 4 పుట)

క. మగణంబు గదియ రగణము
వగవక కృతిమొదట నిలుపువానికి మరణం
బగు నిక్క మంత్రము మడియఁడె
యగు నని యిది తొల్లి చెంకణాచెత్యుఁ డనిన

అధర్వణచ్ఛందము నాకు దొరకలేదు. లక్షణగ్రంథములలో నుదాహృతమయిన యధర్వణచ్ఛందః పద్యములలో నీ పద్యము గానరాలేదు ఇట్టి సందర్భమున నధర్వణునిదిగా నీ క్రింది పద్యమున్నది.

* భారవి — అని కు. సం॥ మార్జినల్ నోట్సులో కలదు] శాస్త్రిగారు వ్రాసియుంచిన వ్యాఖ్యానపు చిత్తు ప్రతియిది. అక్కడక్కడ వారే కొన్ని మార్పులుచేర్పులుచేసి, మఱికొన్ని తావుల,పూరింపవలసిన శాళీస్థలములుంచిరి. అట్టి తావుల బ్రాకెట్ల [...] నడుమ సూచింపబడిన అంశములు భావించి మేము చేర్చినవి. —సంపాదకులు.

[ఆంధ్రభాషాయా మథర్వణచ్ఛందసి—

క. యగణంబు గదిసి చంపును
రగణముతో గదిసి ఘోర రణమొనరించున్
భగణమిక నొక్క చిత్రము
మగణముతోగూడ కాలమరణము పతికిన్.]

అథర్వుణుఁ డిట్టి పద్యమును రచించి యుండఁడని నానమ్మకము. ఏలనఁగా మహాకవు లనేకులు గ్రంథారంభమున మగణరగణము లుండుపద్యమును స్రగ్ధరను జేర్చినారు.

స్రగ్ధరా లక్షణము.

[మానొందుఁ స్రగ్ధరాఖ్యఁ మరభనయయయల్ మత్తనాగాష్టవిశ్రా
మానూనప్రాప్తులై సఁ హరిముఖదివిజుల్ యాతుధాన వ్రజంబుల్
సానందాసక్తితోఁ దోయధికడ నమృతం బారగింపంగ నచ్చో
మానిన్యాకారతఁ సమ్మదము వొదలఁ బద్మాధవానందపుత్త్రీ।
—అప్పకవీయము]

ఈ పద్యము తొలిచరణమున యతి శవర్ణరేఫముల సంయుక్తముగా నున్నదిగాన యా రెండక్షరములలో దేనికైనను వీలు గుదిరిన ట్లిటీవలివారు యతిని బొసగించుచున్నారు యతినియతముగా నొక్కరేఫతోనే యిక్కడ కలదు. ఒకచోట 'శ'కు మఱొకచోట 'ర'కు యతి కల్పన చేయలేదు. ప్రాచీను లట్లు చేయలేరు.

సీ. రమణీయ శృంగార రజతపర్వతము నా
 శోభిల్లు శుద్ధ విస్ఫూర్తి మూర్తి
ఆపర్వతాగ్రహేమైక శృంగంబు నా
 నమరు జటామకుటాతిఖ్యాతి
ఆతుంగ శృంగ శిలాపూర్ణ సరసి నాఁ
 బొంగారు జాహ్నవీ భూరివారి
ఆ నిమ్న సరసీ విహార మరాళికా
 పంక్తినా నొప్పు కపాలమాల

గీ. యా మహామరాళికా బర్హణాంభోజ
పుష్పనిభసముత్థ భోగి భోగి
సమితిఁ దాల్చి పొల్చు శంకరుం డంబికా
ధవుఁడు మా కభీష్టదాతగాత. 2.

మహనీయాకారము గలవి— రజతపర్వతము, దానిపై హేమశృంగము, ఆశృంగాగ్రమున ఆపూర్ణసరసి, దానిలో విహరించుమరాళపంక్తి, ఆమరాళములు పెకలించి పట్టుకొను కాడతోడి తామరపూవులు అనునవి. ఆపర్వతాదులు ఒక్కచోటనే కుదుర్కొని యుండునవి ఒక్కంతలో నొక్కచూపునఁ జూడ రానివి మహనీయములు, స్థలాంతరమునకు రప్పింపరానివి; యగునట్టి యట్టి వానివి సంగ్రహరూపముగా చిత్రరచన చేసినచో (నేఁడు ఫోటో తీసినచో) ఒక్కంతలో ఒక్కచూపుతో సులువుగా స్థలాంతరములందుఁ గూడఁ జూడఁ దగినట్లుగా వెలయించుటగును. ఆట్లే యిక్కడ రమణీయ శృంగారమయిన రజతపర్వతమో యన్నట్లు ఆ పర్వత సంగ్రహరూపముగా శివుని శుద్ధవిస్ఫూర్తి (తెల్లని ప్రకాశము)గల మూర్తి యున్నది. ఆపర్వతముమీఁది హేమైకశృంగమా యన్నట్లు సంగ్రహరూపముగా శివుని జటామకుటాటిటాటియున్నది. ఆశృంగాగ్రము మీఁది యాపూర్ణసరసియా యన్నట్లు సంగ్రహరూపముగా శివుని జటామకుటముమీఁది గంగాహ్రద మున్నది. లోఁతయిన యాహ్రదములో విహరించు నంచలబంతులా యన్నట్లు కపాలమాల లున్నవి. ఆమరాళములు పెకలించి కఱచుకొని పట్టుకొనియున్న (కాడలతోడి) తామరపూవులాయన్నట్లు శివుని తలనుండి మేనెల్లఁ దాఁచులు పడగలు విప్పి యెగయుచున్నవి. ఈ విధముగా రమణీయశృంగారమయినకైలాసపర్వతము సర్వత్ర కదలిరాలేదుగాని దాని సంగ్రహరూపమా యన్నట్లున్న శివుఁడు సర్వత్ర ప్రపన్నులఁ జేర వచ్చి దర్శన మీయగలఁడు ప్రపన్నుల కారమణీయశృంగరకైలాసాదిదర్శనము శివదర్శనముననే సిద్ధమగును.

ఆమహామరాళికా బర్హణ= అగొప్పయంచలు పెల్లగించిన, అంభోజపుష్ప నిభ=తామరపూవులవంటి, సముత్థభోగిభోగి సమితిః=ఎగయనెత్తిన పడగలు గల పాముల గుంపును,— పడగలు తామరపూవులు, త్రాచులు వాని కాడలు.

ఇందు అలంకార ముత్ప్రేక్ష. విస్ఫూర్తిమూర్తి, మకుటాతిభాతి, భూరివారి కపాలమాల, భోగిభోగి, దాతగాత అనుచోట్ల అనుప్రాస మను శబ్దాలంకారము.

ఇది సర్వయతిసీసము. శ సలకు, అ హలకు — యతు లిందున్నవి. చరణాంత్యానుప్రాసములు నేను సరిదిద్దినవి. మకుటాదిభాతి, కపాలలీల, భోగభోగి — పూర్వపు వ్రాఁతప్రతిలోని, కవిగారియచ్చుప్రతిలోని, పాఠములు.

చ హరి వికచామలాంబుజ సహస్రముఁ బూన్చి మృగాంకు నం దవి<br>
స్ఫురితమలాసితాబ్జమని పుచ్చఁగఁ జాచినచేయిఁ జూచి చం<br>
దురుఁ డది రాహుసావి వెఱఁ దుప్పలఁ దూఁగఁగ జాఱుచున్న న<br>
య్యిరువురఁ జూచి నవ్వు పరమేశ్వరుఁ డీవుత మా కభీష్టముల్. 3.

మహావిష్ణువు పరమశివుని శివసహస్రనామములతో స్తుతించుచు వికచామలాంబుజ సహస్రమున్ = విరఁబూచినవి. ముఱికి లేక బురద మఱకలు లేక, నల్లఁబాఱక శుభ్రములుగానున్న వేయితామరపూవులతో, పూన్చి = పూజచేసి—(నాఁడు) వేయిపూవులపూజ ముగిసిన తర్వాత పూజావైభవమును, పుష్పాలంకరణ సౌందర్యమును గన్నార దర్శింపఁగా అందు మృగాంకున్ = జింకయంకము గలవానిని చంద్రుని (ఁజూచి) అవిస్ఫురిత — వికసింపని, మలాసిత = (పంకము, ముఱికి అంటి)నల్లని మఱకగల, అబ్జము = తామరపూవు అన్న భ్రాంతి గలిగి విష్ణువు నొచ్చుకొని దానిని పుచ్చఁగన్ = దొలఁగింపఁగాఁ దలఁచి చేయి చాఁచినాఁడు, చంద్రుఁడా చేతినిజూచి పడగవిప్పి మీఁదికి వచ్చుచున్న రాహువు (పాము) అన్న భ్రాంతి గొని వెఱపుతో తుప్పలఁ దూఁగుటకై జాఱఁ దొడఁగినాఁడు. అట్లు భ్రాంతు లయిన విష్ణుచంద్రులను జూచి పరమశివుఁడు నవ్వి భ్రాంతి దీర్చి యోదార్చి నిలుపుకొన్నాఁడు. అట్లు విష్ణునకుఁగూడ భ్రాంతిఁ దొలఁగించు పరమేశ్వరుఁడు మా కభీష్టఫలదుఁ డగుఁగాక !

'మాకు' అనఁగా భ్రాంతిగ్రస్తులయిన శివభక్తులకు ఒండె శివకవులకు అనిభావము. విష్ణుఁడు గూడ భ్రాంతిగ్రస్తుఁడే. ఆయన బావమఱది చంద్రుఁడును భ్రాంతిగ్రస్తుడే. అయినను వారు సేవకులయిరి గనుక భ్రాంతిదీర్చి చక్కదిద్దుకొన్నాఁడు— ఇట్లు స్తుతించుటచే శివుఁడు మాకును భ్రాంతి

తొలగింపగలఁడు శివుఁడు సర్వజ్ఞుఁడు, భ్రాంతి యెఱుఁగనివాఁడు నని కవి యిందు శివునిదయాళుతను ఉత్కర్షను బ్రతిపాదించినాఁడు

అలంకారము భ్రాంతిమంతము.

వికచామలాంబుజ సహస్రము అను సమస్త పదమునకు అవిస్ఫురిత—మలాసిత—అబ్జ మనుట ప్రతికూల పదము. 'మృగాంకుఁ' అనుట సాభిప్రాయము ఇట—పరికరాంకుర మలంకారము.

ఈ పద్యమున మృగాంకుకంద, కండ పాఠములు కల్పితములు. గ్రాహ్యములు కావు. 'నెఱ'—వ్రాఁతప్రతి. 'వెఱ' అని కాని 'నెఱి' అని కాని యుండఁదగును. తుప్పలఁ దూఁగు, తుప్పలఁ దూలు, తుప్పలఁ దూఱు అనియుఁ బ్రాచీన కవి ప్రయోగము లున్నవి. 'తుప్పలఁ దూఁగు' మార్ప నక్కఱలేదు. అదియుఁ బ్రాచీన కవి ప్రయోగరూఢ మయిన పలుకుబడియే. కల్పిత మయినను బ్రయోగ రూఢ మగుటచే 'తుప్పలఁ దూఱఁగ జాఱుచున్న' అనుట యనుప్రాస సౌందర్యము, శయ్యా వైయాత్యము గలది.

విష్ణువు శివునకు సహస్రకమలార్చన చేయుట పండితారాధ్య చరిత్రమున మహిమ్నస్తవమునఁ గలదు.

ఉపమన్యు శిష్యుఁడై యుడురాజమౌళి
నపరిమితప్రీతి నర్చించువిధము
భువిని వేయిటి కొక్క పువ్వు దక్కువైన
శివుఁ గన్ను పూన్చి పూజించిన విధము

పండితారాధ్యప్రకరణము.

శివునకు సహస్రకమలార్చనముఁ జేయుచు నందొక కమలము కొఱవడఁగాఁ దన నేత్రకమలమునే వేయవ కమలముగా విష్ణు వర్పించినాఁడట.

హరిస్తే సాహస్రం కమలబలి మాధాయ పదయో
ర్యదేకోనే తస్మిన్ నిజ ముదహర న్నేత్రకమలమ్.

మహిమ్నస్తవము.

మూఁడు పద్యములలో ముమ్మారు (బహుపర్యాయము లనుట) శివస్తుతి చేసినాఁడు. 'ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః'—ఇత్యాది విధముల ముమ్మారు పలుకుట విషయదార్ఢ్యార్థము. మూడు ముళ్లు వేయుట మొదలగున విట్టివే.

ఉ. వీఁగు నపార సత్త్వ గుణ విస్ఫురణం బరమేశ్వరోరువా
మాంగము నందు ము న్నుదయమై నియమస్థితిఁ గొల్చి తద్దయుం
లోఁగిన పేర్మితో నఖిల లోకములుం దగఁ గాచుచున్న వే
దాంగు ననంతు విష్ణుఁ గమలాధిపు సంస్తుతిఁ దెల్తు సమ్మతిన్ 4.

సర్వము శివుఁడే కాన యాయనయే త్రిగుణములును- ఆయన సత్త్వగుణము అపారమై, వీఁగగా=పిక్కటిల్లఁగా నది పరమేశ్వరుని వామాంగమున విష్ణువై యవతరించి నియమపూర్వకముగా శివునిఁ గొల్చెను. ఆ కొల్వునకుఁ బరమేశ్వరుఁడు పేర్మితో లోంగిపోయెను. తదనుగ్రహమున విష్ణు వఖిల లోకములఁ గాచుచున్నాఁడు. అతఁడు వేదాంగుఁడు, అనంతుఁడు, కమలాధిపుఁడు. శివభక్తుఁడు గనుక విష్ణుని సమ్మతితో తెల్తును=స్తుతింతును.

వ్రాఁతప్రతిలో 'తెల్చ' యున్నది. సమాపకక్రియగా నుండుట పూర్వోత్తర పద్యరీతికి ననుగుణ మని మార్చుట—

ఈపద్యమున వీంగు లోంగులు అర్వాచీన భాషలో వీఁగు లోఁగులుగా నున్నవి. 'వామాంగ, వేదాంగు' అను సంస్కృత పదములలోని పూర్ణానుస్వారపూర్వక వర్ణములతో (అనునాసిక హల్లయినను జ్ ప్రాకృతాంధ్ర సంప్రదాయమున నది బిందువుగా మాఱినది) అర్వాచీన భాషాలక్షణము చొప్పున నది పూర్ణార్ధానుస్వారప్రాస మనవలెను. లేదా వీఁగు, వింగుగాను లోఁగు లొంగుగాను హ్రస్వపూర్వక పూర్ణబిందుఘటిత పదములన్నిసరిచూచుకోవలెను. ఒండెఁ బ్రాచీన భాషాలక్షణము చొప్పున నవి దీర్ఘపూర్వక పూర్ణబిందు రూపములుగానే గృహీతము లయిన వనవలెను. ఇట్టి ప్రాసముల గూర్చి విపుల చర్చ మఱొక చోట రాఁగలదు.

ఆది నీశ్వరుని వామాంగంబు చెమట
శ్రీదయితుఁడు జనించిన తద్విధంబు

పండితారాధ్యచరిత్ర—వాదప్రకరణము

'దక్షిణాంగమ్ము నస్త్రముగఁజేసి' యని బొడ్డపాటి పేరయ విజయవాటీ మల్లికార్జున శతకమున 'దక్షిణాంగంబ యస్త్రంబు చేసి' అని యేతద్విరుద్ధముగాఁ జెప్పినాఁడు. చూ. ప్రబంధరత్నావళి.

చ. అమిత రజోగుణ స్ఫురణ నావహమై పరమేశు దక్షిణాం
గమున జనించి భక్తిఁ జిరకాలము సద్విధిఁ గొల్చి తత్ప్రసా
దమున నజాండ లోక జనితత్త్వ సువేద కళాగమాది వి
శ్వము సృజియించి పొల్చు నజు వాగ్విభు సంస్తుతి చేసెద న్మదిన్. 5.

సత్త్వగుణమున విష్ణువు శివుని వామాంగమున జనింపఁగా, రజోగుణమున శివుని దక్షిణాంగమున బ్రహ్మ జనించినాఁడు. శివునారాధించి తత్ప్రసాదమున 'అజాండ, లోక, జని, తత్త్వ, సువేద, కళాగమాది విశ్వము=బ్రహ్మాండములు, అందు లోకములు, ప్రాణులు చతుర్వింశతి తత్త్వములు, సువేదములు (శైవాగమములు ?) కళలు, శాస్త్రములు, మొదలయిన సర్వమును సృజియించి యొప్పారుచు అజుఁడుగా నున్న వాగ్విభుని—సరస్వతీ వల్లభుని 'మదిన్ సంస్తుతి చేయుదున్'.— 'సంస్తుతి చేసి సన్మతిన్' అని వ్రాఁతప్రతి. పూర్వ పద్యము తుద 'సంస్తుతిఁదెల్తు సమ్మతిన్' అని కలదు. ఇక్కడకూడ నట్లే యుండిన నుండవచ్చును. 'సంస్తుతి చేతు సన్మతిన్' అని దిద్దుటకంటె 'సంస్తుతి చేసెద న్మతిన్' అని దిద్దుట వ్రాఁతప్రతి లిపి కనుగుణము, సుందరము. ఒండె 'సంస్తుతిఁ దెల్తు సన్మతిన్' అని యుండఁదగును. 'లోక నిజ తత్త్వ' అనియేని కవి పాఠము గావచ్చును. ఈ పద్యములెల్ల సమాపక క్రియలతో ముగియుచున్నవి గాన, వ్రాఁతప్రతిలోని 'దేల్చి', 'చేసి' పాఠములు రెండు పద్యములలోనివి గ్రాహ్యములు గావు.

చ. అనుపమ దివ్యమూర్తి యను నంతియ కాదు భవాష్టమూర్తులం
దును వరమూర్తి దాన ప్రభతోడ జగజ్జన రాజికెల్ల నిం
దనయము దాన దృష్టి యను నంతియ కాదు త్రిలోచనాదిలో
చనమును దాన యైన రవి చారునిజప్రభ మాకు నీవుతన్. 6.

సూర్యస్తుతి యిది. అతఁడు అనుపమ దివ్యమూర్తి యనునంతియ కాదు. భవుని యష్టమూర్తులందును తాన వరమూర్తి. ప్రభతోడ జగజ్జనరాజికెల్లనిందనయము

దృష్టి నిచ్చు ననునంతియ కాదు. త్రిలోచనాదిలోచనమును దాన; బన రవి చారు నిజప్రభ మాకు నీవుతన్.

స్వయముగా తాను సాటిలేని దివ్యమూర్తి యను నంతే కాదు. భవుని యష్టమూర్తులలో ప్రశస్తమూర్తియుఁ దానే. జగమునఁ బుట్టిన ప్రాణికోటి కంత కును నీ లోకమున చూచుటకు వెలుఁగును దానితో కనుటకు దృష్టియు సదా తానే యగు నను టంతే కాదు; ముక్కంటి మూఁడు కన్నులలో తొలికన్నును దానే యయినవాఁడు సూర్యుఁడు; సుందరమయిన నిజకాంతిని మాకుఁ బ్రసా దించుఁ గాక. 'చారునిజప్రభ' యనుట, లోకమున వ్యక్తముగాఁ గానవచ్చు మండువెఁడకంటె సౌమ్యమయిన ప్రభ యొకటి కలదని, సూర్యుఁడు దానిని ప్రపన్నుల యెడఁ బ్రసాదించునని తెల్పుటకు; 'రాజికెల్ల నెందనయము' అని కవి పాఠమేని, సూర్యకాంతి భూలోకముననేకాక యూర్ధ్వలోకము లన్నింటికిఁ గూడఁ గలదని తెల్పుటగును.

చ. తను వసితాంబుదంబు, సితదంతముఖం బచిరాంశు, వాత్మ గ
ర్జన మురు గర్జనంబు, కరసద్రుచి శక్రశరాసనంబు నై
చన మదవారివృష్టి హితసస్యసమృద్ధిగ నభ్రవేళ నాఁ
జను గణనాథుఁ గొల్తు ననిశంబు నభీష్టఫలప్రదాతగాన్. 7.

గణేశ్వర స్తుతి యిది! గణనాథుని మేను కాఱుమబ్బు; తెల్లని దంతాగ్రము మెఱుపు; తన బిగ్గఱ యఱపు పెల్లుఱుఱుము; తొండపుశోభ యింద్ర ధనుస్సు నై యొప్పఁగా మదోదకవర్షముచే హితసస్య సమృద్ధి=హితు లనెడు సస్యములకుఁ బరితృప్తి, కన్=అగునట్లు, అభ్రవేళ=వానకారు; నాన్ చను గణనాథు=అననొప్పు వినాయకుని; అభీష్టఫలప్రదాతగా, ననిశము=సదా, కొల్తును.

ఇందు 'దంతయుగం బచిరాంశులు' అని వ్రాఁతప్రతిలోని, ముద్రణ ములలోని పాఠములు. వానిని నేను దిద్దితిని. విఘ్నేశ్వరుఁ డేకదంతుఁడు గాన తక్కిన వన్నియు నేకవచనముననే యున్నవిగాన (తనువు, అంబుదము, గర్జ నము, రుచి, శరాసనము, వృష్టి సమృద్ధి, అభ్రవేళ) యట్లు మార్చితిని. దతాం

గ్రము నోరు మూసినపుడు గానరాక తెఱచినపుడు గానవచ్చును. అప్పు డచి రాంశు సామ్యము సుందరముగా నుండును.

ఈపద్యమున రూపక మలంకారము.

మూఁడు చరణములందు సరసయతి—చవర్గమునకు శషసలకు యతి సరస యతి జ–స; చ—స; జ—శ; యతు లిందున్నవి.

క. తన జనకుఁ డురుస్థాణువు
జనని యపర్ణాఖ్య దా విశాఖుం డనఁగాఁ
దనరియు నభిమతఫలముల
జనులకు దయ నొసగుచున్న షణ్ముఖుఁ గొలుతుణ్ 8.

తన తండ్రి పెద్ద మొఱడు — గొప్ప, స్థాణువు — శివునికి 'స్థాణు' వని నామము. అమరము వ్యుత్పత్తి చూ.

జనని, అపర్ణాఖ్య = పర్ణములు, ఆకులు లేనిదని పేరు గన్నది. ఋణము లేనిది [.. ......] అని పార్వతికి అపర్ణయని పేరు. 'అపర్ణా పార్వతీ దుర్గా' —అమరము.

తాను, విశాఖుఁడు = కొమ్మలు లేనివాడు — అయికూడ జనులకు అభీష్ట ఫలముల నిచ్చుచున్నాఁడు. అట్టి మహిమగల షణ్ముఖుని గొల్తును. ఆకులు కొమ్మలు లేని మొద్దునకు తండ్రికిని — ఆకులు లేనిదైన తల్లికిని బుట్టి కొమ్మలు లేనివాఁడు తాను, ఆఱు తలలు గలిగి (వెట్టి తలలు వేసిన తాళనారికేళాది వృక్షములు ఫలింపవు) కూడ (కల్పవృక్షమువలె) జనులకు నభీష్టఫలము లిచ్చుచున్నాఁడు! కాన మహామహిమగలవాఁడు! దీనికిఁ బోలికగా సంస్కృతమున నింతకంటెఁ జమత్కృతి గలదిగా శ్లోకమున్నది.

స్థాణు ర్భవాణ్ మూల విహీన ఏవ
పుత్రో విశాఖో జననీ త్వపర్ణా
పరోపనీతైః కుసుమై రజస్రం
ఫలత్యభీష్టం కిమిదం విచిత్రమ్. —ప్రసంగరత్నావళ్యుదాహృతము.

పై శ్లోకపుఁ జమత్కృతి యెల్ల నుండవలె నన్నఁ బద్య మిట్లు మార్పు చేఁదవలెను.

తనజనకుఁ డుస్థాణువు
జనని యపర్ణాఖ్య తా విశాఖుఁడు నితరుల్
కొనితెచ్చు పువ్వులం గై
కొని ఫలములనొసగు షణ్ముఖుణ్ విసుతింతుణ్.

[తొలిపాదమున — జనకుఁ డమూల స్థాణువు అనియేని]

తానే కాక తన వంశముగూడ ఫలము లీయఁజాలని తీరుననే యున్నను ఫలము లిచ్చుట విచిత్రమగదా!

విరోధాభాసము, విభావన యలంకారములు.

క. హరుఁ డాదిగ సకల చరా
చరమయ జీవాళి నెల్ల సతతము గామా
తురులుగ వశగతిఁ జేసిన
మరుఁ డీవుత మఖిలవశ్యమతి మత్కృతికిణ్. 9.

తొలుత శివుని జయింప నంపవేట్లు (దేవతోపకృతికే కాక శివోపకృతికిఁ గూడ) ప్రేసినను శివునిచేఁ జచ్చిచెడి, చేయంగల విన్నపములు రతిచేఁ జేయించి మరల నుజ్జీవితుఁడై శివానుగ్రహ పాత్రుఁడయినాఁడు గాన మారస్తుతి. 'వలగతి' ప్రాఁతప్రతి పాఠము. తర్వాతి పద్యమున 'తనవశమర్థి' యనుట కననుగుణము గాన మార్పు చేయుట;

చ. మునిమనుజాసురాహిసురముఖ్యులు మున్నుగ సర్వజీవులణ్
దనవశ మర్థిఁ జేసి మనుదర్పకు నోర్చిన వీతరాగిఁ జి
ద్ఘనతను నీశు నాత్మసుభగస్థితి మైమయి నర్ధనారిఁ జే
సిన నగజాత మత్కృతిని జేకొని తత్సుభగత్వ మీవుతణ్. 10.

ముని .... ముఖ్యులు, మొదలుగా సర్వప్రాణులను, అర్థిణ్=సమర్థతతో, తన వశముచేసి, మనుదర్పకుణ్ = చెలఁగుచున్న పొగరుఁబోతును(మన్మథుని)— ఓర్చిన=ఓడించిన — 'అర్చిన' అని దిద్దినచో కాల్చివేసిన యని యర్థమగును.

**వీతరాగిన్** = రాగరహితుని, వీతరాగున్ అనుట యుక్తతరమే యయినను వ్రాఁతప్రతిలో 'వీతరాగి' అని కలదు గావునను, సముత్థ భోగిభోగి యనుచోట నీ కవి సమాసాశ్రయవిధి కనిత్యత చేసినాఁడు గావునను నిది కవి సమ్మతమని నిలుపఁబడియెను చిద్ఘనతనున్ = జ్ఞానము కరడు గట్టిన మేని వానిని, ఈశున్, ఆత్మ సుభగస్థితిన్ = తన సౌభాగ్యము నునికిచే, మైమయిన్ = శరీరమును శరీరమునఁ జేర్చి (హాయిగా), అర్ధనారిన్ = సగమాఁడుదానిని, చేసిన నగజాత మత్కృతిని జేకొని ఆ సౌభాగ్యమును దీనికి ననుగ్రహించును గాక! పార్వతివలె నీకృతియు సౌభాగ్యము గలిగి శివప్రియ యగుఁగాక! యనుట.

క. వేదాగమరూపమున మ
హాదేవు నపారగుణమహత్త్వస్తుతిసం
పాదిత యగుభారతి నేఁ
డాదిగ మత్కృతికి నెలయునదిగాక కృపన్. 11.

మహస్తుతి — వ్రాఁతప్రతి; మహాసంస్తుతి — యూనివర్సిటీవారి సంస్కరణము.

నాల్గు వేదములు, పెక్కు శివాగమములు (శాస్త్రములు) నను రూపుతో మహాదేవుని యపారము లయిన గుణములయు మహత్త్వములయు స్తోత్రములను సంపాదించినది యగు సరస్వతి నేఁడు మొదల్కొని నాకృతికి దయతో ఎల యునది గాక — సంబంధపడునది (సంసక్త) యగుఁగాక!

'అపారగుణమహత్త్వస్తుతి' యని రచన చేయునపుడు కవిహృదయ మున పుష్పదంతుని 'మహిమ్నస్స్తుతి' స్మరణమున కెక్కియుండును. అందును నీశ్లోకము

**''అసితగిరిసమం స్యాత్ కజ్జలం సింధుపాత్రే**
**సురతరువరశాఖా లేఖినీపత్ర ముర్వీ**
**యది లిఖతి గృహీత్వా శారదా సార్వకాలం**
**తదపి తవ గుణానా మీశ! పారం నయాతి''—**

నన్నయ 'హరిహరాబ్జ గజాననార్క షడాస్య మాతృ సరస్వతీ

గిరిసుతాదిక దేవతాతతికిఁ నమస్కృతి చేసి'నాఁడు. తదనుసారిగా నన్నిచోడఁడును చేసినాఁడు. మాతృ = సప్తమాతృకలు గాక 'మార' స్తుతి చేసినాడు. నన్నయ పద్యమున 'మార' కలదేమో !

ఈ పద్యమున 'నేఁడాదిగ' పదమున 'ఏఁడాదిగ' శబ్దము ధ్వనించు చున్నది. కుమారసంభవ రచనమున 'కేఁడాది' కాలము పట్టినదేమో ! కవి కెఱుకలేకయే 'యేఁడాది' పదము కూడియుండును.

## గురుస్తుతి

ఆ. అన్యదైవవితతి నర్థించి కొలుపు తా
డిడి ఫలంబు గొనుట పడయఁగనెడి
నద్య మిష్ట ఫలదు జంగమమల్లికా
ర్జునునిఁ గొలుపు మొసరు మునుఁగఁ గొనుట 12.

(విష్ణ్వాదులగు) ఇతర దేవతా సమూహమును (ఏదేని ఫలమును) అర్థించి = కోరి, కొలుపు = కొలుచుట — తాడి యిడి ఫలంబు గొనుట = తాడి చెంకను నాఁటి పండును బడయుట (వంటిది) పడయఁగనెడి నద్యము=(ఏదేని ఫలమును) పడయుటకై దర్శించిన వెంటనే, ఇష్టఫలదున్ = కోరిన ఫలము నొసఁగువానిని, జంగమ మల్లికార్జునుని, కొలుపు = కొలుచుట (సేవచేయుట) మొసరు=మొసరుతేనెను, మునుఁగన్=మునుఁగబెట్టునందు, (శ్రీగురువు) కొనుట, పడయుట. 'మొసరు మునుఁగఁ గొనుట' యనుచోట నర్థ సందేహము. 'మొసరు. అనఁగా గన్నడమున 'పెరుగు' దధి యర్థము నేఁడు వాడుకలో లేదు కాని కవి ప్రయోగములలో 'మొసరు' దధ్యర్థమునఁ దెలుఁగున నున్నది.

పెసరుం బప్పేమిటికని
కసరున్నెయిఁ గొనఁడు పండుగనుఁ గొయగూరే
కొసరుం బలుచని చల్లయె
మొసరుం గనఁ డతనిలోభమున కేమందుఁ.

—బసవపురాణ చరిత్రము. పంచమాశ్వాసము

మొసరు = పెరుగు, మునుఁగఁ=చేయి మునుఁగునట్లో, తలమునుగుఁ నట్లో, యేమి మునుఁగునట్లో, కొనుట = గ్రహించుట — అనవచ్చును. ఇది

'ముక్కస్య ముక్కోర్థః' వంటిది పాలన జేమిరి వెట్టి పెరుగుచేసికొని జుట్టు టకై చేయి మునుఁగఁగాఁ గైకొనుట అనఁదగును. ద్రవిడమున 'తిరుప్పావై'లో ఇట్టి పలుకుబడి కలదు.

[కూడారై వెల్లుమ్‌శీర్ కోవిన్దా ఉన్దన్నై
ప్పాడి ప్పఱై కొన్డు యామ్ పెరు శమ్మానమ్
నాడు పుకళుమ్ పరిశినాల్ నన్దాక
శూడకమే తోళ్‌వళైయే తోడే శెవిప్పూవే
పాడకమే యెన్ఱనైయ పలకలనుమ్ యామణివోమ్
ఆడై యుడుప్పోమ్ అతన్ పిన్నే పాల్సోఱు
మూడ నెయ్‌పెయ్‌తు ముళఙ్గై వళివార
కూడి యిరున్దు కుళిర్‌న్దేలో రెమ్పావాయ్. తిరుప్పావై—౨౭]

ఈ యర్థ విశిష్టమేని గ్రహించునది. ఇది యంత సుందరముగాఁ దోఁప దేని యీ క్రింది యర్థమును గ్రహింపవచ్చును. తేనెలలోఁ బెక్కు ప్రభేదము లున్నవి వానిని ప్రబంధరాజకారుఁ డిట్లు పేర్కొనినాఁడు.

'ముసుఁడుతేనె, పూఁదేనె, జుంటితేనె, పుట్టతేనె, పెరతేనె, కణ్ణుతేనె, కురుజు తేనె'— ముసరు, ముసురు, మొసరు రూపభేదముగల యేకార్థకపదములే. వన్నిచోడఁడును

'తేనియ ముసురో యమృతపు
వానయొ పుం డేఁడురసము వట్టోడిన పె
ల్లో నాఁ దుంబురు నారద
గానరసం బభవు నోలగంబునఁ బర్వెన్' —నవమాశ్వాసము.

అని ముసుఁడుతేనెను పేర్కొనినాఁడు.

మొసరు = ముసరుతేనెను, మునుఁగన్ = ముసుఁగచెట్టున, కొనుట= గ్రహించుట వంటిది— ఇది 'తంగేటి జున్ను' వంటి ప్రయోగము కావచ్చును.

తాడివిత్తు నాఁటిన తర్వాత నిర్వదై దేండ్లకుగాని యది ఫలితమునకురాదు. మునుఁగచెట్టు గింజనాఁటినను, గొమ్మవిఱిచి పాతినను మంచినేల యగుచో సంవత్సరముననే పూఁతపట్టును. ఆ పూత చెట్టెల్ల నొక్క మొగినే పూచును. ఆ పూవులు మకరందపూరితములుగా నుండును. మునుఁగ పూచినపుడు తేనె టీగలు ఝుమ్మని కొల్లలుగా ముసరుకొనును. ముసరి సేకరించిన తేనెను చెట్టు తొఱ్ఱలలోనో, ఇంకే సందుననో, కొమ్మనో చేర్చి పెట్టును. ఆ తేనె పలుకులుగాఁ గూడ ఘనీభవించునఁట! మునుఁగకాయలకంటెఁగూడ మునుఁగపూవు లారోగ్య ప్రదములు వృష్యములు. శిగ్రు పుష్ప రసాయ మని వానితో రసాయనౌషధము చేయుదురు. అది మందుగాక రుచ్య మయిన భోజ్యవస్తువు.

అన్యదైవవితతి నర్థించినఁ దత్ఫలము ఈ జన్మమున లభించునో లభిం పదో యని సందేహింపఁ దగినది, తాటిటెంక నాఁటి దానిపంటి పేసము నారగిం చుట వంటిది. జంగమ మల్లికార్జును నర్థించుట మునుఁగ విత్తునాఁటి దానిపూఁత తేనె నారగించుట వంటిది.

తాటి పేసమురుచికిని మునుఁగతేనె రుచికిని చాల భేదమున్నది. అది యెన్నేండ్లకు లభ్యమో, ఇది యెంత యెక్కువయినను, నన్నినెలలకు లభ్యము—

'తాడిడి ఫలంబు గొనుట' యన్న పలుకుబడిని మంచెనగూడ కేయూర బాహుచరిత్రమునఁ బ్రయోగించినాఁడు.

'తాడిడి పండుఁ దిన్నక్రియఁ దద్దయుఁ గాలము గోరుచుండఁగా'

చతుర్థాశ్వాసము 142 ప.

సద్యము— సద్యః అనునవ్యయమునకుఁ దత్సమరూపము. తిక్కన శ్రీనాథాదులు దీని నిట్లు ప్రయోగించిరి.

నిఘంటువులలో 'మునుగ' పదము శిగ్ర్వర్థమున ననుస్వారము లేనిదిగాఁ గలదు గాని వెలంకాయ, ములంకాయ అన్యవ్యవహారము లుండుటచేతను, వెలం+గళ్, వెలంగలు, వెలఁగలు, వెలఁగ రూపములవలె ములంగళ్, ములం

గలు, ములఁగ, మునఁగ, మునుఁగ రూపము లేర్పడియుండవచ్చును. మునఁగ, మునుఁగ రూపముల నిర్ణయము దుష్కరము. రెండును సాధువులు గావచ్చును.

వ. అని సద్వృత్తియుక్తి నిశ్చయించి : 13.

క. శ్రీ పీఠంబున నిడుకొని
శ్రీ పాదుక [1]లర్చలిచ్చి సేవించెద నేఁ
బాపహతిఁ జేసి పుణ్యం
బాపాదింపంగ మల్లికార్జునదేవుణ్. 14.

(1) లచ్చ లచ్చిణ — వ్రాఁతప్రతి.

ఏ తత్పద్యార్థచర్చలో శ్రీలక్ష్మీపతిశాస్త్రిగారు మల్లికార్జునుఁడు శ్రీచక్ర పీఠముపై నడుగులుంచినవాఁడని వ్రాసిరి. శ్రీ పీఠమనఁగా పవిత్రమయిన శోభాయమాన మయిన పాదపీఠ మనియే కాని శాక్తుల కత్యంతపూజ్య మయిన శ్రీ చక్రమని కాదర్థము.

మ. అమలజ్ఞాన సుదీపవర్తిఁగొని వృద్ధాచారుఁడై వేదశా
స్త్రములం దున్నసదర్థ మెల్లఁగొని విద్వత్ప్రీతి గావించు వా
ని మహాత్మ్యం డనఁ బొల్చు పుణ్యనిధి వాణీముఖ్య సర్వజ్ఞ జం
గమలింగం బగు మల్లికార్జును సదా కల్యాణుఁ గీర్తించెదన్. 15.

ఈ పద్యముతో నిందలి ౨౬ వ సంఖ్య పద్య మధికముగా నర్థసంబంధము గలది గాన దానిఁ గూడ నిక్కడే చేర్చి వ్యాఖ్యానించుతును.

క. గుఱుతెఱిఁగి వస్తుచయమున
కొఱఁగెడు నాదీపవర్తియునుబోలె నిజ
మ్మెఱిఁగి [1]కృతివస్తుసమితికి
వఱలఁగ మది [2]నొఱఁగు విబుధవర్గముఁ దలఁతున్. 26.

(1) కృతవస్తు (2) నెఱుఁగు — వ్రాఁతప్రతి.

పయి రెండు పద్యములును నిధిగుప్తమై యున్న సువర్ణాదికమును దీప వర్తిమూలమున గుర్తింపనగు నన్న నిధిశాస్త్ర సంప్రదాయము ననుసరించి రచింపఁబడినవి. తొలిపద్యమునకు వ్యాఖ్య—

అమలజ్ఞాన సుదీపవర్తిన్ = నిర్మలమయిన యెఱుక యనెడు—దీపపు వత్తిని, కొని = చేకొని, వృద్ధాచారుఁడై = పెద్దల యాచారము ననువర్తించిన వాఁడై వేదశాస్త్రములందు ఉన్న — సదర్థము ఎల్లన్ = వేదశాస్త్రములలో గుప్తముగానున్న మేలయినయర్థముల నన్నింటిని, కొని=వశపఱచుకొని, విద్వత్ప్రీతిగావింపువానిన్ = ఆయర్థముల నొసఁగి విద్వాంసులను దనియించువానిని (ఇక్కడ అర్థమనఁగా ధనరత్నాదికమనికూడ) జంగమ మల్లికార్జునున్ = చర లింగమయిన మల్లికార్జునదేవుని — మల్లికార్జున నామకుఁడగు గురుని, కీర్తించెదన్.

రెండవ పద్యపు వ్యాఖ్య —

గుఱుతు = తన ప్రకాశమున కింకను బ్రజ్వలనమును గలిగించు యోగ్యత యుండుటను, ఎఱిఁగి = కనుఁగొని, వస్తుచయమునకు = (అట్టి యోగ్యతగల కర్పూర, కార్పాస, తైలాది వస్తుసముదాయమునకు, ఒఱఁగెడు నాదీపవర్తియునుబోలె = ప్రాలునట్టి దీపపువత్తి (జ్వాల) విధమున — దీపవర్తి యనుచో నిక్కడ వర్తిగత మయిన దీపజ్వాల యర్థము చెప్పుకోవలెను. ఒఱఁగునది జ్వాలగాని వత్తిగాదు గనుక - నిజమ్ము ఎఱిఁగి = (తనమతి కింకను వికాసము గలిగింపఁదగిన) యంతస్సత్త్వము గలుగుటను గుర్తించి, కృత (తి?) వస్తుసమితికి = కవికృతములగు (లేక కబ్బము నందలి) వృత్తిరీతి గుణాలంకార కథాది కవితావస్తు సముదాయమునకు, వఱలఁగ = (తనయొక్క, ఆవస్తుసమితి యొక్క మేల్మి) ప్రత్యక్షమగుటకు, మదిన్ = మనసుతో (తృతీయార్థమున సప్తమి. కాలఁదన్నెను, కంటఁజూచెను ఇత్యాదులవలె) ఒఱఁగు = ప్రాలునట్టి, విబుధవర్గమున్, తలఁతున్.

అనఁగా

దీపజ్వాల తానేవో కొన్ని (చమురులు మొదలగు) వస్తువుల మూలమునఁ బ్రజ్వలిత మగుచున్నది గాన, అట్టి యోగ్యతగల యితరవస్తువుల సన్నిధి కలిగి నపుడు వానిమీఁదికి ప్రాలి అందును దనప్రజ్వలనమును గొలుపును. ఇతరుల

కావస్తువుల యోగ్యత నెఱింగించును. (జ్ఞానము జ్యోతిర్మయ మగుట ప్రసిద్ధము) ఎట్లనఁగా :—

దీపపు మొగ్గకుఁ గొంచెము దూరముగాఁ గర్పూరము గాని, ప్రత్తి విగాని స్పిరిటు మొదలగు నూనెలనుగాని యుంచుకొన్నచో గప్పుమని దీపజ్వాల, వాని మీఁదికి ప్రాలును. ఇది సర్వదృశ్యమగు ప్రకృతి చిత్రము. ఇట్లే లతలును కొంతదూరముగానే యున్ననుగూడ, ప్రాఁకుడుగొయ్య మొదలగు నితరవస్తువుల మీఁదికి (ఈ తీగకు కన్నులు తెలివితేటలు ఉన్నవా యేమి అని వింతచెందునట్లు) సాగి ప్రాలును. పొట్ల మొదలగు తీగలు ప్రాలుటకు ముందు చేతులు సాచి యందుకొనుచున్నవా యనునట్లు నులిప్రేళ్ళవంటి (యాకులు లేని) సన్నతీగలను ముందు సాగించి యాశ్రయమును జుట్టుకొనును, ఇదియు నెల్లరు నెఱుఁగుదురు.

చమురు మొదలగువాని మూలమున వెలుఁగుచున్న దీపమువలె నుత్తమ కవి రచనముల మూలమున వికాసము చెందుచున్న విబుధహృదయము, అట్టి యంతస్సార విశేషముగల సత్కవి రచనము లింకను వేఱుగాఁ గ్రొత్తవిగా గోచరించినపుడు తనకు మఱియు వికాసము గూర్చుకొనను, ఇతరులకు వాని యోగ్యత నెఱింగింపను వాని మీఁదికిఁ బాఱును, రసవంతమయిన పద్యమో గ్రంథమో చదువుచున్నప్పుడు రసికుఁడయిన శ్రోత చెవి యొగ్గి మన సొగ్గి ఏదీ మరల చదువు మని కోరి చదివించి విని దాని యర్థవిశేషము లితరులకు వెల్లడించును. ఈ విధమునఁ దన్నుం బోలు కవులకు నుపకరకు లగుచున్నారు గాన (రసిక విమర్శక) విబుధులను నన్నెచోడకవి స్తుతించినాడు

ఈ పద్యమున నుపమానోపమేయ వాక్యభాగములందు రెండిటను వస్తు సమితి, వస్తుచయము అని యర్థభేదముతో 'వస్తు' పదావృత్తి యుండుట కూర్పు చక్కన.

మఱియు 'ఒఱఁగెడు నా దీపవర్తి' యని యుపమాన భాగమున గలదు గాన 'మది నొఱఁగు విబుధవర్గము' అని 'ఒఱఁగు' పదమే యావృత్తమగుట సొంపు. 'ఎఱఁగు' ఉన్నను నీ యర్థము వచ్చును.

నన్నిచోడఁడు స్థలాంతరముల నట్టియర్థమున 'ఒఱఁగు'ను, 'ఎఱఁగు'ను గూడఁ బ్రయోగించినాఁడు.

పయివిధమున గుణగ్రాహులగు విబుధులను స్తుతించుటకుఁ బ్రతిగా దోషగ్రాహులగు కుకవుల నీకవియే 'పిప్పి కరిగెడు నీఁగల పెల్లు'నుగాను, దర్వాతి కవులు 'పుంటిపై వ్రాలు నీఁగల'ను గాను దెగడుటయ్యెను.

ఈ పద్యమునకుఁ బై విధముగా సర్వసాధారణముగా గుర్తింపఁబడుచున్న ప్రకృతి వైచిత్ర్యము (కర్పూరాదులపైకి దీపపు మొగ్గ వ్రాలుట) ననుసరించి యర్థము సుసంగతముగానే యున్నను, నన్నిచోడఁడు కర్ణాటక కవితా విశేషజ్ఞుఁడగుట సుస్పష్టముగాన నిధిశాస్త్ర సంప్రదాయమునకుఁ కర్ణాట కవి వ్యవహారమునకు ననుగుణముగా విశేషార్థము నీక్రిందివిధముగాఁ గూడఁ గూర్చి యుండవచ్చును.

జ్యోతి ర్యత్ర ధనం తత్ర నిశ్చయం నిర్దిశేద్ధనమ్
జ్యోతి ర్విన్యస్త తైలేన సహస్రాణా మథాపి వా
వర్తేః ప్రజ్వాల్యమానాయా శ్శిఖా తస్మిన్నధోముఖా
ప్రహతై ర్మహితైః కుర్యా చ్చూర్ణై రేతై స్స్వపూజితైః
అర్కతూల మయీవర్తి ర్ప్రామేయం తత్ర దృశ్యతే
లోహ గంధక చూర్ణేన చూర్ణం తే త్వర్కతూలకైః
వేష్టయిత్వాచ సూత్రేణ వర్తిం కుర్యా త్తదా భవేత్
సిద్ధ శ్రీకంఠశివప్రణీతే నిధిప్రదీపే తృతీయపరిచ్ఛేదే—

మానసోల్లాసమునఁ గూడ నీవిషయమున్నది.
ఏతదనుగుణముగా కర్ణాటకకవులు

క మానిని యసురత రత్నని
ధానం చాతుర్య దీపవర్తియిసిందె
త్తానుం కోశ్ప్రెయెసలా
మానిని యోళ్ చక్రి సురత సుఖమంపడెదం.

జగన్నాథ విజయము.

ఇది మృదు పద బంధ బంధుర సరస్వతీ సౌభాగ్య వ్యంగ్య భంగీ నిధాన దీపవర్తి చతుర్భాషా కవిచక్రవర్తి—

నేమినాథ పురాణము.

మానిని యొక్క సురత రత్ననిధానమును శ్రీకృష్ణుఁడు చాతుర్య దీప వర్తి మూలమున కొల్లఁగొట్టెను.-అని తొలిదాని యర్థము.

రెండవది సంస్కృతసమాసగతమే కాన టీక వ్రాయఁబడలేదు. నిధు లున్న పట్టులను, స్థల సన్నివేశములను బట్టి, మొలచు మొక్కలనుబట్టి, చెట్ల తీరులన బట్టి పక్షులనుబట్టి. జంతువుల తీరులనుబట్టి దీపజ్వాలనుబట్టి........కను గొను తీరు లున్నవి. కనుఁగొన్న నిధులను ద్రవ్వితీయుటకు బలిపూజా విధా నాదులున్నవి. జిల్లేడు దూది వత్తితో కొన్ని వస్తువులచూర్ణములను పొటపి చమురువోసి వత్తి వెలిఁగించి చూడఁగా నిధి యున్నచోట దీపజ్వాల యధోముఖ ముగా వెలుఁగునఁట: విశేషము లెఱుఁగఁగోరువా రాయాగ్రంథములఁ జూడ వచ్చును.

నన్నిచోడని పద్యమున 'వస్తుచయము' గలదు. వస్తుపదమునకు ధనము, రత్నాదికము, బంగారము, సారాయము, కావ్యవస్తువులు అర్థము. నన్నిచోడని గురుఁడగు మల్లికార్జునుఁడు శైవశాక్తాగమ పారంగతుఁడు. దీక్షాపరుఁడు. శ్రీపీఠార్చన, సురాకుంభస్థాపన, మండలార్చన, మాంసనైవేద్య తదశనాను లాయన యనుష్ఠానమందుఁ గలవు గాఁబోలును. శ్రీ రామకృష్ణకవిగారు కుమారసంభవము ద్వితీయభాగ పీఠికలో నీ యర్థము వివరించిరి.

నవమాశ్వాసమున నిది చదువఁ దగినది.

వ. అంతఁ గొందఱు మధుపాన గోష్ఠికిం జొచ్చి మండలార్చన దీర్చి మూలజ వృక్షజ గరుడ మధుపిష్ట కుసుమ వికారంబు లగుసుగంధాసవంబులు చషకాదుల న్నించి హర్షించి.

మ. శివు గౌరీసహితంబు సన్మనములం జింతించి మైతెంచి భై
రవు యోగీంద్రులఁ గొల్చి యోగినుల వీరవ్రాతముం దన్పి యా

నవనాథాదుల నాదిసిద్ధులకు నానందించి వి:దిచ్చి యా
నవపాత్రల్ నతు లర్థి నెత్తికొని యాస్వాదించి మోదించుచున్.

చ అమరులు ద్రావుచో నమృత మందురు దీని, నహిద్రవజం బజ
స్రము గొని యానుచో విష రసాయనమందురు, భూసురౌఘ మా
గమ విధి సోమపాన మని కైకొని యానుదు; రెంచఁ జక్రి యా
గము నెడ వస్తు వందు రిది కౌళికు లీ సురపేర్మి యింతయే.

*  *  *

వ. అని యనేకవిధంబుల మాంసోపదంశకంబు లాస్వాదించుచు మనోహ్లా
ద్యంబులగు మద్యరసంబులు సద్యంబ సిద్ధరసంబును బోలె శరీరంబులం
గలయ నూల్కొని — ఇత్యాది.
వన్నిచోడఁడు గ్రంథాంతమునఁ గూడ నిట్లనెను —
సరసాహారము రాగహేతు వను టజ్ఞానంబు పారవతో
త్కరముల్ చిక్కసితాలు మేసియు సదా కామార్తిమై యుండుఁ గే
సరి సాంద్రామిషభోజి యయ్యును సకృత్సంభోగ మందున్ మనో
హారసుజ్ఞానమ కాక రాగరసమం దాహార నిర్వృత్తియే.

వస్తువనఁగాఁ గౌలికుల పరిభాషలో 'మద్య' మగుట స్పష్టపడినది. సారాయముమీఁదికి దీపజ్వాలలు ప్రాలునఁట! మల్లికార్జునగురు శ్రీ పాదుకార్చనమున శ్రీ పీఠసన్నిధిని దీపజ్వాలలు వెలుఁగుచుండఁ జషకములలో వస్తుచయమును నించి నివేదనము చేయునపుడు 'గుబులెత్తఁగి వస్తుచయమున కొలఁగెడు నాదీపవర్తి' తీరు లాతనికి దృష్టములగుచుండవచ్చును. అందుకుఁ దార్కాణగా నాతఁ డిట్లును జెప్పినాఁడు.

శ్రీ పీఠంబున నిడు తన
శ్రీపాదుక లర్చలిచ్చి సేవించెద నేఁ
బాపహతిఁ జేసి పుణ్యం
బాపాదింపంగ మల్లికార్జునదేవున్.

వ. అని యిష్టదేవతానమస్కారంబుచేసి సమస్త దేవతాస్వరూపం బైన మదీయ గురుచరణారవిందంబు లభినందించి— 16.

'గురు ర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షా త్పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః
అన్న సూక్తి చొప్పున గురువు సమస్త దేవతా స్వరూపుఁడు.

## క వి స్తు తి

వాల్మీకి వ్యాస కాళిదాస భారవ్యుద్భట బాణులను సంస్కృతకవుల స్తుతించుచున్నాఁడు. భవభూతి శ్రవ్యకావ్యకర్త కాఁడని కాఁబోలును విడనాఁడినాఁడు.

క. కవితామృతోదయాంబుధిఁ
గవి సజ్జన కనకు వస్తు కావ్యాబ్జ రవిన్
గవితారంభంబుల స
త్కవు లభినందింతు రాదికవి వాల్మీకున్. 17.

కవితామృత ముదయ మందిన సముద్రుఁడు; కవి సజ్జనమునకు బంగారము— (కవులకు, సజ్జనులకు నని కాని, కవుల పుట్టినిల్లనమునకు, నని కాని)— 'కవిసజ్జనకునకు' అనునది కల్పిత పాఠము. అదే ప్రియమేని, కవులకు సజ్జనులకు (సృష్టికర్త) తండ్రి అని యర్థమగును— వాల్మీకి రచన (రామాయణము- పేరు చెప్పలేదు— శైవుఁడు గనుక నేమో') బంగారము వంటిది. దానినుండి కవులు, సజ్జనులు పెక్కు రకముల యాభరణములు కల్పించుకొందురు— కవులు కార్యపరికరములను, సజ్జనులు, సౌశీల్య పరికరములను సాధించుకొని యాభరణీకరించుకొందురనుట; అతఁడు వస్తు కావ్యాబ్జరవి = కథా ప్రధానమయిన కవితా కమలములకు సూర్యుఁడు, ఆదికవి, అయిన వాల్మీకిని కవితారంభములో సత్కవులు. అభినందింతురు = మెచ్చుకొందురు, కన్నడమున, వస్తుకవులని, వర్ణక కవులని, యిరు తెఱఁగుల కవుల ప్రశంసలున్నవి— వస్తు కవియనఁగా, కథా ప్రధానకవితా రచయిత — వర్ణక కవియనఁగా వర్ణనాప్రధానకవితా రచయిత. కవులను బొగడెనే కాని స్తుతింపఁ డయ్యె నేలో?!

వేదాంత భారత పురా
ణాదులు పేయు డొక పేర్మి యని చని పొగడం
గా దెద్ద నజుఁడు నోపని
వేఁము పేర్వఁబచె ననిన వేదవ్యాసుఁ. 18.

క. భాసుర మతి వాల్మీ
వ్యాసాదులు చనిన జగతి వరకవితా సిం
హాసన మెక్కి కవీంద్రుల
దాసులఁగా నేలెఁ గాళిదాసుఁడు పేర్మిఁ. 19.

చనిన జగతిఁ = వాల్మీకి వ్యాసాదులధిష్ఠించి విడిచిపోయిన యరఁగు మీఁద, వర కవితా సింహాసనము ఎక్కి తాను కాళి(కి) దాసుఁడైనను కవీంద్రులను దాసులఁగా నేలినాఁడు.

క. భా రవియు వస్తు కవితను
భారవియును బరగి రుదయపర్వత శిఖరా
గ్రా రోహణేంద్ర కీల న
గా రోహణ వర్ణనల జనారాధితులై. 20.

భాఁ = కాంతియందు, రవియుఁ, వస్తుకవితను = కథా ప్రధానకవిత యందు, భారవియును = భారవికవియును, ఉదయ...వర్ణనలఁ = ఉదయ పర్వత శిఖరాగ్రారోహణమున, ఇంద్రకీల నగరోహణమున, వెలయించిన వర్ణములచే, వర్ణనలచే జనారాధితులై వరగిరి.

అందాఁకఁ జీకటిఁ గొనియున్న లోకమునకు సూర్యుఁడు కాంతితో నుదయగిరి శిఖరమెక్కి వింతరంగులు గొల్పి జనులచేఁ బ్రాతస్సంధ్యా సూర్యోప స్థానాది విధముల ఆరాధితుఁ డగుచున్నాడు. భారవి కవియుఁ దన కిరాతార్జునీయ మున నింద్రకీల నగము నర్జునుఁ డధిరోహించు కథ నద్భుతముగా వర్ణించుటచే జనారాధితుఁ డగుచున్నాఁడు.

క. క్రమమున నుద్భటుఁడు గవి
త్వము మెఱయఁ గుమారసంభవము[1] సాలంకా
రము గూఢ వస్తుమయ కా
వ్యముగా హరలీలఁ జెప్పి[2] హరు మెచ్చించెన్. 21.

వ్రాఁతప్రతిలో 1 'కుమారసంభవము నలంకారము' అని గణభంగము తోను, 2 'హరులీల' అని సాధ్య సమాసముతో పాఠములున్నవి. శ్రీ కవిగారు గణము నర్థమును గుదురుటకు 'సాలంకారము' అని దిద్దిరి. దానిని దెగడి శ్రీ లక్ష్మీపతిశాస్త్రిగారు 'కుమారసంభవమ్ము నలంకారము' అని దిద్దిరి. ఇద్దఱును దిద్దినవారే— దిద్దక తప్పదుగాన— కవిగారి దిద్దుబాటు సుందరముగాన నేను దానినే ముఖ్యీకరించితిని శాస్త్రిగారి దిద్దుబాటునుగూడఁ గాదనను. ఇది సాధించిన విశేషములేదు.

ఉద్భటుఁడు, క్రమముతో=ఒప్పిదముతో, ఒండెముందు కుమార సంభవము అలంకార సహితముగాను, తర్వాత గూఢవస్తుమయకావ్యముగాను హరలీల యను ననుక్రమమున — కవిత్వము ప్రకాశించెడఁగా కుమార సంభవమును సాలంకారముగాన్ = అలంకార లక్షణశాస్త్ర సహితముగను, గూఢ వస్తుమయ కావ్యము హరలీలను జెప్పి హరుని మెచ్చించెను. ఇట్లు చూడగా ఉద్భటుఁడు రచించిన గ్రంథములు రెండు తొలిది కుమార సంభవము. సర్వార్థాలంకారలక్ష్య గంధము అందు అలంకార లక్షణ శాస్త్రముగూడఁ గలదు. సంస్కృత సారస్వతమున ప్రాచీనాలంకార గ్రంథములు పెక్కులు అలంకార లక్షణములు ప్రధానముగాఁగలవై [1]లక్ష్య శ్లోకములంతకు ముందు ప్రఖ్యాతిగన్న కవి రచనలుగా (కాన కథా సంగతిలేనివి), గొన్నింటను [2]వేల్పునో తేనినో పురస్కరించుకొని కథా సంగతి లేకున్నను తత్ప్రశంసాత్మకముగా లక్షణ గ్రంథకారులే రచించినవిగాఁ గొన్నింటను గాననగును అయినను లక్షణ లక్ష్యములు వేఱు వేఱు గ్రంథములుగా వ్యవహృతములగుటలేదు. ప్రతాపరుద్రీయమున నాటక ప్రకరణమున ప్రతాపరుద్ర కళ్యాణమని నాటకమే రచితమయ్యెనుగాని అదికూడ వేఱు గ్రంథముగా వ్యవహృతమగుటలేదు.

ఉద్భటుఁడు రచించిన యలంకార గ్రంథము కొంత క్రొత్తతీరు గలది. అలంకార లక్షణశ్లోకములును గలవు. వానికి లక్ష్యశ్లోకములు కుమార సంభవ కథాఘటితములుగా నొకకావ్యమనఁ దగినట్లుకలవు. అయినను నవి కవిసార్థ సంప్రదాయము చొప్పున నొక్క గ్రంథమేయగును. ఈ యర్థమునకు 'కుమార సంభవము సాలంకారము' అన్న సంస్కరణము 'కుమారసంభవమ్ము నలం కారము' అని దిద్దుట కంటె సుందరముగాన దానినే కైకొంటిని. రెండవ దిద్దు బాటునకుఁ గూడ నీ యర్థము కలుగునుగాని, యప్పుడు కుమారసంభవము నలం కారము నేకగ్రంథమగుట పొసగదు. అది లక్షణగ్రంథకారుల తీరునకు సరి పడదు— హరలీల గూఢవస్తుమయ కావ్యమనఁగా — ఉద్భటుఁడు సంస్కృత మున హరలీల యని వేయి వృత్తములగ్రంథమును రచించినట్లు కర్ణాటకవి యైన బ్రహ్మశివుఁడు 'సమయ పరీక్ష'యని తాను రచించిన గ్రంథమునఁజెప్పి కొన్నాఁడు. [చూ. కర్ణాట కవిచరిత్ర 1వ భాగం 169 పుట.] పండితా రాధ్య చరిత్రమునను, బసవపురాణమునను, 'హరలీలను బ్రస్తుతించినాఁడు' శ్రీశైలము నధిరోహించు భక్తులు త్రోవలో హరలీలాది గ్రంథములను బఠించు చుండినట్లు చెప్పినాఁడు.

హరలీల రుద్ర సహస్ర నామాదులరు దొందఁజదువుచు నంకించువారు. —పండితా, పర్వత ప్రకరణము.

"గద్గదకంఠావికస్వరరసన ; ముద్గత స్తవన సంయుత వాక్యుఁడగుచు హరలీలఁదేలుచు హరలీల దనర హరలీల యనుకృతి హరలీలఁ బొగడు"

పండితా—దీక్షాప్రకరణం.

దీని తర్వాత మహిమ్న స్తవ మల్హణస్త వానామయ స్తవాదస్తుతి గ్రం థములఁజెప్పినాఁడుగాన, హరలీల శివస్తుతి గ్రంథము, వేయి శ్లోకములు గలది, భక్తులు పారాయణము చేయునదియని నిర్ణయింప నగును. ఆ వేయిశ్లోకములు స్తోత్రరూపములే. శ్లోకార్థము 'శివాయనమః' ఇత్యాది విధముల నమస్కారార్థ కములే యయినను, నందు గూఢవస్తువుగా, 'శివకథలు' గూడి యుండఁబోలును. రామాయణకథ యెల్ల నూఱు తెలుఁగు పద్యములలో జానకీపతీ యన్న మకుట ముతో స్తుతిరూపముగానున్నట్లే హరలీల కూడ గూఢవస్తుమయ కావ్యముగా రచితమై యుండును. ఉద్భటుని కుమార సంభవము గూడ గూఢాలంకార

వస్తుమయ కావ్యమే కాన దీనిని గూడ నాతఁడట్లే రచించి యుండఁబోలును. ఈ పద్యమును గూర్చి శ్రీ లక్ష్మీపతి శాస్త్రిగారు చేసిన విమర్శ మాదరణీయము కాదని నిరూపించుటకే దీని నింతగా వ్రాయవలసెను. వ్రాఁతలో 'హరులీల' యున్నదిగాని దానిని 'హరలీల' యని దిద్దుట యుక్తమే యని, అది యొక గ్రంథమేయని యంగీకరింపక తప్పదు.

క. కరములు దునుముదుఁ బరముని
వరదునిగాఁ గొలిచి కపట వలనని మగడవ్
గరములు వడసి జగంబునఁ
బరగె మహాకప యనంగ బాణుఁడు పేర్మిన్. 22.

బాణుఁడు (బాణాసురునివలె) శివభక్తతా నిరూపణకై చేతులనఱకుకొని, 'శివకర శివకర' యని యుపక్రమముగల గద్యమును (దాని పేరు బాణగద్య-పాల్కురికి సోమనాథుఁడు శ్రీశైల మధిరోహించువా రాగద్యను బఠించుచుండినట్లు చెప్పి నాఁడు) రచించి శివునిచే మరలఁ గరములు పడసెనని, సోమనాథుఁడు పండి తారాధ్య చరిత్రమునఁ జెప్పినాడు. బాణుఁడే కాక కాళిదాస, మయూర, దండి, మల్హణాదులు గూడ నట్టి సాహసములుచేసి శివుని మెచ్చించిరట
(చూ. పండితా.)

క. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశి కవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్ర విషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్. 23.

మును=పూర్వమెప్పుడో, మార్గకవిత=సంస్కృత కవిత, లోకంబున=భారత దేశమంతటను, ఇంక నితర దేశములందును (నన్నిచోడఁడు వృద్ధానుశ్రుతిని బట్టి లోకమంతటను సంస్కృతము వ్యాపించి యున్నతఁలఁపుగలవాఁడు భాషా శాస్త్ర మాతఁడును నేఁటికిని గాదనఁజాలకున్నది.) వెలయఁగన్=వర్ధిల్లఁగా, తెనుంగున=తెలుఁగు భాషలో, దేశికవితన్=దేశభాషా కవితను, అనఁగా సంస్కృత ప్రాకృత తత్సమ తద్భవ దేశ్యాన్యదేశ్య పదసముచ్చయాత్మకమయిన భాషతో

దేశిచ్ఛందో విశేషములతో రచింపఁబడుదానిని) భారతాది రచనాత్మకమగు తెలుఁగు కవితను చాళుక్యరాజు=రాజరాజనరేంద్రుఁడు, మొదలుగఁ, పలువుర్, పుట్టించి=జనింపఁజేసి, ఆంధ్ర విషయమునఁ=ఆంధ్రదేశమందు, నిల్పిరి=ఆకవితను నెలకొనఁజేసిరి. 'దేశికవితఁబుట్టించి తెనుంగున నిల్పి'రని కవి రచనమేని, దేశికవితనుబుట్టించుట మూలమున ఆంధ్రదేశములో సంస్కృత రచన మొక్కటే కాక, తెలుఁగు రచనము గూడ నుండునట్లు చేసిరి అని యర్థమగును. బ్రహ్మాదులు గుర్తించిన రచన మార్గ రచన అనీ, ఆయా దేశముల ప్రజల రుచులననుసరించి హృదయరంజకముగఁ బ్రజలు కల్పించిన రచన దేశిరచన యని నాట్యశాస్త్రాది గ్రంథములందు గలదు. ఇందు—చాళుక్యరాజు అనఁగా నిప్పటికి రాజనరేంద్రునికిఁ బూర్వవు తెలుఁగు గ్రంథములు తెలియరాలేదు గాన యాతఁడే యిందు స్మరింపఁబడినవాడనఁ జెల్లును—ఒండె పద్యరచనలు కొన్ని గుణగ విజయాదిత్యునినాటఁ గలవుగాన యాతఁడేని కాదగును. తత్పూర్వ గ్రంథములు దొరకనంతదాఁక నీయర్థ మిట్లే కుదుర్కొనఁగలదు. ఇందు 'చన సత్యాశ్రయునిఁదొట్టి చాళుక్య నృపుల్' అన్న పాఠము వ్రాఁత ప్రతిలోనిది, కవికల్పితమునుగాన పరిగ్రాహ్యముగాదు. కుమారసంభవవు వ్రాఁత ప్రతి యిప్పటి కొక్కటే దొరకినది అది తంజాపురమున నున్నదే కాన యందలి పాఠమే గ్రాహ్యము. అందు—'చాళుక్య — వుర్' అన్న పాఠమే కలదు.

చ. సురవరులన్ గ్రమంబున వచోమణిసంహతిఁబూజసేసి మ
ద్గురుచరణారవిందములకు దగ సమ్మతిఁ జేసి కొల్చి వి
స్తరమతులం బురాణ కవి సంఘము నుత్తమ మార్గ సత్కవీ
శ్వరులను దేశి సత్కవుల సంస్తుతి చేసి మనోముదంబునన్. 24.

[.... .... .... .... .... ....]

వ. మఱియును, 25.

క. గుఱు తెఱిఁగి వస్తుచయమున
కొఱఁగెడు నాదీపవర్తియును బోలె నిజ
మ్మెఱిఁగి కృతి వస్తుసమితికి
వఱలఁగ మదినెఱఁగు విబుధవర్గముఁ దలఁతున్. 26

వ్యాఖ్యాతము. (చూ. [వినోద విమర్శము])

వ. మఱియును దోషగ్రాహులగు కుకవి వరాకులం బరిహరించితి నెట్లనిన,
27.

కుకవివరాకులు=[...........]

క. మార్గకు మార్గము దేశియ
మార్గము వగవంగఁ దమకు మదివదలక దు
ర్మార్గ పదవర్తు లనఁదగు
మార్గవులన్ దలఁప నలఁతి మహి సుకవులకున్ 28.

మార్గకున్ = సంస్కృత (ప్రధాన) కవితకు, దేశియ = దేశభాషా (ప్రధాన) కవితా రచనయే, మార్గము = బాట,— సంస్కృత రచనమో, సంస్కృత భాషామయమయిన రచనమో చేయుటకు, ముందు దేశి రచన నల వఱచుకోవలెను — తద్ద్వారమున నా సంస్కృత రచన చేయవలెను — ఇదీ సరియయిన మార్గము — ఈ, మార్గము = త్రోవ, వగవంగన్ = అర్థించుటకు, అపేక్షించు విషయమున, తమకున్ = కుకవు.కు, మదివదలక = మనోవై ముఖ్యము తొలఁగక, మనసు చొరక (కాన) దుర్గార్మపదవర్తులు =దుర్మార్గమున పదములను (అడుగులను) సాగించువారు, చెడ్డదయిన, మార్గ = సంస్కృత, పద = శబ్దములందు, వర్తులు = వర్తించువారు, అనఁదగు (నట్టి) మార్గవులన్ = మాఱటపశువులను, మాఱు కవులను, అనఁగా మాయ కవులను, (ఇమిటేషన్ కవులను) సుకవులకున్, మహిన్, తలఁపన్, అలఁతి = అల్పము ! తుచ్ఛము— సంస్కృత కవితారచనము, ఒండె, సంస్కృత శబ్ద ప్రధాన కవితా రచనము చేయఁగోరువారు ముందు దేశి రచనలో నాఱితేరవలెను- అట్లు దేశి త్రోవను నడచుటకు మనసొల్లక, వంకరటింకరలుగా కఱకుగా నుండు దుర్మార్గమున పదములు ప్రయోగింపఁబోవువారు కుకవులు, పశుప్రాయులు — వారిని దలఁప రాదు—

తే. చెనసి గుణమైన దోషంబు చేయనేర్చు
గుకవి కృతులందు దోషంబు గుణము సేయ
నేరఁ; డదియట్లు; దొంతులు సేరి నాయి
దోర్పనేర్చుఁగా, కదియేమి సేర్ప నేర్చు. 29.

చెనసి = స్పృశించి, కదలించి, కృతులందున్, కుకవి, గుణమైనన్, దోషంబు, చేయనేర్చున్, కుకవి, కృతులందు-అన్న పదద్వయము. దేహళీ దీప న్యాయముచే ప్రథమ చరణగతమయిన ప్రథమవాక్యమునకును ద్వితీయ తృతీయ చరణ గతమయిన ద్వితీయ వాక్యమునకును నడుమనుండి వాక్యద్వయమందు నన్వయించును. కుకవి, కృతులందున్ — కుకవికృతులందు ననికూడ; దోషంబు, గుణముసేయన్ నేరఁడు — అది యట్ల = అది యట్టిదే — దొంతులు = క్రమముగా వరుసగా ఎత్తుగాఁ బేర్చియుంచిన (భక్ష్యభోజ్యాదులు గల) దొంతులు = పాత్రల పరంపరను, చేరి = దగ్గఱి, నాయి = కుక్క, అరవముననిది ప్రసిద్ధ పదము— నన్నిచోడనినాఁటఁ దెలుఁగుశాఁటఁగూడ దీని వాడికగలదేమో! దోర్పనేర్చుఁగాక = దొర్లింప నెఱుఁగునుగాని, అది సేర్ప నేర్చునేమి? = ఆ దొర్లియున్న వానిని దొంతిగాఁ జేర్పఁగల్గునా? ('దొరు' ధాతువు ప్రేరణ రూపము, దోర్చు) కుకవి— సత్కావ్యమున గుణములను, ఆస్వాదింపఁబోయి చేతఁగాక రసభావాదులను చెడఁగొట్టగల్గును — కాని, కుకవికృతులలోని, ఒండె, ఆ సత్కృతిలోనే తప్పి దారిపడిన దోషములను గుణములనుగాఁ జేయఁజాలఁడు. (సుకవి ఇదీ చేయగలఁ డనుట) కుక్క దొంతరగా పెట్టియున్న యాహారాది పాత్రలను దొర్లింపగల్గునే కాని, దొర్లిపోయినవానిని దొంతరగాఁ బేర్పఁజాలదుగదా!

గీ. నెఱయ రసవంతమగు కృతి కెఱుఁగనేర
రల్పరసకృతి కెఱుఁగుదు రల్పు లెల్లఁ
జెఱకు పిడిచిన రసమున కెఱుఁగిరాక
పిప్పి కెఱుఁగెడు నీఁగల పెల్లువోలె. 30.

చెఱకు = చెఱకుగడను, పిడిచిన రసమునకున్ = పడివేసి పిండి తీసిన అంతా ఆస్వాద్యమేయయిన రసమునకు, ఎఱుఁగిరాక = వ్రాలిరాక, పిప్పికిన్ = (రసము కలదో లేదో యనఁదగు) తేలికయినదంటుచెత్తకు, [ఎఱగెను] (అరిగెడు 'రాక'కు ప్రతిపదము 'అరిగెడు') నీఁగల పెల్లువోలెన్ = వ్రాలెడు నీఁగల గుంపు మాదిరిని, అల్పులెల్లన్=అల్పజ్ఞులందఱును, నెఱయన్ = నిండార్లుగా, రసవంతము= (తొమ్మిది, ఒండె కొన్ని రసములో, ఒకటియో) రసముగలది అగు కృతికిన్, ఎఱుఁగన్ నేరరు = వ్రాల నెఱుఁగరు. అల్పరసకృతికిన్ = రసహీన మైన, కృతికిన్, ఎఱుఁగుదురు,

ఈ పద్యము మూడవ చరణమిట్లున్న నుపమానోపమేయములకు సక్రమ నిర్వాహము కుదురును. "నెఱయరసమున్న చెఱకున కెఱఁగిరాక". నెఱయ రసవంతమగుకృతి, నెఱయరస మున్న చెఱకు; అల్ప రసకృతి, పిప్పి.

వ కావున, 31.

గీ. తజ్జ్ఞునం దెర్గనగుఁ గవితా విశేష
మజ్ఞునందేమి యెఱుఁగంగనగు సమస్త
కనక వర్ణోత్కరం బొరగంట నొరసి
చూచి కా కెర్గవచ్చునే సుద్దజాత. 32.

కవితా విశేషము, తజ్జ్ఞు నందున్, ఎర్గనగును — కవితలోని విశేషము లను, కవిత్వ (తత్త్వ)ము నెఱిఁగినవానిలోనే తెలియ వీలుపడును. కవితను చదివి, విని, కవిత్వజ్ఞుడు దాని యోగ్యతను వెల్లడించును. అజ్ఞునందున్ ఏమి యెఱుఁగంగనగును ? కవిత్వము నెఱుఁగనివాఁడు దాని యోగ్యతనెట్లు వెల్లడింప నేర్చును ? సమస్త కనక వర్ణోత్కరంబు = బంగారునకుఁ గల యెల్ల వన్నెల మొత్తమును, ('వర్ణోత్కషంబు' అని కవి రచనమై యుండునేని, ఎల్ల వన్నెల యొరయికను,) ఒరగంటన్ = ఒరగల్లుమీఁద (నికషముమీఁద) ఒరసి చూచి (యెఱుఁగవచ్చును) గాక, సుద్దజాతన్ = సుద్దమట్టి జాయిమీఁద (ఒరసి) యెఱుఁగవచ్చునే! ఏ గట్టి జాతిమీఁదనే నొరసినఅంతయుఁగాకున్నఁ గొంతైనఁ దెలియవచ్చునేమో కాని సుద్దజాతిమీఁద నొరసిన నేమియుఁ దెలియరామిగాదు, ఆ బంగారు గీటునకు నా సుద్దజాయియే పిండిగా నలఁగి రాలును సమస్త కనక వర్ణము లనఁగా నేఁడు మన దేశమున బంగారు వన్నెలు పదునాఱు వాడుక- స్వర్ణకారులు ఒరగంటిమీఁదఁ బదునాఱు వన్నెలను గుర్తింపఁగలరట !

వ. అది యట్లయని, 33.

గీ. అస్మదాదికవికృతుల నాదరించి
వెలయు సత్కవి బుధ గురు బలము వడసి
యొనర దైవజ్ఞునట్లు శుభోదయమున
దివ్యసుకృతిఁ బ్రతిష్ఠింతుఁ దిరముగాఁగ. 34.

దైవజ్ఞునట్లు జ్యోతిశ్శాస్త్రజ్ఞునివలెఁగున్, ఒనరన్ = ఒప్పఁగా, అన్య = విరోధియైన, అసత్కవియైన, తారకవికృతులు = తారుఁడను కవి రచించిన కావ్యములను, అనాదరించి = గర్హించి-(దైవజ్ఞపరమైన యర్థాంతరము) అన్య = అశుభములయిన, తారక = నక్షత్రముల వలని, వికృతులు = చెడుగులను, అనాదరించి = గర్హించి, (ఆ నక్షత్రములనే విడనాడి) వెల - దనీ; వెలయు = విఖ్యాతుఁడుగానుండు, సత్కవులయు, బుధులయు, గురువులయు, బలమును (సహాయమును) పడసి, (అర్థాం) వెలయు = వెలుఁగొందు, సత్ = (మంచి) నక్షత్రముల యొక్కయు, కవి = శుక్రుని యొక్కయు, బుధుని యొక్కయు, గురు = బృహస్పతి యొక్కయు, బలము = శుభస్థాన స్థితి కృతమయిన సహాయమును, పడసి, శుభోదయమున = మంచి యుదయకాలమున, బ్రాహ్మముహూర్తమున, చిరముగాఁగ = శాశ్వతముగా నుండునట్లు, దివ్యసుకృతిన్ = ప్రశస్తమయిన సత్కావ్యమును (అర్థాం) దివ్యమయిన శుభ నిర్మాణమును (దేవలయాతటాకాదికము) ప్రతిష్ఠి తున్ = నిర్మింతును – ప్రతిష్ఠ చేయుదును. ఈ పద్యమువలన, నన్నిచోడ కినాఁడొక యసత్కవి, తారుఁడను వాఁడుండెనని యేర్పడును. ఇక్కడ రెండర్థములు పొసఁగితీరవలెను – గాన ఒక యర్థమున 'తారకవి' యుండక తప్పదు. 'తతులు' నీరసము అర్థానను గుణమునని వ్రాతప్రతిలో నున్నను నేనై 'కృతులు' అని మార్చినాఁడను.

చ. సరళముగాఁగ భావములు జానుఁ దెనుంగున నింపు పెంపుతోఁ
బిరిగొన వర్ణనల్, ఫణితి పేర్కొన, నర్థము లొత్తిగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాఁ ౩౫.

భావములు, సరళముగాఁగ, ఇంపు పెంపుతో జానుదెనుంగున, వర్ణనల్ పిరిగొన, ఫణితి, పేర్కొన, అర్థములు ఒత్తిగిల్ల, ప్రాణములు, బంధురముగ, అక్షరములు మధుమృదుత్వరసంబునఁ, కందళింప, సూక్తులు ఆర్యులకుఁ, కర్ణరసాయలీలఁ, క్రాలఁగాఁ, (నేను దివ్యసుకృతిఁ, ప్రతిష్ఠింతున్) అన్న పూర్వ పద్యపుఁ దుదిపట్టుతో నన్వయము–ఉత్తరపద్యముతోఁగూడ నన్వయింపవచ్చునుగాని, యప్పు డేకవాక్యమునవే చెప్పినది మరల చెప్పుట–(సూక్తులను,

భావమును, వర్ణనలను గూర్చి) యసంగతమగునుగాన దాని విడనాడినాఁడను— పద్య గద్యములలో భావములు ఉదారములుగా తేటగా నుండునట్లును, అష్టాదశ సంఖ్యోపలక్షితములయిన వర్ణనలు, జాను తెనుఁగు హృద్యతాతిశయముతో మెలఁపారునట్లును, ఫణితి–రచనా విధానమును, పేర్కొ–నన్ = విన్న చదివిన వారు పేర్కొనునట్లును, ఈ గ్రంథమురచనము మెచ్చఁదగినదని చెప్పునట్లనుట అర్థములు = పద్యగద్యములయర్థములు, ఒత్తిగిల్లన్=[……..] ప్రాణములు = కావ్యప్రాణములు (పది) బంధురముగన్ = చిక్కఁగా నుండునట్లును, అక్షరములు, మృదుమధుత్వరసంబుఁన్, మార్దవముతో మాధుర్యముతో కంద ళింపన్ = [… ……………..], అక్షరములు (ద్రాక్షపండ్లవలె) మృదువులై, మధురరసప్లుతములై యొప్పారఁగా, సూక్తులు = మంచి మాటలు, కర్ణములకు రసాయనములు వోలెఁ జెలఁగఁగా, దివ్యసుకృతిని బ్రతిష్ఠింతును. జానుఁదెనుఁ గనఁగా —

చ. బలుపొడ తోలు సీరయును బాపసరుల్ గిలుపారుకన్ను వె
న్నెలతల సేదుకుత్తుకయు నిండిన వేలుపుటేఱు వల్లుపూ
సలుగల ఱేని లెంకదని జానుతెనుంగున విన్నవించెదన్
వలపు మదిందలిర్ప బసవా బసవా బసవా వృషాధిపా.

వృషాధిపశతకము.

ఉ. ఏనికతోలుపచ్చడము, నెమ్ములపుబ్బసరంబు, నంపపూఁ
దేనియ తియ్యవిల్లు గని త్రేచ్చిన బొట్టు పలంగు నెట్టెమున్
వీనుల చూపుపెండెము దవిల్చినమంచముకోడు కైదువుం
బూనినప్రాఁతవేల్పుగని పోకలఁబోయిన వెన్నుఁ డిట్లనున్;

ఉత్తరహరివంశము.

ప్రాణములు :— 'శ్లేషః ప్రసాదస్సమతా మాధుర్యం సుకుమారతా। అర్థవ్యక్తి రుదారత్వమోజః కాన్తి సమాధయః । ఇతి వైదర్భమార్గస్య ప్రాణాదశగు ణాస్స్మృతాః, దండి కావ్యాదర్శము. దీని వివరణ మందే చూడఁదగును. అఖిల కావ్యంబులకురీతు లాత్మయంద్రు; ప్రాణదశకంబు వానికిఁ బ్రాణమరయ,
క. క్రమమున నౌదార్యశ్లే। షములును సుకుమారతా ప్రసాదమధురతా సమతార్థ వ్యక్త్యోజ। స్సమాధికాంతులునుదగు దశప్రాణములై॥ కావ్యాలంకారచూడామణి.

రసాయనము :—

యజ్జరావ్యాధి విధ్వంసివయస్స్తంభక స్తథా
చక్షుష్యం బృంహణం వృష్యంభేషజంతద్రసాయనమ్
దీర్ఘ మాయుః స్మృతీర్మేధాం ఆరోగ్యం తరుణంవయః
తే హేంద్రియ బలం కాంతిం నరోవిందేద్రసాయనాత్

భావప్రకాశః

సీ. మృదురీతి సూక్తులిం పొదవింప మేలిల్లు
భావమ్ము నెలమి ప్రీత్యావహముగ
మెఱుఁగులఁ గన్నులు మిఱుమిట్లువోవంగఁ
గాంతి సుధాసూతి కాంతిఁజెనయ
వర్ణన లెల్లచో వర్ణన కెక్కంగ
రసములు దళుకొత్తి రాలువాఱ
దేశిమార్గమ్ములు దేశీయములుగా న
లంకారములు దా నలంకరింప

గీ. నాదరించి విని సదర్థాతిశయమున
బుధులు నెమ్మనమున నిధులు నిలుప
వలవదే సమస్తవస్తుకవీశ్వర
రచిత రుచిర కావ్యరత్నవీథి. 36.

ఈ పద్యమున కావ్యము రత్నవీథిగా రూపణ చేయఁబడినది. సమ.......వీథి, సమస్తవస్తు = బంగారు వెండి, నవరత్నములు, మొదలయిన యెల్ల వస్తువులతో, రచిత మయిన, రుచిర కావ్యమనెడు రత్నవీథి = రత్నాలబజారు, వలవదే = ఉండవలదా ? ఎట్లు దవలెనంటే; సూక్తులు, మృదు రీతిని ఇంపొదవింపఁగా (ఉండవలెను.) ఆ బజారులో వస్తువులఁ జూడఁ గొనఁ గోరు వారికి 1. అక్కడి సూక్తులు ఇంపొదవింపవలెను. వానిని జూపు వారు మృదువుగా మర్యాదౌచితితో మాటాడ వలెననుట—కావ్యభాష కూడ మృదు మధురముగానుండ వలెననుట, 2 భాషయేకాక భావముకూడ, ప్రీతిని గొల్పునదిగా నుండవలెను—ఉభయత్ర సమమే, 3. మెఱుఁగులన్= ఆయారత్నాదుల మెఱుఁగు పెట్టుటలు

పూతమెఱుఁగులుగాక నిజముగా వస్తువులందు దేర్పఁదగినవై కన్నులకు మిఱుమిట్లు గొల్పునవిగా నుండవలెను. కావ్యపు మెఱుఁగులు గూడ అర్థమైనవై యోచించి చూచుచో కన్నులకు మిఱుమిట్లు గొల్పవలెను. కాంతి = రత్నాదులకాంతి, సుధాసూతి కాంతిన్ = సుధను స్రవించు చంద్రకాంతిని, చెనయన్ = మించఁగా కూడవలెను—కావ్యమున కాంతియను కావ్యప్రాణము చల్లగా హాయిమని సుధను వర్షించునదిగా వెన్నెలవలెనుండవలెను.-వర్ణనల = వర్తకులు చేయు రత్నాభరణాది వర్ణనలు, ఆ వస్తువు లిట్టివి యీ వస్తువు లిట్టివియని చేయు ప్రశంసాప్రసంగములు, ఎల్లచోన్=అంతటను, వర్ణనకున్ ఎక్కంగన్ = మెప్పుకోఁదగినట్లుండగాన్. కావ్యమందలి యష్టాదశవర్ణనలు, ఎల్లచో, ప్రశస్తికెక్కఁగా, రసములు = (ఆభరణాదుల) బంగారము, తళుకొత్తి = మిసలుదేరి, రాలువాఱన్ = జలజలమని రాలుచుండఁగా, దేశిమార్గంబులు = ఆయావస్తు విశేషములుండు ప్రదేశములకు మార్గములు, దేశీయములుగాన్=అందమయినవికాఁగా, కావ్యపక్షమున, దేశిరచన, మార్గరచన, దేశీయములుగాన్=హృద్యములుగాఁగా, అలంకారములు విపణ్యలంకారములు, కావ్యాలంకారములు, దాన్ అలంకరింపన్ ఇక్కడ 'తామలంకరింప' ఉండుట యుక్తము-అలంకారములు బహువచమున, ఒండె'వారుదా వచ్చి పోయివిడిచిరి' ఇత్యాది విధముల వచన నిరపేక్షముగా 'తాన్' అనునది వాక్యాలంకార మేని కావచ్చు. ఇది నెల్లూరి ప్రాంతపువారి వాడుకలోనే ఉన్నది. తిక్కన కూడఁ దీని బ్రయోగించెను.

[అసంపూర్ణము]

## వీరేశలింగము పంతులుగారు -
## తంజావూరు - కుమారసంభవము [1870 / 1890]

[ ఇది పంతులుగారు ప్రభాకరులకు వ్రాసిన (1917) లేఖ
వివరణకు చూ. మణిమంజరి - ఫిబ్రవరి 1981]

.. "సత్యాశ్రయునిదొట్టి చాళుక్య నృపుల్" అన్న పాఠము వ్రాత ప్రతిలోలేని పక్షమున మన రామకృష్ణ కవిగారి కాపాఠ మెక్కడనుండి వచ్చినది ? ౧౮౭౦ సంవత్సర ప్రాంతమునందే నేను తంజావూరి మండల న్యాయాధిపతియైన యొక మిత్రుని సాహాయ్యమున నక్కడి తెలుగు పుస్తకముల పట్టికను దెప్పించి తరువాత కొన్ని సంవత్సరములకు నేనే పోయి కుమారసంభవాది కావ్యములను జూచితిని గాని నాకప్పటి కీ గ్రంథమునందు శ్రద్ధ లేకపోయెను.

ప్రబంధ రత్నాకరము ముగిసినదా ? పూర్తికాఁగానే నాకొక ప్రతిని బంపుఁడు. చిత్తగింపుఁడు.

ఇట్లు
విన్నవించి నమస్కరించు
విధేయమిత్రుడు—కం—వీరేశలింగము.

## ప్రభాకరులు - తంజావూరు లైబ్రరీ [1916]

[చూ. ప్రజ్ఞా ప్రభాకరము. పు. 127–140 ప్రభాకర శాస్త్రిగారి ఆత్మ కథలో తంజావూరు లైబ్రరీకి సంబంధించిన ఈ వృత్తాంతము 1916–17 సం॥ నడుమ జరిగినది.

తంజావూరు గ్రంథాలయమును దర్శించి అచట గల గ్రంథములను వెలుగులోనికి దెచ్చి వాటి విలువను లోకమునకు చాటిన వారిలో గత శతాబ్ది చివర వీరేశలింగం పంతులు గారును, ఈ శతాబ్ది ఆరంభంలో వేటూరి వారు, మానవల్లి వారు ప్రముఖులు. కురుగంటి వారు, పింగళి వారు, విశ్వదేవుని సుందర శర్మ మున్నగు వారి కృషి, ఆ తరువాతి కాలమున పేర్కొన దగినది — సం॥]

కృష్ణా జిల్లాలో గ్రంథార్జనమునకుఁ బొమ్మని మా పై యధికారి శ్రీ కుప్పుస్వామిశాస్త్రిగారు నామీఁది యనురాగముతోనే యాజ్ఞ యిచ్చిరి. వెంటనే నేనును, శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారును వెడలితిమి ..

నాకు ఆఫీసునుండి టెల్గిగ్రాం వచ్చెను. 'తత్క్షణమే నీవు తంజావూరి లైబ్రరీ పరిశీలనమునకు వెళ్ళవలసినది. అక్కడ చేరి పని చేయవలసినది' అని....

కొలది దినములకే ఆ లైబ్రరిపనిని వడిగా ముగించి వేసితిని .

తంజావూరిలో పరిశీలించిన గ్రంథముల విషయమున జరపవలసిన తర్వాతి కార్యములను జరపుటకు మద్రాసులో మేము గొంత పని చేయవలసియుండుటచే మూడు నాల్గు నెలలు మేము మద్రాసులోనే యుంటిమి. అప్పుడు మద్రాసు గవర్నరుగా పెంట్లండు దొరగా రుండిరి. ఆయన నెవరో ఇంగ్లండువారో, జర్మనీ వారో ప్రేరేచి రఁట! 'తంజావూరి లైబ్రరీని మాకుఁ గొనిపెట్టవలసిన'దని అందుకై ఆ లైబ్రరి విలువ కట్టుటకు గ్రంథముల పరిశీలనము జరుపవలసెను. మమ్మందుకు తంజావూరు పంపిరి.

ఈ రహస్యము పైకి పొక్కినది. ప్రజలు గందర గోళము చేసిరి. గవర్నరుగారు తమ తంత్రము కట్టిపెట్టిరి. ఒకవిధముగా మే మక్కడికి వెళ్ళి జరపిన పరిశీలనము వ్యర్థమయినది. కాని యానాఁడు మేము వ్రాసిన విమర్శములు గొన్ని యటుతర్వాత తంజావూరి కేటలాగులు ప్రకటించువారుపయోగించుకొనిరి. మేము విలువ కట్టుటకే వలయు నంశములను ప్రధానముగా గూర్చితిమి. కాని గ్రంథాంశ పర్యాలోచనకుఁ గాదు. కాన మా లిస్టులలో ఆయా విషయములు పర్యాప్తముగా సేకరింపలేదు గాని పుస్తకముల నన్నింటిని సరిగా గుర్తించితిమి. గణించితిమి. గవర్నరుగారిపని వ్యర్థమయిన తర్వాత మా లిస్టుల నన్నింటిని తంజావూరి లైబ్రరికిచ్చివేసితిమి. ఆ లెక్కకట్టుపనిలో నేను మద్రాసులో నుండి ఆరోగ్యవిషయమున, గ్రంథపరిశీలన విషయమున, యోగసాధన విషయమునఁ జాల నభ్యుదయము చెందితిని.

## ప్రబంధ రత్నావళి - కుమార సంభవము [1918]
## నన్నిచోడఁడు

ఈ కవి కాలనిర్ణయాదికమును గూర్చి పెక్కురు చర్చించి యున్నారు. అన్ని చర్చల పర్యవసానము నింతే. ఈ కాలమువాఁడని నిర్ధారించుటకుఁ దగిన సాధనములు లేవు. శ్రీచిలుకూరి వీరభద్రరావుగారాంధ్రుల చరిత్రమున నిట్లు వ్రాసినారు. క్రీ. శ. 925–40 సం. ప్రాంతమున నున్న యీ సత్యాశ్రయుని నన్నెచోడమహాకవి తన కుమారసంభవకావ్యమున నీక్రింది పద్యములోఁ బేర్కొని యున్నాఁడు.

"క. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయమునఁ
జన సత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపుల్."

దీనింబట్టి నన్నయభట్టారకునకు నూఱేండ్లకుఁ బూర్వమే యాంధ్రకవితా సతి వర్ధిల్లుచున్నదని స్పష్ట మగుచున్నది.

శ్రీ వీరభద్రరావుగారుగాని, మఱియెవరుగానీ నన్నిచోడఁడు నన్నయ కంటె ప్రాచీనుఁడని చెప్పఁజూచుటకును, గావచ్చు నని లోకము విశ్వసించుటకు నీఁ పద్యమే ప్రధానాధారముగా నున్నది. శ్రీ రామకృష్ణకవిగారు ప్రచురించిన కుమారసంభవముద్రితప్రతిలో నీపద్య మిట్లున్నది. 1909 సం॥ దీనిని ముద్రించినారు. అప్పు డీపద్యమునకు వారు పాఠాంతరమును జూపలేదు. వారి యచ్చునకు మాతృక యెక్కడిదో చెప్పను లేదు. కవిగారు కుమార సంభవము రెండవభాగపుఁ బీఠికలో నిట్లు వ్రాసినారు. "కుమారసంభవ ప్రతులలో

నొకటి నాకు నైజామురాజ్యమునఁ బ్రాచీనశాసన శోధనార్థము పోవుచుండఁగాఁ గర్ణాట దేశముననే లభించెను. తక్కినవి రెండును శుద్ధద్రవిడదేశముననే లభ్యములై పడెను” ద్రవిడకర్ణాటదేశములందు మూఁడు ప్రతులు దొరకినను నచ్చులోఁ బెక్కులు గ్రంథపాతములుండుట వింతగానున్నది. ఆ మూఁడు ప్రతులు నొక్క మాతృకకే పుత్త్రికలాయేమి ? కాకున్నచోనవి పాఠభేదములు లేకయు సమాన గ్రంథపాతములు గలిగియు నుండుట వింతగదా? పట్టికలో ముఖ్య పాఠభేదములని వారు చూపినవి ప్రాయికముగా ముద్రణమం దర్థానుగుణముగాఁ జేయఁబడిన సంస్కారములకు వ్రాఁతప్రతిలో నున్న తప్పుపాఠములుగా గోచరించుచున్నవి. కుమారసంభవప్రతులయొక్కయుఁ బాఠములయొక్కయు రహస్యము లింకను బయల్పడవలసియే యున్నవి. కాని తంజాపురపుసరస్వతీపుస్తక భాండాగారమున్న దాటియాకులపై వ్రాయఁబడిన కుమారసంభవపుఁబ్రతి యున్నది. అక్కడఁ దక్క నింతవఱకుఁ బ్రత్యంతర మెక్కడను మనకుఁ గనరాదు, వినరాదు. ఆ పుస్తకములో నైపద్యమిట్లున్నది.

> ''క. మనుమార్గకవి లోకం
> బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
> గున నిలిపి రంధ్రవిషయం
> బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్."

కవిగారికి ''చన సత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపుల్” అన్న పాఠ మెక్కడనుండి వచ్చినదో! వా రింకనెక్కడిప్రతి సంపాదించినారో! ప్రథమ భాగమును ముద్రించునప్పటికి వా రీతంజాపూరుప్రతి నెఱుఁగనే యెఱుఁగరు గావలయు. ఎఱిఁగియుందురేని యనర్ఘ మగునీపాఠమును జూపకుండుట కేమి కారణము ? తంజాపూరుపుస్తకశాలలో నన్నిచోడనికుమారసంభవ మున్నదని మెల్లరు నెఱిఁగిన తర్వాత క్రి. 1914 లో వీరు ప్రచురించిన కుమారసంభవపు రెండవభాగమున ''చాళుక్యరాజు మొదలుగఁబలువుర్'' అనుపాఠాంతర మున్నట్లు తెలిపిరి. కాని యిప్పుడయినను దంజాపురపుఁ బుస్తకమును వీరు చూచినట్లు

వ్రాయలేదు. కావున నీపాఠము మఱియొకప్రతిలోఁ జూచినారేమో? అత్యుత్సాహ మెందులకు? తంజావూరుపుస్తకపాఠముమాత్రమే మనకిప్పుడు గ్రాహ్యము. శ్రీకవిగారిపాఠము గలమాతృక బయల్పడునెఱకును. అట్టిప్రత్యంతరము బయల్పడెనా యది పాఠాంతరముగాఁ గూర్చుకొందము. ఇఁకఁ "జాళుక్య రాజుమొదలుగ" నన్నప్పుడు రాజరాజనరేంద్రుఁడే యేలకారాదు? చోడఁడు నన్నయకంటెఁ బ్రాచీనుఁ డనుట కాధారములు తగినవి లేవు. శ్రీవీరేశలింగము పంతులుగారు నన్నెచోడని భాషాప్రయోగములను గూర్చి చేసినయాక్షేపములు నిలుపఁజాలనివి.[1] వానినెల్ల నిర్వచించుట కిక్కడ స్థలము చాలదు. పాల్కురికి సోమనాథుఁడు 1180 ప్రాంతముల నున్నవాఁ డనుపంతులవారిసిద్ధాంతము పోయెను. నన్నిచోడఁ డంతకు ముందటివాఁడో వెనుకటివాఁడో సిద్ధాంత మేర్పడ లేదుగదా! ఈయిర్వురిలో నొకని పుస్తకము నింకొకఁడు చక్కఁగా సంగ్రహించుకొన్నాఁడు. ఇది చదివి చూడుఁడు!

"ద్వి. నెట్టిన నేలకు నింగికి సూత్ర
పట్టి మ్రోఁకాళ్లకు బట్టతలలకు
ముడివెట్టఁ దననీడ గడపంగఁ బాఱ
వడి నెండమావులకడగళ్ల కట్టి
పాయక రెండుగాఁ బారెడునీరు
వేయఁ బుల్లున్న గోరో యని యమ్మ
జానార యొలువఁ జిత్రాతిపైఁ గ్రుంక
నేనుంగుపురు డోమ నిసుము। తా ద్వేన
లలిగొన దెసలు తాళములు వాయింపఁ
జెలఁగుచు రోఁకటఁ జిగురులు గోయ
కలి వెన్న పుచ్చఁ గుండలు దొంతిఁ బేర్చ
నిల మంచుఁ గుంచానఁ గొలువ రేఁబవలు

1 ఆంధ్రకవుల చరిత్రము 1 భాగము.

సేయ నాకసమునఁ జిత్రరూపములు
వ్రాయ వాయువుఁ బట్టి వడగళ్లగుళ్లు
గట్ట వెన్నెలగుంపుగాఁ జేయవచ్చి
పుట్టినప్పుడె నేర్చు బుద్ధులప్రోఁక."

"సీ. నేలయు నింగియుఁ దాలముల్ వాయింప నెండమావులఁ బట్టి బండతలయు,
మోఁకాలుముడివెట్టి రోఁకటఁ జిగుళులు గోయఁ జత్రాతిపైఁ గ్రుంగ నిడుపు
లేక చిత్రము వ్రాయ నాకాశమునఁ దాఁపరము నిడ మంచుఁ గుంచములఁ గొలువ
నేనుంగుపురు డోమ జానార గొన గాలి గంటిడ నిసుమున గట్టు దాల్ప,

గీ. నీరినడుము దెంప నేలఁ దెన్నుండి చే
వెల్పఁ గలిగియుఁ ద్రచ్చి వెన్న గొనఁగఁ
గడప నేర్పు గలిగి కందువు మా నేఁడై
కత్తిగంటు లయిన యత్తగంతు." కుమా. భా. 2-135.

ఇట్లీయిర్వురగ్రంథములనుండియు వలసినన్ని సంవాదములు చూపవచ్చును. సులువుగా ద్విపదలో సోమనాథుఁడు కూర్పఁగా నన్నెచోడఁ డిట్లు సీసపద్యమునఁ జేర్చుకొన్నాఁడేమో ! సుసూక్ష్మముగా నీయిర్వురకృతులను బరిశీలించినచో నీ విషయము బయల్పడఁగలదు. భాషావ్యుత్పత్తిలోఁ జోడఁడును సోమనాథుఁడును గూడ సమధికులేయని యీయాగ్రంథములఁ జక్కఁగం జదివి యెఱిఁగినవారు భావింతు రని నా నమ్మకము.

# కుమార సంభవము - తెలుఁగు వెలుఁగులు (1948)

వేటూరి ప్రభాకరశాస్త్రి

"రవిపదాహతిఁ జెడియుండు రాజువోలె
నని సరోజములొందఁ జక్రాహ్వయములఁ
జెట్ట లాడుటకని వికసిల్లుటకును
వెల్లనైనట్లు చుక్కలు వెలరువాఱె." (కుమా రా ఆ. ౧౮౩ ప.)

దిద్దవలెను. అర్థము కుదరక గ్రుడ్లుమిటకరించి కొట్టుకొని యెట్టకేల కిట్టు కవిపాఠము కనిపెట్టఁగలిగినాను :

"రవిపదాహతిఁ జెడి యుడురాజు వోయె
నని సరోజములొద్దఁ జక్రాహ్వయములు
చెట్టలాడుట, కవి వికసిల్లుటకును,
వెల్లనైనట్లు చుక్కలు వెలరువాఱె."

ఉడురాజు = నక్షత్రాధిపతి చంద్రుఁడు. ఉడిగిపోవు, ముగిసిపోవు రాజు అని కూడ; ఉడుఁబోతపిందె వంటిది. విరోధియైన యుడురాజు పడిపోవుట నాకసమున కెగసి చక్రవాక పక్షులు చూచి యా సంతోషవార్తను మిత్రములైన సరోజముల యొద్దకి వచ్చి, చెట్టలాడుటకును = పడిపోయిన జంద్రుని నిందించు టకును, మఱియు నుత్సాహముతో ఱెక్కలల్లాడు(ర్చు)టకును ననియు. అవి = మిత్రములయిన యా సరోజములు, వికసిల్లుటకును = వాని చెట్టలాట కుప్పొంగు టకును, వికాసము చెందుటకును, నవమానము చెంది తెల్లపోయినట్లు చంద్రుని మిత్రములైన నక్షత్రములు కాంతిహీనములై వెలవెలఁ బోయినవి.

కవి హృదయము పైయట్లు గోచరింపఁగా నాకవి నాకుఁ గనకాభిషేకము చేసినాఁడన్నంత సంతోషముతోఁ బొఁగినాఁడను. మఱికొన్ని :

"ఆయవనీరుహోద్గతలతాంతవినిర్గతసౌరభప్రవా
హాయత సాంద్రమై ఫలితమై యొగిఁ బర్విన దాయఁబోవనం
బాయను రాక చుట్టి మధువ్రజమాలిక లుండె నొప్పి పు
ష్పాయుధుకాలఁ జుట్టు మరుఁడాయసవప్రము వెట్టినట్టిదై."
(నవమాశ్వాసము ౨౯౮ ప.)

దీనికి నా సంస్కరణము :

"ఆయవనీరుహోద్గతలతాంత వినిర్గత సౌరభప్రవా
హాయతి సాంద్రమై ఫలితమై మొగిఁ బర్విన డాయఁబోవనుం
బాయను రాక చుట్టి మధువ్రజమాలిక లుండె నొప్పి పు
ష్పాయుధుశాలచుట్టు మధుఁ డాయసవప్రము వెట్టినట్లులై."

పుష్పాయుధశాల కధికారియైన వసంతుఁడాయాయుధశాలలోని కెవరికిని రాకపోకల వీలు లేకుండుటకు చుట్టును నినుపకోట పెట్టినట్లు భృంగమాలికలు పూలచెట్లను జుట్టియున్నవి. పూచినచెట్లు పుష్పాయుధశాలలు. మధుఁడు తదధినేత. ఇందులోఁ బుష్పాయుధుకాల, మరుఁడు ఉండుట యసంగతము.

"సుజనజనైకభూషణము శూరత దుర్జనభూషణంబు స
ద్ద్విజ విబుధాశ్రితప్రతతి వేడుకఁ బ్రోపుసః రాజ్యచిహ్నమా
క జలమహాభిషేకమునఁ గట్టిన పట్టము వీజనంబు భూ
భుజులక కాక యిన్నియును బుట్టికినైనను లేవె చూడఁగన్."
(౧౦-౨౬౪ ప)

దీనికి నా సంస్కరణము :

"సుజనజనైక భూషణము శూరత దుర్జనభూషణంబు స
ద్ద్విజ విబుధాశ్రితప్రతతి వేడుకఁ బ్రోపును రాజ్యచిహ్నమా
క జలమహాభిషేకమునఁ గట్టిన పట్టము వీజనంబు భూ
భుజులక కాక యిన్నియును బుట్టికినైనను లేవె చూడఁగన్?"

* * *

"వనధి నీ రెల్లఁ గొనిపోవఁ గని సహింప
కబ్ధతతి గిట్టపట్టిన నరుగ నోప
కోలి దొంతులు గొనిపడి యున్న కారు
మొగుళులనఁ జూచి తటభూమి మొగళు లమరె."
(౧ ఆ. ౧౨౦ ప.

దీనికి నా సంస్కరణము :

"వనధిసీ రల్లఁ గొనిపోవఁ గని సహింప
కబ్ధితటి గిట్ట పట్టిన నరుగనోప
కోలి దొంతులుగొని పడియున్న కారు
మొగుళులనఁ బూచి తటభూమి మొగళు లమరె."

అబ్ధికిఁ జుట్టు నబ్ధితటి కాపలా కాయుచున్నట్లును, సముద్రములోని నీటిని మెల్లగాఁ బైపైకి మేఘము లెత్తుకొని పోవుటకుఁ జూచి యా యబ్ధితటి యా మేఘముల గిట్టలను (వానకాళ్ళను) బట్టి యీడ్చి క్రిందఁబడవేయఁగా నవి దొంతులు గొని పడియున్న వన్నట్లు సముద్రతటమున మొగలిచెట్లున్నవి. ఆ మేఘములలోని మెఱపులా యనునట్లు మొగలి పూవులున్నవి.

* * *

"తను వసితాంబుదంబు సితదంతయుగం బచిరాంశు లాత్మగ
ర్జన మురుగర్జనంబు గరసద్రుచి శక్రశరాసనంబు నై
చన మదవారివృష్టి హితసస్య సమృద్ధిగ నభ్రవేల నాఁ
జను గణనాథుఁ గొల్తు ననిశంబు నభీష్టఫల ప్రదాతగాన్."

(౧ ఆ ౭ ప.)

దీనికి నా సంస్కరణము :

"తను వసితాంబుదంబు సితదంతముఖం బచిరాంశు వాత్మగ
ర్జన మురుగర్జనంబు గరసద్రుచి శక్రశరాసనంబు నై
చన మదవారివృష్టి హితసస్య సమృద్ధిగ నభ్రవేళ నాఁ
జను గణనాథుఁ గొల్తు ననిశంబు నభీష్ట ఫలప్రదాతగాన్."

విఘ్నేశ్వరుఁ డేకదంతుఁడు కాన సితదంతయుగంబని యుండరాదు. అచిరాంశువు = మెఱుపు. అది ఉపమానము కాన అప్పుడప్పుడు మాత్రమే కన్పడునదిగా నుండవలెను. సితదంతముఖంబనుటలో నోరు తెఱచినప్పు డగపడుట, మూసినప్పు డగపడకుండుట దంతాగ్రమునకు కలిగి యచిరాంశు సామ్యము సిద్ధించును.

* * *

"ముదమున సత్కవి కావ్యము
నదరఁగ విలుకానిపట్టినమ్మును బరహృ

ద్భిదమై తలయూఁపింపని
యది కావ్యమె మలరి పట్టినదియుం గరమే ?''

(౧ ఆ. ౪౧)

వ్రాఁతప్రతిలో నీపద్య మిట్లున్నది :

''మదమున.........కావ్యము
నదరంగ విలుకాని పట్టినమ్మును బరహృ
ద్భిదమై తలయూపింప్పని
యది గావ్యమె మరి పట్టినదియున్ శరమె.''

దీనికి నా సంస్కరణము :

''ముదమునఁ గవికృతి కావ్యము
నదరున విలుకాని పట్టినమ్మును బరహృ
ద్భిదమై తలయూపును, బెఱ
యది కావ్యమె చెప్పఁ, బట్ట నదియున్ శరమే ?''

ముదముతోఁ గవి రచించిన కావ్యమును, అదరుతో విలుకానిపట్టిన యమ్మును ఒరుని హృదయభేదనము గావించి తలయూపించును. అట్లుకానిచో, రచించినంతమాత్రముచే నది కావ్యముకాదు. చేతఁబట్టినంతమాత్రముచే నది శరమును గాదు. కావ్యమును, శరమును రెండును బరహృదయభేదనము చేసి తల యూపించునవే కాని కావ్యము దానిని ముదముతోఁ జేయును; బాణ మదరుతోఁ జేయును. ముద్రితప్రతిలోని, వ్రాఁత ప్రతిలోని పాఠములకు సరసాన్వయము కుదురలేదు.

* * *

''జా నటి పశుపతి నుఱక వి
ధాన మహారంభుఁడైన దక్షుండను న
జ్ఞానికి మునుకొని వచ్చిన
మానంబున నమర సతివిమానము వచ్చెన్.''

(౨ ఆ. ౧౫౦ ప.)

దీనికి నా సంస్కరణము :

''జా నటి పశుపతి నుఱక వి
తానమహారంభుఁడైన దక్షుండను న
జ్ఞానికి మునుకొని వచ్చు వి
మానంబన నమర సతివిమానము వచ్చెన్.''

# ప్రభాకరుల మార్జినల్ నోట్స్
## (కుమారసంభవమును గూర్చి)

[శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారి కుమారసంభవవిమర్శము (1937) లో ప్రభాకరుల దస్తూరీతో గల మార్జినల్ నోట్సు నుండి కొన్ని అంశాలు: బ్రాకెట్ల లోని విషయము శ్రీ లక్ష్మీపతిశాస్త్రి గారిది —సం॥]

1. వాంతాశనము

పు. 3. (జనఁజాళుక్యరాజు మొదలగు పలువుర్‌- ఈ పాఠమే తంజావూరి ప్రతిలో నున్నది) వాంతాశనము.

పు. 123. (కింకవేస్తస్యకావ్యేన)- దీనిని కవిగా రుదాహరించిరి. I భాగపీఠిక. (మధ్యందినార్క)- సాంబమూర్తిశాస్త్రి వ్యాసము.

పు. 124. (నన్నెచోడుని 'జొన్నలు గొన్న ఋణము- ఈరీతి కన్నడమునఁ బ్రాయికముగఁ గలదు') బసవపురాణ పీఠిక చూచునది. వాంతాశనము. ఈ విషయమును నేనే వ్రాసితిని ఇతరు లెవరూ వ్రాయలేదు. కన్నడీలు ఎఱుగరు.

పు. 125 (కః కేనార్థీ కో దరిద్రః... ఇయిరీతిని పాఠము నిరూపించితిని) ఆ! ఆ! ఎవరు చూచిరి! ఎవరేని చూపిరా? ద్రోహము!

పు. 132. (బాహుబలోన్నతి)- కవిగారు చూపినదే.

పు. 135. (నేలయునింగియు)- కవిగారు చూపిరి. (వడగండ్లగుండ్లు. ఇసుకత్రాడ్వేయ) ప్రబంధరత్నావళి పీఠిక చూ.

పు. 155. (స్మరమందిరమ్ము)- క్రీడాభి. పీఠిక. చూ.

పు. 159. (ఇట బారావత వ్యాసములు... మెచ్చుకొన్ననుఁ దృప్తిఁబడు)- శివరామమూర్తి వ్యాసము చూచునది.

పు. 160. (కలకలనవ్వినట్లు)- కవిగారి పీఠిక.

పు. 164. (మునుమిడి... జొన్నలు గొన్న ఋణంబు నీఁగుదున్... జొన్న పండెడి దేశములోనివాఁడే-) వాంతాశనము (పు. 124). ఇదే పద్యం ఉదాహృతం బాలా భేదం ఉఁది.

పు. 167. (బలుపొదతోలు సీరయు-) వాంతాశనము

పు. 168. (శివకవుల కవితలోను...) చూ. బసవ పీఠిక.

పు. 170. ,, ,,

పు. 171. (వారు దిద్దివేసిరిగాన .. అని కనబడుచున్నది)- వాంతాశనము గిడుగు. చూ.

పు. 193. (పొంగారెడు నేతికిఁబయిపై నీరలికినయట్లువోలె నిష్ఫలమయ్యెన్- దశ. 9-8)- వాంతాశనము. ఈ పాఠము నేను గదా చూపితిని !

పు. 194. (ఈపదము ప్రాచీనశాసనములలో... కాజాలవు) వాంతాశనము- నా వ్యాసము చూచునది.

**మరికొన్ని అంశములు :**

పు. 95. (కావ్యాలంకారము... వాడియుందురు) ఎవరన్నారిట్లు ? ఇది యెంత దొంగ వ్రాఁత !

పు. 96. (అని కొందఱందురు. కాని యట్లనుటకు వీలుగనపడదు)- నీవన్నట్లే రచించెననుట యెట్లు ?

పు. 99. (కాళిదాసు... భాగమున నీయఁబడినది) ఈతెల్వి ఉద్భటుని వృత్తి రీత్యాది ప్రకరణ లక్షణ లక్ష్య గ్రంథములు గూడ లోపించి యుండు నని యేల పొఁటలేదు ?

పు. 102. (మొత్తము... భావమేమో తెలియదు)- హరలీల 1000 శ్లోకముల స్తుతి గ్రంథము. వేయి శ్లోకములు వేయి స్తుతులే. కాని వానిలో శివ కథావస్తువు గూఢముగా ఉన్నది. కుమారసంభవము (ఉద్భటు) అలం కారశాస్త్ర లక్షణమయినను అందు కుమారసంభవ కథావస్తువున్నట్టు.

పు. 102 (నన్నిచోడకవి గూడ నీతని కావ్యమునుండి కొంత గ్రహింపక పోలేదు.) శుద్ధ తప్పు !

పు. 120-122 రబ్బిష్‌తో యూనివర్సిటీ సొమ్ము వమ్ము చేయడమా ? ఉద్భటా రాధ్య చరిత్ర పీఠిక చూస్తే బయిసి బయటపడుతుంది గదా !

పు. 132 (కడితల...నాన్) కడితలవారు తోలు డాలు దాల్చినారు. కడితల కాఱు కన్నడం. 'వండఁదర్గినట్టు' 'సుభటులు సొచ్చి చెండిన వండం దఱిగి నట్లుండు వేదండహయ తండంబులను' భీష్మపర్వ I ఆశ్వా.

పు. 133 (సీ. మగలాడు వారికి - సీ. కన్నంబు వెట్టి)
[తిరుమల రామచంద్రగారి దస్తూరీతో గల కాగితపు దునుకయం దిట్లున్నది.]

1. అపహారవర్మ రాగమంజరికై ధనమును పితుకుతోలుసంచి నపహ రించును. P 54.
2. అపహారవర్మ కాంతకుసికన్యాంతఃపుర ప్రవేశమున కయి చెఱసాల గోడ కన్నము పెట్టును (60)
3. అపహారవర్మ అంబాలికకై చండవర్మతో గయ్యంబాడును (64)

4, 5. కందుకవతిని వరించిన మిత్రగుప్తుడు ఆమె యన్న భీమ ధన్వ నిచే సముద్రమున ద్రోయబడి బ్రదికి కలమెక్కి చని వానిని బంది వట్టును (98).

6. ధూమిని పతి ధూమినిని గోలుపోయి దేశాంతరముల దిమ్మరుచు యాచకుడై కష్టపడును (100)

7, 8. కలహకంటుడు నితంబవతికై వల్లకాటి కావలివాడై నీచ సేవ జేయును

పు. 135. (కత్తిగొంటులయిన) - కత్తికి మిగిలిన గొంట్లు - పండితా.

పు. 148. (గంగాధరుఁగొల్వఁగోరు మదిగౌరి మనంబునఁ గోర్కి గూడఁగాన్') గల్వఁగోరు ? గోరి కూఱఁగాన్ కోరికి+ఊఱు.

పు. 149. (రసవేత్తల నిర్ణయము) ఇక్కడ వక్తవ్య మున్నది.

పు. 154. (కడితలవారు - బానంబొనాన్) - వ్రాఁతప్రతి - కడితలకారు - వండుదర్గిన ముత్తునియలై - నల్లదలంముగారి కాల్వొడిచిన యట్లు -

కడితులము - ఖడ్గము; సంస్కృతము; సూర్యని చూ. కాబట్టి కడి తులవారు' ఉండవచ్చును. గడిఖండముగఁ జేయు కడితలవాని 610. ద్వితీయ భాగం - 'కడితల కాఱు.' 118 పు. నోబ్బు చూ. కూమా. కవిగారిది. కవితలకు - కన్నడం [పొడిచెడునాయుధ విశేషము లేక కేడెము. కెంబలకెయతొలపింసంధ్యాం బుద మంపడెదు జడిదు కడితలె దూగుత్తం బిడదె సిడిలబలగమిదెంబి నెగం తాగిదత్తు భార్గవసైన్యం అనం.

కడితలకాఱు=తోలు డాలు దాల్చిన కాలురు.

కడితల=ఖడ్గము పంపభార. చూ.

పు. 155. (నన్ను నొరయవేఁడియే నాథయిచట) గణం తప్పోయి దేవుడా! 'నన్నునొరయంగ'

పు. 158. (విచారింపగా.... వ్రాయవలసివచ్చినది) ఈ హితోక్తిని దమ పయికే త్రిప్పికొని శ్రీ శాస్త్రిలుగారు తమ్ముఁదామే మందలించు కొందురు గాక!

పు. 158. (కరువు అనగా మూస) - అలాగా! పద్యమర్థము కాలేదోయి దేవుడా యీయనకు.

పు. 160. (ఉదుటఁ దెమల్చి) - పద్యం అర్థం కాలేదోయి దేవుడా!

పు. 162 (నెఱతలు గొండజక్కొలని...) ఎఱ్ఱన హరివంశమున చూ.

పు. 163. (సుజన జనైక భూషణము) - పద్యం అర్థం కాలేదోయి దేవుడా! దేవుడ!

పు. 179. (గోమిని) - శాసన పద్యమంజరి II భాగంలో ఉంది చూ. గోమిని.

పు. 180. (కేనము = అసూయ ...గాజాలఁడు) - విక్రమార్కున విజయము (పంపభారతము)న ఉన్నది. చూ. 10. ఆ॥ 77, 81, పద్యములు. కేణ = మత్సర, ద్వేష, రోష-.

* * *

—దేవసేన నడపి దివిజుల గెలిచిన షణ్ముఖుండు నీవు సరియకాదె- ద్రోణ- I ఆశ్వా. ఇది కుమారసంభవ స్మరణమా?

...1067 బల్లిచోడమహారాజు

శ్రీమత్ప్రాత్తపి నన్నిచోడ తనయః
శ్రీవెంకభూపాలకః.... సౌజన్యరత్నాకరః-

శ. 1088 (358) పుట. I వాల్యూం. నెల్లూరి శాసనము

[కుమారసంభవము-యూనివర్సిటీ వారి ప్రతి యందున్న మార్జినల్‌నోట్సు లోని కొన్ని అంశాలు :]

73 తరవారి ఎప్పటి నుండి ఉన్నది ?
గౌరత- (శ 1094) గౌరత నుత్తరాయణము
తరుణియలు- తరుణియ గంటసాలవురి-

శక. 1123. శాసనపద్యమంజరి

12-218 కందగర్భవృత్తము

వ్రాతప్రతి :

హరుమన మారం గొల్చుందరుదాతనిం గొల్చియు నాదిబోడదాం
బొరయునె భూరిభోగ పురభూతి విభుత్వము బొంద్ది పెమ్మిఁతో
వరజనదారుణోగ్ర శరవాతనియుక్త పదంబ్బు నంద్దుందాం
బొరయందు వారకొచ్చి పౌరిభూత గణేశ్వరుం బొం నాత్మలోను.

(మూలమున ఉద్ధృతకందములేదు)

కవిగారిపాఠము : (ద్వి.భా. 997)

హరుమనమారఁ గొల్చుదరు దాతనిఁ గొల్చియు నాదిబోడదాఁ (?)
బొరయునె భూరిభోగపురభూతి విభుత్త్వముఁ బొంది పేర్మితోన్
బరజన దారుణోగ్ర శరపాత నియుక్త పదంబునందుఁదాఁ
బొరయఁడు పోరనోర్చి పౌరి భూతగణేశ్వరుఁబొందు నాత్మలోన్

997. ఉద్ధృతకందము

మనమారఁగొల్చు దరుదా
తనిఁగొల్చియునాదిబోడ దాఁబొరయునె భూ

జనదారుణోగ్ర శరపా
తనియుక్తి పదంబునందుఁ దాఁబొరయఁడుపో.

ప్రకాకరు లీ పద్యమునకు మార్జినల్ నోట్స్‌లో 'చాలా చిక్కుల పద్యము' అని వ్రాసి, కొన్ని సంస్కరణ చిహ్నము లుంచి అందుండి [మరిమూడు పద్యములను] ఉద్ధరించు యత్నమున క్రింది రీతిని సూచించిరి.

వరజన దారుణోగ్ర శరవాత-వ్రాఁతప్రతి. గొల్చియు (న ?)
విభుత్వముఁబొంది (పొందు ?)

పరజనదారుణోగ్ర శరపాత నియుక్త పదంబునందు, దారుణోక్తి, పారుషోక్తి, పరిపాత, నియుక్తి, వియుక్తి, యుక్తివశం, నియుక్తిఁదపంబు, పొరయును పోరనోర్చు, వారకోర్చి

1హర్యు2మనమారఁగొల్చ 3డరు 4దాతని గొల్చిన నాదిబోడ దాఁ
అరుదాతనిఁ గొల్చియు (న?) నాదిబోడదాఁ
బురభూతి విభుత్వముఁ బొంది పేర్మితో
శరపాతనియుక్తి వశంబునందుఁ దాఁ
(పరిపాత నియుక్తిఁ దపంబునందు దాఁ)
బొరిభూత గణేశ్వరుఁ బొందునాత్మలోన్.

ఆతనిఁ గొల్చియు నాది బోడఁ దా
భూతివిభుత్వము పొందు పేర్మితో
పాతవియుక్తిఁ దపంబునందుఁ దా
భూతగణేశ్వరుఁ బొందునాత్మలోన్.

ఆరఁగొల్చుడరు దాతనిఁ గొల్చియు (న)న్
భూరిభోగ పురభూతి విభుత్వమున్
పారుషోక్తి పరిపాత నియుక్తిన్
పోరనోర్చు పొరిభూత గణేశ్వరున్.

12-219. "సరసాహారము" సుమూలము

'సింహోమదద్విరదమాంసకమాంసభోజీ
సంవత్సరేణ కురుతే రతిమేకవారమ్
పారావతః ఖలు శిలాకణమాత్రభోజీ
కామీభవత్యనుదినం వద కోఽత్రహేతుః.'

పారావతాదులు పక్షులు గొన్ని
యారశిలాహార మైకాదె బ్రదుకు- పండితా. పర్వత ప్ర.

12-214. "ద్వాదశార్ధార్ధనయను-"

పాతువోగిరిజా మాతా యస్యద్వాదశలోచనః
తథైవ గిరిజామాతా ద్వాదశార్ధార్ధలోచనః
ద్వాదశార్ధార్ధనయనం యస్యద్వాదశలోచనః-

11.59. విరోధా- విరాగా (నేను)

కనికనార్తికోదరిద్ర (?)- కః కేనార్థికోదరిద్ర
మనసిచ పరితుష్టే కోఽర్థవాన్ కోదరిద్రః-

వైరాగ్యశతకం-53.

11-46 మనుజులు గొందఱాయడవి మాఁకుల కంటెను గష్టమర్థి (వేడిన ఫల మీయఁ జాలరరిడీకొని తాఁకిన నిల్వఁజాలరున్) ఇది నా పూర్తి.

11-47 (ఈననియతలఁ)చుఁ జాగియు
సీననియ తలంచులోభి యెప్పుడు ననికిం
జానవియ తలఁచు వీరుఁడుఁ
జాననియ తలంచు పంద సరియెట్లగునో

(సరివెట్లకునున్ వ్రా. ప్రతి)

[ వ్రాతప్రతిలోను, కవిగారి ప్రతిలోను మీది (11-46,47) బ్రాకెట్ల లోని భాగములు లేవు 'వేఁడిన ఫలమీయఁ జాలరరి డీకొని తాఁకిన నిల్వఁజాలరున్' అని నాపూర్తి- వే. ప్ర. అని మా వ్రాత ప్రతిలో (తంజావూరి ప్రతికి ప్రతిక) శాస్త్రిగారు వ్రాసికొని యున్నారు. ఇట్లే యూనివర్సిటీవారి కుమారసంభవము ప్రతిలోనూ బ్రాకెట్లలో గల పలుపూరణముల ప్రక్కన 'నేను' 'ఇది నా పూరణము' అని ప్రభాకరులు వ్రాసియున్నారు. కాని యూనివర్సిటీ వారి ప్రతిలో ఆయా విషయము లెక్కడను - గ్రంథమందుగాని, పీఠికలోగాని లఘువ్యాఖ్య యందుగాని పరిష్కర్తలు పేర్కొనలేదు. ఆకారణమున పలువురు అట్టి పూరణము లన్నిటిని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారే కావించినట్లు భావించి వ్రాయు చున్నారు. వాస్తవము లోక మెరుగుటకై అట్టి పూరణములను; శాస్త్రిగారు గుర్తించి పరిష్కరించిన పాఠముల విశేషములను; యూనివర్సిటీ వారి కు॥ సం॥ ముద్రణ విషయమున శాస్త్రిగారికి గల సంబంధమును గూర్చిన వృత్తాంతము లను ఇందు కొన్ని ఉద్ధరించి యున్నాము. పాఠకులు పరిశీలింపగలరు - సం॥]

# శ్రీ ప్రభాకరుల
# క్రిటికల్ నోట్స్

(విడి కాగితము) నన్నిచోడని విషయమున: 1915, 1916 సం॥ రిపోర్టులో నర్సారావుపేట తాలూకా కొప్పరమునందలి కోదండరామదేవాలయము సందున్న నాగస్తంభముమీఁద 327 సంఖ్య శిలా శాసనమున చోడబల్లి మల్లికార్జున యోగి;

363 సంఖ్య శాసనము :- నర్సారావుపేట తా॥ చెన్నుపల్లి అగ్రహారము.

నోట్ బుక్ - 17 (1924)

1226, పు. 424.

కులోత్తుంగ చోడదేవర దివ్య సంవత్సరంబు ౪౫ - శ్రీపరాంతకేశ్వర మహాదేవరకు నీయూరివలయ చుట్టు అలమూ, బసన్నసయు; నంతరాయముం గీడెఱయు, లోపై సర్వకర పరిహారము, ఇఱయివి దేవదానమై యిద్దేవరకు నా చంద్రార్కము ననుభవింపం గలవారుగా దయచేసిరి.

— నన్నిచోడడు; లోపైన

నోట్ బుక్ - 25

P 94. ని స్త్రైగుణ్యే పథి విచరతాం కోవిధిః కోనిషేధః

P 92. సింహోమదద్విరద మస్తక మాంస భోజీ
సంవత్సరేణ కురుతే రతి మేకవారమ్
పారావతఃఖలు శిలాకణమాత్ర భోజీ
కామీ భవత్యనుదినం వదకోత్రహేతుః

(చూ. కుమార సం.)

నోట్ బుక్ - 28

P ౪౨. కడిది బలులగు మగలొత్తి కౌగిలింప -"నన్నిచోడ
కడిఁది బలుండయిన హరికి। గలరే సదృశుల్-ఎఱ్ఱన హరివం 105పు.

P 85. అరగొనక, వరపురి, భీ। కరగతి - స్ఫురదురు. నన్నిచో. 11 ఆ॥
అఱలేని సఖుఁడ సూరార్యనా ముద్దు 1 మఱది - పాల్కురికి

P 95. వాడిన-కాడిన-పీడిన-మాడిన జీవితాశ - నన్నిచో. 10 ఆ॥

## నోట్ బుక్ - ౧ (13-11-37)

పు. 3.

**కరువునఁబోయుమాడ్కి నొడికంబుగ రాతమలంచుకై వడిన్**
**హరుబన గొన్న వేల్పుబడియచ్చున నొత్తిన లీలనొచ్చెముం**
**బొరయనిమేని మేలి యొరపుంజిగియున్విగియున్ సమగ్రమై**
**నెరయన రాహుతుండలరు నెక్కొని బ్రాయము బిక్కటిల్లగన్**

చంద్రా - 2 ఆ॥

పు. 7. నిర్వచనోత్తర రామా 7. ఆం॥ చివర యుద్ధ వర్ణనలో ముంగల' పింగల - నన్నిచోడని దానిలోను ఉన్నది.

పు. 40. 11 సం॥ 7 సంచిక ఉద్భటుని గూర్చి కల్లూరి సుబ్రహ్మణ్య దీక్షితులు గారి వ్యాసము శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు సంగ్రహించుకొనిరి వారి కుమార సంభవ విమర్శనమున - మఱిన్నీ సాంబమూర్తిశాస్త్రి గారి వ్యాసము కుమారసంభవమునుగూర్చి గొప్పది భారతిలో ప్రకటితము దానిని స్మరింపనే లేదు.

పండితా - లో హరలీల - స్మరణము. అష్టకము
సహస్రనామ స్తుతినడుమ నున్నది; అదిన్నీ 1000
శ్లోకముల దనుటకు ఉపకారకము.

పు. 36 కదిరి కావ్యము

**వడిపొలి గూడునే వండుక పోయి**
**కడుమతి లోనుగా కలియ చేనికిని**
**పోయి పొలిగాయని పొలి గూడు చల్లి**
**కోయని వడినార్చి కోత బెట్టెదను.** 49 పు.

— పొలిగూడు - నన్నిచోడడు.

* * *

[కుమార సంభవమును గూర్చిన ఫైలులో శ్రీ కోదండరామయ్యగారి దస్తూరీతోగల కాగితమునందలి విషయమిది. సం॥]

బడరుడు.

ఒడలు గుడి యంతరాత్మయ
బడరుండను పలుకులుడిగి భక్తివి గుడియే
గుడి యనియు లింగమూర్తియ
బడరుండని కొలువకునికి పాతకము శివా !

శివతత్వసారము ప. - 26

శ్రీరామకృష్ణ కవిగారీ పదమునకు దరిద్రుడు అని యర్థము వ్రాసినారు. అందు కేయాధారముఁ గనుపడదు. శివతత్వసారమునందలి యీ పద్యము నందును, కుమార సంభవమునందలి పద్యమందును 'శివుడు, దేవుడు' అను నర్థమున 'బడరుడు' శబ్దము సరిపోవుచున్నందున 10-11 శతాబ్దములందు ఈ యర్థమునందే యీ పదమువాడబడుచుండెనని తోచుచున్నది. శాసనములందును భటార పదమొకటి శివుఁడను నర్థమున గానవచ్చుచున్నది. అఱవమునందు 'పడారన్' అను పదము 'పాములవాడు' పాములను వశపఱచుకొనువాడు' నను నర్థమునందున్నది. అందుడియే యీ పదము పుట్టినదేమో !

ఎలబొఱ - లేఁజిగురుటాకు

ఈ పదము మొక్క నన్నిచోడని గ్రంథముననే కాననగును. బొఱ - చిగురుటాకు అనునర్థమునఁ దక్కిన కవు లేరును ప్రయోగింపలేదు. నన్నిచోడ డిట్టి దేసి తెలుగు పలుకులను రుచిగల వానిని బ్రయోగించి దేసి కవితా కలిత మగు గ్రంథమును రచించి యశఃకాయుడైనాడు.

గోమిని యనుపదమును గూడ నితడు ప్రయోగించినాడు. లక్ష్మియని యర్థము. ఈ పదము శాసన పద్యమంజరిలో గాననగును. అచటను నీ యర్థము ననే. దేసి తెలుఁగుమఱుగుల నెఱుగ గోరువారికి నన్నిచోడని గ్రంథమున త్రవ్వి తండములుగనవి లభింపగలవు

*

[శ్రీ ప్రభాకరుల దస్తూరీతోగల కాగితమునందలి విషయమిది]

నాసంస్కరణములు, నా దగ్గఱి వ్రాత ప్రతిలోని సాధు పాఠములు నిందున్నవి. నా సంస్కరణములు (టిక్) మార్కుతో నున్నవి.

మృగాంకునం దవిస్ఫురిత

7. సిత దంతముఖం బచిరాంశువు,
(దంతాగ్రము మెఱుపు. నోరు మూసినఁ దెఱచిన మాటు పడుచు వ్యక్తమగుచు నుండును. ఏకదంతుఁడు గాన దంత యుగము ఉఁడరాదు.

8. దయనొసగు (వ్రాఁతప్రతిలో అరసున్న ఈ పదమునకుఁ గానరాదు. దీనిలో అరసున్న ఉండరాదు. ఇతరకవి ప్రయోగాంతరములఁ బట్టి చూచినను.)

12. నర్థించి కొలుపు
పడయఁ గనెడి
ర్జునునిఁ గొలుపు

21. హర లీల

26. మది నొఱఁగు

34. తారకవి కృతుల

37. పరగు సువర్ణ

38. నోరు గొలఁదుల్

41. నదరున - తలయూపున్, బెఱ-
కానియట్టి దదియున్

50. చేకురునె,
పాలించెఁ గలి
నేలి చనిరి

54. బెరుగన్

56. నెగడు

58. దురంతావివేక
,, వేద తదంగశాస్త్ర
,, గుణాతీతుండై

68. దరిందారకుం బోర
,, గెల్వన్

70. నౌసగవలయు దేవి

78. నెసగగ

81. కాషాయ గంధములును

83. ఘనంబులు నా (ల) వ్రా. ప్ర.

100. వరాంగమును

,, కామాసక్తనాస క్తమై

101. సదానైక

110. పరమేశ్వరుండు (నిజపుత్త్రికునకు ?) నోలలాడుచుండెనంత

128. ఖరు, సంయుత
ద్విరదహయభట పరీవృతు

133. దక్షు మహోదారు

134. త్రిగుణ పథచరత్వాతీతు
(నిస్త్రైగుణ్యేపథివిచరతామ్)
నచలు.

# కుమారసంభవము

## అచ్చొత్తించిన పక్షమున సూచనలు

[శ్రీ గిడుగు సీతాపతిగారి మూలంగా, పిఠాపురం రాజాగారు కుమార సంభవాన్ని సరిగా పునర్ముద్రింపజేసే యత్నంలో ఉన్నారని తెలుసుకొని వారి కోరిక మీద (చూ. లేఖలు) 1949 నవంబరులో తదావశ్యకమును గుర్తించే అంశాలను; ముద్రణకు వలసిన సూచనలను శ్రీ ప్రభాకరులు వ్రాయించి పంపినారు. ఈ కాగితాలు శ్రీ నిడదవోలు సుందరేశ్వరరావుగారి దస్తూరీతో కలవు. 5-6-1950 నాడు శ్రీ నిడదవోలు వెంకటరావుగారు శ్రీ శాస్త్రిగారి కోరిక మేరకు త్రిప్పి పంపిన కాగితాల నుండి సేకరించిన అంశము లివి. సంపాదకులు]

1. ప్రతిపుటయందు అడుగున నోట్స్ ఉండవలెను.
2. సంజ్ఞ, ఆచ్ఛికపదములకు -
   పద్యములకు లిస్టులు అనుబంధములుగా చేర్పవలెను.
3. తాటాకులకు ఫొటోలు - ఇది చాల వ్యయసాధ్యమని తలిస్తే మానవచ్చును.
4. ఒక్క ప్రతితో సంప్రదించినట్టుగ వేయవలెను. గాని క, చ, యూ ప్రతులని వేయరాదు.
5. కుమార సంభవము కంప్లీట్ క్రిటిసిజమ్ వ్రాసి ప్రచురించవలెను.
6. యూనివర్సిటీప్రతి నా దగ్గఱనున్న తంజావూరు వ్రాతప్రతితో సంప్రదించి సందిగ్ధ స్థలములనున్న పాఠములను ఒకసారి ఆలోచించి వేయవలెను.
7. తంజావూరులో నున్న ముఖ్యమైన, సందిగ్ధ స్థలములలోని పట్టులను సరి చూచుటకు వలసిన వారి నెవరినైనా పంపవలెను.
8. 6 మాసములలో పూర్తిచేయవచ్చును. (అంటే - వేసవిలో వీలు)

9. శాస్త్రిగారి వద్ద నుండి కుమార సంభవ కావ్య ముద్రణము సమాప్తి అగువఱకు పనిచేయు మనిషికి తగిన ధనసహాయము చేయవలెను.

[శ్రీ ప్రభాకరశాస్త్రి శాస్త్రిపాదుల చరణ సన్నిధికి వేంకటరావు నమస్కారములు.

చి॥ సచ్చిదానందము మొన్నను వచ్చినప్పుడు తామడిగిన కాగితములను యిందుతో పంపుచున్నాను. తే. 3-6-50 ది నుండి ప్రాచ్యలిఖిత పుస్తక భండాగారముతో మా అబ్బాయి సంబంధము వదలిపోయినది. నా సంబంధ మంతకు మున్నె వదలినది గదా!

చిత్తగించవలెను.
వేంకటరావు
5/6/50]

## కు॥ సం॥ 28 వ ఫారము మొదలుకొని శాస్త్రిగారి పరిష్కరణము 160 పద్యముతో ఆరంభము

1-3. హరి వికచామలాంబుజ - అర్థము
1-94. నానార్థములు
1-101. సదానైక -
1-120. అబ్ధితటి
1-134. పథచరత్వాతీతు
2-15. వచ్చు విమానంబున
2-74. వరుణుండలుకుచు నోడిక -
తగ భయాతురుండై -
2-128. పద్యం. ఖరు సంయుత
ద్విరదహయభట పరీవృతు
3-72. నెత్తపలక, పీంపు
3-113. నిరమిత్ర - నిరవద్యజనవేద్యున్ -
శాంతగుణవంతున్-జనమాన్య మునిమాన్యున్
4-9. లోబడరు వలే

4-104. వెలుపొనరించు - గెందలిరు వెంచుననల్ - వాని -

4-104,105 -

107. చాతి - చావి

5-1 త్రిమూర్తుల సూచన

5-2 అమరంగ నింద్రయాశీ -

6-147. దీనిఁ జలత్వము - మాన్చి -
పదాంబురుహములంద

7-27. సాహలు. యెడము చూడు బ్రౌన్.

7-36. యేగుంగునకు తాడి -
గష్టమల్ వడి రాక -
సేసి కవసి రనిన
నిలిపితి నీవ

7-48. బొమయుఁగను

7-49. పిడుక లేఱఁడు

8-2. గూతుం దూతులు అని యుండవద్దా?

8-159. చెఱకీన వుచ్చ కఱిముఱి
గఱచిన రసమానరాని గతిఁదరుణులఁజే
వెఱవాపక సంగతి కే
త్తెఱ సేసి మనోరథములు దీఱునె పడయన్.

8-169. వాలిక .... చిత్తరతి —— చిత్రరతి

8-178. విరహకాలంబు (కవిగారిది) - విరహతాపంబు -

8-179. గళనాదమను ఘన గాయని సాహ్యోళ

12-218. చాలా చిక్కుల పద్యం. ఇందులో నాలుగు పద్యము లున్నవి.

12-166 పద్యం - పేర్మినాద్రైత్య తేజము - కవి పాఠము. పేర్మినాదిత్య తేజము -

12-121. పద్యం. కరులు గాచిన - దానికి టీక చూడవలసినది

8-183. కృతవాద్యంబుల్ - కృకవాకంబుల్
వల్లభుఁడని - వల్లభునని

8-187. రవి పధాహతి - చూ. తెలుగు మ్రెఱుగుల్లు

10-156. పద్యం కూడా
10-167. పద్యం-ఆమను-కొలబంటు (శాస్త్రిగారు)
10-181. పద్యం టీకలేదు. శాస్త్రిగారే తుది రెండు పాదములు చేర్చినారు.
10-172. పద్యం శాస్త్రిగారు దిద్దినది
10-200. పుట్టికి - కవిగారి ప్రతి
పుంటికి - శాస్త్రిగారు

11-5. ఆఖరి చరణము
వారువమందు - కవిగారిది
వారువ ముందు - శాస్త్రిగారిది

12-109. పద్యం. కవిగారి పాఠము, శాస్త్రిగారి పాఠము చూడవలసినది
11-6. పద్యం. కవిగారి ప్రతిలోలేదు. 4-వారి గ్యాలీలోలేదు. శాస్త్రిగారు సంస్కరించి చేర్చినది.
ఆ సంస్కరణము రా. కృ. పాడు చేసినారు.

11-14. ఈశ్వరు నంబుధిబోలి. చూ. కవిగారి ప్రతి.
అనేక పద్యములలో (బ్రాకెట్ల నడిమి) పూరణములు శాస్త్రిగారివి

11-37. పద్యం. కవిగారి ప్రతిలోఉన్నది యున్నటులే ఇచ్చిరి-కాని శాస్త్రిగారు 'పోరఁబాఁకుదల్చినీరు గొన్నటు'. టీకలో తప్పొప్పుల పట్టికలో దీని ప్రసక్తియే లేదు.
''శైవలం కిల విహాయ నిర్మలం కేవలం కిల జలంను పీయతే" - యోగవాసిష్టం.
బాఁకు=కత్తి అని కవిగారు యూని- ఎడిషన్ టీకలోనూ అదేఉన్నది.

11-42. పద్యం. టీక తప్పు - 'పతికెత్తికీల్ కలన' కవిగారి ప్రతితో సరి చూ.

11-44. పద్యం. అడుగడు గశ్వమేధ ఫలంబున
నలజనంపాడు శాసనము

11-46. పద్యం - చమత్కృతికి, అచ్చతెనుఁగు
గ్రహింపవలసినది - ముచ్చటైనది.

11-47,48,49 - పద్యములు - శాస్త్రిగారు
పూంచినవియే.

# ఒక (అసంపూర్ణ) బహిరంగ లేఖ

వేటూరి ప్రభాకరశాస్త్రి

నేను దిద్దింది అష్టమాశ్వాసము (160) పద్యంనుండి తుదిదాకా. దాని గ్యాలి ప్రూపులు నాకు పంపిరి.

ఒరిజినల్ పంపరు. అడిగినా పంపరు.

పరిశీలింపగా - అది కవిగారి ముద్రణమే కాని అందు ఒక అక్షరమైనా సంస్కరణము లేదు.

అంటే- నేను చూడసాగిన దానినండి తుదిదాకా అంతా నేనుదిద్దిడమే కాని లక్ష్మీపతిశాస్త్రిగారు గాని, రామకృష్ణయ్యగారు [గాని] వ్రేలుపెట్టి ఒక అక్షరమైనా దిద్దలే దన్నమాట.

చచ్చి చెడి నేను (నాతో చి॥ కోదండరామయ్య అపుడు విద్వాన్ విద్యార్థిగా ఉండి నాతో పరిశ్రమించినాడు.) దిద్దిపంపితే అట్లు పంపడమేకాని దానిని మరల నాకు సెకండు ప్రూఫు పంపడంలేదు - ఎన్నిసార్లు వ్రాసినా పంపడంలేదు.

నేను దిద్దిన దిద్దుబాట్లు అన్నీ పాటించిరో లేదో ఏమి చేసిరో తెలియదు. ఆదరా బాదరా నాకు ప్రూఫులు రాగానే నేను దిద్ది వెంటవెంటనే పంపడమే. ప్రస్సువారికి ఇబ్బంది అవుతుందనే భయంతో !

అసలు ఇట్టి గ్రంథములు అచ్చు కియ్యడానికిముందు సరిగా పరిశోధించి సంస్కరించి యియ్యవలసినవి- అచ్చుప్రూఫులో సంస్కరించడం ఎంత కష్టసాధ్యమో ప్రాజ్ఞు లెఱుగగలరు ! నిజము చెపుతున్నాను ! ఆనాళ్ళలో రాత్రులు నాకు నిద్ర ఉండేదిగాదు సాధుపాఠం స్ఫురించే దాకా !

నాకు బాల్యమిత్రులే అయినా శ్రీ రామకృష్ణయ్యగారు తుది కిట్లా చేయబోతారని బాహాటంగా నేనంటూనే ఉండేవాణ్ణి.

విద్యా కుతూహలంతో అంత అవస్థపడ్డాను. ఈ క్రింది పద్యం అర్థం కుదరక నేను పడ్డ బాధ ఈశ్వరో వేత్తివా న వా !

రాత్రి 2 గంటలవేళ గోచరించింది. ప్రొద్దున్నే కోదండరామయ్యను పిలిపించి సంస్కరణల తెలిపి నాకే నేను కనకాభిషేకం చేసుకొన్నాను. అంత సంతోషించినాను[1]

మీరు సంస్కరించి పెట్టవలసినది అని కోరిరి. అంతకుముందు జాబూ వ్రాసిరి. నేను వైస్ ఛాన్సలరు గారిచే జాబు వ్రాయింపుడంటిని. ఇందుకై రామకృష్ణయ్యగారు తిరుపతివచ్చి వైస్ ఛాన్సిలరుగారు – తామే నా ముఖమున మిమ్ము గోరుమనిరి. మీరు సంస్కరించి పెట్టవలసినది అని కోరిరి. అందాకా అచ్చుపడిన గ్రంథభాగము, 26 ఫారాలు శ్రీ-వారు నాచేతి కిచ్చిరి అందు నాకు గోచరించిన దోషములు కొన్ని మాత్రం చేర్చినాను. అంతలో ఆ కాగితాలు శ్రీవారు మరల తెమ్మనడం సంభవించవచ్చునని తోచి దిద్దుబాట్లు అందు చేర్చడం నిలిపినాను. అయినా చాలా చేర్చినాను. అచ్చు ముగియ వచ్చేసరికి శ్రీవారు నేననుకొన్నట్లే తొలి ఫారాలు పంపి వేయవలసినది(గా) సాదు మర్యాదతోనే తొందరింపసాగిరి. వా రావిషయమున వ్రాసిన జాబులు కూడా ప్రకటింపదగినవి. అయినా వారి కోరిక చొప్పున ఆ ఫారాలు పంపివేసినాను. అందలి సంస్కరణలన్నీ యిప్పుడు వారు తమ లఘుటీకలో చేర్చినారు. గాలి ప్రూఫులో నే నా సంస్కరణలన్నీ చేర్చినాను. ఆ ఫారాలు ముద్రణం అయిన తర్వాతనైనా శ్రీ-వారు నాకు పంపలేదు. పంపుతానని మాత్రం గ్రంథం ముగిసేదాక వ్రాసేవారు. అచ్చు ముగిసిం తర్వాత నాతో ఆ గ్రంథం ఊసే వారెత్తడం మానివేసినారు.

అచ్చుపూర్తి 1944(?) లో అయినది. 1949 లో అది బయల్వడ్డది. ఇప్పటిదాకా దానిని నేను చూచి యెఱుగను.

కుమార సంభవ ముద్రణమనే శిశువు జనింపవలెను. అది యూనివర్సిటీ ఉద్యోగి తంత్రమువల్ల కాలేదు. జనకు డింకొకడు కావలెను. యూనివర్సిటీ

1. ఇది 'రవి పదాహతి' అను పద్యమును గూర్చిన విషయము కానగును చూ. తెలుగు మెఱుగులు. (ఇందు. పు. 66)

ఆంధ్రశాఖ దానికి ప్రసవిత్రి. జనకుడు గుప్తముగా వ్యవహరించవలెను. ప్రసవిత్రి ముఖము చూడరాదు. తద్వినోదము తెలియగోరరాదు గర్భవృద్ధి వినోదము చూడరాదు. ప్రసవానంతరము నలుగురూ చూచేటప్పుడు చూడవలసిందే. పెండ్లాడిన మగడే కన్నట్లు వ్యక్తము గావలెను. ఈ తలపే సాగినది ఈ మాట అనడం కొంత దూర్తముగా ఉన్నా జరిగిన దింతే-[1]

8 ఆశ్వాస భాగపు పూర్వగ్రంథము గూర్చి ఏమి లఘు వ్యాఖ్య వ్రాసినా నాకు సంబంధము లేదు. గాని తర్వాతి గ్రంథమును నేను దిద్దితిని గాన నాతో కన్‌సల్టు చేయవద్దా లఘువ్యాఖ్య వ్రాయడంలో?-కొన్ని సందర్భాలలో గ్యాలిలో నేను దిద్దినపుడు వారట్లు దిద్దడమేమిటని జాబు ద్వారా అడగడం, నేను బదులు చెప్పడం జరిగింది. అయినా దానిని పాటింపక వారేదేదో ఆ స్థలాలలో వ్రాసినారు. ఆ ముచ్చట్లు కొన్ని చూపుతున్నాను...

♦ ♦ ♦

పీఠికలో శ్రీ వారు కొన్ని ప్రూఫులు నేను దిద్దినటులు వ్రాసినారు.

గ్యాలిప్రూపులే నేను దిద్ది (28 ఫారం నుండి తుది దాకా) నాను. (నీవు దిద్దిన తప్పులన్ని సరిగాచేరుస్తున్నాను అని వ్రాసిరి కూడా) గాని నేను దిద్దినవి గ్యాలిప్రూఫులే! పై ప్రూఫులు నాకు పంపనేలేదుగా! కాన కొన్ని ప్రూఫులే నేను దిద్దినాననుట అబద్ధము కాలేదు గదా! ఆ వ్రాత ఎంత చాతుర్య పూరితము!

[ అసంపూర్ణము ]

[మదరాసు యూనివర్సిటీ వారి కుమారసంభవ ముద్రణం 1948 ఆఖరుకి ముగిసినట్లున్నది. అది 49లో వెల్లడి అయినా శ్రీ ప్రభాకరశాస్త్రిగారికి అచ్చుప్రతిరాలేదు. 12-12-49 త్రిలిఙ్గ పత్రికలో రివ్యూఎడిటోరియల్ వచ్చింది. దానిని శాస్త్రిగారి దృష్టికి తెస్తూ మద్రాసునుండి కోదండరామయ్యగారు (17 తేది); సూరవరం నుండి వేలూరి శివరామ శాస్త్రిగారు (19 తేదీ) జాబులు వ్రాశారు.

అంతకు పూర్వము తెలుగు భాషాసమితి వారి ఉపసంఘ సమావేశము సందర్భమున శ్రీ గిడుగు సీతాపతిగారి మూలమున ఈ ముద్రణమును గూర్చిన

1. త్రిలిఙ్గ సంపాదకీయమునందలి 'మంత్రసాని' తనము, 'కుమార సంభవము' చూచిన వారీ రీతి నర్థము చేసికోగలరు. సం॥

ప్రస్తావన వచ్చినట్లున్నది. దరిమిలా 9-11-1949 న గిడుగు సీతాపతిగారి జాబులో పిఠాపురం రాజావారి చేత గ్రంథాన్ని పునర్ముద్రింప చేయించే సూచన కానవస్తున్నది. 18-11-49 నాటి జాబుతోపాటుగా గిడుగువారు పంపించిన యూని. కు॥ సం॥ రెండు ప్రతులు శాస్త్రిగారి చేతికందినవి.

ఆ సందర్భంలోనే సీతాపతిగారు ఈ విషయమై తిరుపతి వచ్చి ఒకటి రెండు రోజులు మా యింట బసచేసినారు.

అప్పుడు శాస్త్రిగారు తిరుపతిలో తాళ్ళపాకవారికి సంబంధించిన కార్య కలాపాలలోను, యోగసాధనకు ట్రీట్మెంటులకు సంబంధించిన విషయముల లోను తలమునకలైన ఒత్తిడిలో తీరిక లేకుండినారు. అట్టి తరిని వారి చేతికి వచ్చిన కుమారసంభవ యూని. అచ్చుప్రతి వారికెంతో మానసిక వ్యధను కూర్చినది. మా ఎరుకలో అంతగా వారిని క్షోభపెట్టిన ఘట్టమింకొకటి లేదు. అంతలో త్రివిఙ్గ సంపాదకీయము వచ్చినది అప్పుడు వ్రాయనారంభించినది ఈ బహిరంగ లేఖ మూడు నిలువు కాగితపు పేలికలపైన చిత్తుగా వ్రాసిన లేఖాంశమే ఇప్పు డిందు ప్రకటింపబడినది.

ఛీయనుకొని వారప్పటికి నిబ్బరించుకొన్నారు. ఇట్టి అనుభవాలు వారికి క్రొత్తకావు. అయినా సీతాపతిగారి ప్రేరణంతో కుమారసంభవ పునశ్శోధన కార్యా నికుపక్రమించినారు శాస్త్రిగారు. దానితోపాటు కుమారసంభవ వ్యాఖ్యారచనకు కూడా అప్పుడే శ్రీకారము చుట్టినారు.

శాస్త్రిగారు 1950 జనవరి - ఆగస్టు (నిర్యాణం) నడుమ సాగినదే ఆ వ్యాఖ్యా రచన. ప్రజ్ఞాప్రభాకర (ఆత్మకథ) రచన ఒకప్రక్క, ఇదొకప్రక్క, తిరుపతి మ్యూజియం వ్యవహార మింకొకప్రక్క, వారి కూపిరి సలుపనీయలేదు. కుమారసంభవ పునర్ముద్రణ వ్యవహారము కూడా తుదకెట్లు పరిణమించినదో ఇందు ప్రకటింపబడిన లేఖలు క్రమంగా చదివితే పాఠకులకు తెలియగలదు. అట్టి ఒడుదుడుకు లప్పుడే కాదు; అంతకుపూర్వము కాశీఖండం పునర్ముద్రింపదల చినప్పుడూ ఎదురైనవి. ఆవివరాలు మరోసారి. ప్రస్తుతము కుమారసంభవ ముద్ర ణకు సంబంధించిన మరికొన్ని లేఖలు విశేషాలు ఇక్కడ ప్రకటిస్తున్నాము. సం॥]

# కుమారసంభవము - సవరణలు

[శ్రీ ప్రభాకరులు డా॥ సీతాపతిగారి (మదరాసు)కి వ్రాసి పంపిన కాగితాలలోని అంశములకు వారి శిష్యులు శ్రీ కొత్త రామకోటయ్యగారు సంగ్రహముగా వ్రాసి యుంచుకొన్న నకలు ఇది - సంపాదకులు]

తిరుపతి - 19-11-1949

**కుమార సంభవము :**

కుమార సంభవములో సూచించిన సవరణలు శ్రీ నిడుదవోలు సుందరేశ్వరరావుగారి ద్వారా గిడుగు సీతాపతిగార్కి పంపించినవి.

| | | |
|---|---|---|
| 1. | ద్వాదశాశ్వాసము | 218. కందగర్భవృత్తము వగైరా |
| 2. | | 166. పెర్మినా దైత్యుతేజము |
| 3. | ఏకాదశాశ్వాసము | 6. వ పద్యము; 156 పద్యము చేర్చినవి. |
| 4. | | 42. పద్యము పతికెత్తి |
| 5. | | 44. అడుగడుగశ్వమేధ ఫలం (నలజనంపాకు) |
| 6. | | 46. చమత్కృతి - అచ్చతెలుగు |
| 7. | | 47, 48 - పూరణ |
| 8. | | 37. సవరణ - సంస్కృతం |
| 9. | | 14. అంబుధి |
| 10. | | 5. వారువ - ముందు |
| 11. | దశమాశ్వాసము | 200. పుంటికి |
| 12. | | 181. పూరణ - టీకాలోపం |
| 13. | | 172. పూరణము |
| 14. | | 167. ఆమను, కొలబంటు |
| 15. | | 156. పూరణము |
| 16. | అష్టమాశ్వాసము | 183. కృకవాకంబులు |
| 17. | | 187. రవి పదాహతి-తెలుగు మెరుగులు |

| | | |
|---|---|---|
| 18. | | 178. విరహకాలంబు |
| 19. | | 179. సాహ్యోళులు |
| 20. | | 160. నుంచి దిద్దినది |
| 21. | | 159. దిద్దుబాటు |
| 22. | | 169 అర్థ చమత్కృతి (చిత్రరతి-చిత్తరతి) |
| 23. | సప్తమాశ్వాసము | 2. కూతుందూతులు |
| 24. | | 27. అర్థము - లోపం |
| 25. | | 36. దశకుమార చరిత్రము |
| 26. | | 147. దీని జలత్వము మాన్చి |
| 27. | పంచమాశ్వాసము | 2. ఇంద్రియాళి |
| 28. | | 1. త్రిమూర్తుల సూచన |
| 29. | | 104. వెలుపొనరించు |
| 30. | | 104, 105. అనుప్రాస |
| 31. | | 107. చావి |
| 32. | | 9. లోబడరు బతే |
| 33. | తృతీయాశ్వాసము | 113. మిత్ర, వజ్య, శాంత, మాన్య |
| 34. | | 72. నెత్తపలక |
| 35. | ద్వితీయాశ్వాసము | 74. వరుణుడు - తగ |
| 36. | | 15. వచ్చు విమానంబన |
| 37. | | 74. - ఉరుతరా |
| 38. | | 80. పరిభవాశక్తలం జేసి |
| 39. | | 94. బంధుడని - యబంధుండయి |
| 40. | | 99. అగ్నిశిత |
| 41. | | 120. అబ్ధితటి |
| 42. | | 126. సంయుతు |
| 43. | ప్రథమాశ్వాసము | 134. పథ చరత్వా |
| 44. | | 30. అర్థము |
| 45. | | 94. పుష్కర నానార్థములు |
| 46. | | 101. నెన |

# లేఖలు

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారికి

మిత్రుడు గిడుగు వేంకట సీతాపతి అనేక నమస్కారములు చేసి చేయ గల విన్నపములు త॥ ఉభయ కుశలోపరి.

మిమ్ము కలిసిన మరునాడే పిఠాపురం మహారాజా వారిని కలుసుకోవడం జరిగినది. నన్నెచోడని కుమారసంభవం - యూనివర్సిటీ వారి ముద్రణము గూర్చి మీరుచెప్పిన విషయములు మహారాజావారికి తెలియజేశాను... శ్రీప్రభాకర శాస్త్రిగారు నిర్దుష్టమైన ప్రతి తయారుచేసి ఇస్తే నేను తప్పకుండా అచ్చు వేయి స్తాను. అందుకు కర్చు మొత్తం ఎంత అవుతుందో తెలియజేయవలె నని నాతో చెప్పారు. కొన్ని తప్పులు ఎటువంటివి యూనివర్సిటీవారి ప్రతిలో ఉన్నవో... చూడవలెనన్న కుతూహలం ఉన్నదని వారు అన్నారు. గనుక ఘోరమయిన తప్పులు పది పంద్రెండు మీరు తెలియజేస్తూ వ్రాసి పంపండి.

మదరాసు
9-11-1949

చిత్తగింపుడు
మిత్రుడు
**గి॥ వె॥ సీతాపతి**

* * *

మీరు మీ అబ్బాయి చేత వ్రాయించిన ఉత్తరమున్ను మీరు శ్రీ నిడుద వోలు వెంకటరావుగారి పేర వ్రాసిన కార్డులో నాకు సంబంధించిన భాగమున్ను చూచినాను-ఊపిరాడకుండా మీరు బహుళ కార్యకలాపాలలో నిమగ్నులయిఉన్నా రన్న విషయం తెలుసుకొన్నాను. అట్లుండడం మీకు క్రొత్తకాదు. అందులో వింతలేదు...ఏదో ఒక అరగంట అవకాశం సమకూర్చుకొని నన్నెచోడని కుమారసంభవం యూనివర్శిటీ వారి ప్రతిలో పది తప్పులు గట్టివి పిఠాపురం రాజుగారికి సులువుగా బోధపడి గ్రంథం మరల అచ్చువేయించడానికి ఉత్సాహం పుట్టించేవి ఎత్తి వ్రాసి పంపించండి...మొన్న నీ నడుమ నన్ను రాజావారడిగి నారు, ప్రభాకరశాస్త్రిగారి నుండి జాబు వచ్చినదా? అని రాలేదు. ఊళ్లోలేరని తెలిసినది, కొద్ది రోజులలో ఉత్తరం తప్పకుండా వస్తుం దన్నాను. గనుక మీరు కొద్దిగా శ్రమపడి వేగముగా వ్రాసి పంపించండి.

మదరాసు
18-11-1949

చిత్తగింపుడు
భవదీయుడు
**గి॥ వే॥ సీతాపతి**

క॥ తా॥

మీరు చెన్నపట్టణం ఈ నెలలో ఎప్పుడు వచ్చేదీ తెలియజేయండి. మీకు రెండు ప్రతులు యూనివర్సిటీవారు ముద్రించిన నన్నిచోడని కుమార సంభవం పంపుతున్నాను."

తిరుపతి
24-11-45

చిరంజీవ, సుఖీభవ,

ఉభయకుశలోపరి చి॥ సౌ॥ మీ కుటుంబినికి నిన్న మొన్న ట్రీట్మెంటు చేసినాను-నిన్న ఆమె సుఖముగా ఉన్నట్లు గోచరించినది. సుఖముండు గాక. తలనొప్పి వగైరాలు తగ్గియుండును. అవశ్యకమైన ఔషధాది సేవ జరుపునది. అన్నింట C. V. V. అనుగ్రహము వెలయగలదు. చి॥ రామకోటయ్య మొన్న వెళ్ళినాడు. పాపము వెంకటనరసయ్య చనిపోవుట చాలా అసందర్భము; మంచి అదనున జారిపోవుట. ఒక్కమాట వినగోరినాను. "అసద్బ్రహ్మేతిచే ద్వేద. అసన్నేవస భవతి," చి॥ రామకోటయ్య ప్రభృతులను నీవు రక్షించితివి మీరం దరు సుఖముగ వర్ధిల్లుదురుగాక !

చి॥ సౌ॥ మీ కుటుంబిని చాల సౌశీల్యవతి. వీలు చూచుకుని పదరోజుల పాటు నీవు వచ్చి నా దగ్గర వుండగోరినాను. శ్రీ అప్పారావుగారు సుఖము న్నారు గదా ? చి॥ సౌ॥ మా అమ్మాయి ఆరోగ్యము అంతససిగా లేదని చి॥ రామ చంద్రరావు వ్రాసినాడు. ఉత్తరము వ్రాస్తున్నాను. మనశ్శాంతి తక్కువ. పిఠాపురం రాజాగారు నన్నచోడ కుమార సంభవం మళ్ళీ అచ్చు వేయించేట్టు న్నారు. నా తోడ్పాటు కోరేటట్టున్నారు. మీ యందఱ క్షేమములు తెలుపకోరి నాను. అవకాశము లేక బెజవాడ వచ్చినపుడు గుంటూరు రాలేదు. కాషుయల్ లీవులేదు. 12వ తేదీకే తిరిగి వచ్చినాను. మాతృశ్రీ తెనాలిరాక విశేషములు తెలుపగోరినాను. డిసెంబరు సెలవలలో మద్రాసు వెళ్ళవలెనని యత్నము.

కార్డు నెం. 82,

గ్రహి॥
వేటూరి ప్రభాకరశాస్త్రి

చి॥ కొత్త వేంకటేశ్వరరావు
4, అడ్డరోడ్డు, బ్రాడీపేట, గుంటూరు

చిరంజీవ. ఉభయ కుశలోపరి

తిరుపతి
11-12-49

నీ జాబు వచ్చినది. సంతోషము. మీరందరూ సుఖముందురుగాక ! పనుల వత్తిడి తీవ్రముగా ఉన్నది. మద్రాసు, తంజావూరి పుస్తకాల ముద్రణ, ఆఫీసు పని, కుమారసంభవ వ్యాఖ్యాన రచన; ప్రభాకర రచన ఇన్నీ వడివడిగా సాగి స్తున్నాను. అందరమూ క్షేమం, చి॥ మీ ప్రేయసి, బిడ్డలు, మీ అక్క బావగార్ల వారి కుటుంబము అందరు, ఈశ్వరార్పితులయి, వర్ధిల్లుదురుగాక ! చి॥ రామ కోటయ్య జాబు వ్రాసినాడు. వెన్నవంటివాడు. చి॥ గోపాలకృష్ణయ్య గారిని, రవిని, గజపతిని, ఆశీర్వదించితిననుడు. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు సుఖ ముగా ఉన్నారు గదా !

జాబు-

కార్డు నెం. 83

ప్రగ॥ వే. ప్ర.

[మీది లేఖలు శ్రీ కొత్త వెంకటేశ్వరరావుగారి సౌజన్యమున లభించినవి- సం॥]

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

నమస్కారములు,

శ్రీ రాయప్పగారి కుమారుని వివాహ సందర్భంలో మొన్న 14వ తేదీకి కాళహస్తి వచ్చితిని. అచ్చట మూఁడు రోజులుంటిని. తిరుపతి వచ్చి ఒక పూటయినా ఉందామని ఎంతో ప్రయత్నించితినిగాని వారెవరూ నన్ను విడ నాడకపోవడాన రాఁజాలకపోతిని...

ఇక్కడికి వస్తూనే త్రిలింగ చూచితిని. దాని ఎడిటోరియల్ చూడగలందు లకు పంపుతున్నాను. శ్రీ సచ్చిదానందంగారు కాళహస్తిలో నాకెంతో ఉపచ రించిరి. వారికి నా కృతజ్ఞత. అందఱ క్షేమాదికమూ తెలుపగోరెదను.

సూరవరం
ఆత్కూరు పోస్ట్, కృష్ణాజిల్లా.
19-12-1949

సం॥ వేలూరి శివరామశాస్త్రి

# త్రిలిఙ్గ
## నన్నెచోడుని కుమార సంభవము
### మద్రాసు విశ్వవిద్యాలయమువారి ప్రతి
### సంపాదకీయము

...ఎప్పుడెప్పుడాయని ఎదురు చూచుచున్న మద్రాసు విశ్వవిద్యాలయము వారి "కుమార సంభవము" ఇటీవలనే సర్వాంగ సుందరముగ చక్కని కాగితములు బైండుతో ముందు వెనుక పీఠికానుబంధములతో (తప్పొప్పుల పట్టికతో సహా) ప్రథమ సందర్శనములోనే దర్శనీయముగ వెలువడినది. పది మాసముల కుమార సంభవమునకు మంత్రసాని ఒక్కరిత అయిన, పది ఏండ్లకు పైగా పట్టిన ఈ కుమార సంభవమునకు పరిష్కరణ మంత్రాంగము జరిపిన వారు ముగ్గురు. 1) కీ॥శే॥ శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిలుగారు, 2) శ్రీకోరాడ రామకృష్ణయ్యగారు, 3) శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారు... మిలిగిన సగమును పూర్తిచేయుటకు పూనుకొనినవారు శ్రీకోరాడ రామకృష్ణయ్యగారు. అదేమి చిత్రమోకాని వీరికి సగము పూర్తి చేయుటకు నిండుగ ఆరు సంవత్సరములు పట్టినది. పోనీ ఈ కార్యము వా రసహాయశూరులై నిర్వహించిరా అనిన అట్లు కాకుండగ శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారి సహాయమును కూడ అర్థించి ఈ గ్రంథమును లోకములో నవతరింప జేసిరి...

...మేము 'కుమార సంభవమును' ఇంతకుముందే సంపూర్ణముగ ముద్రించితిమి. దానిలో దోషములు లేవని మే మనము. మేము పండితులచే సంస్కరణలు చేయించి పరిష్కరించుటకు అవకాశమున్నంతవఱకు చేయించుచునే యున్నాము. వందలకొలది ప్రాచీన గ్రంథములను ముద్రించి, ముద్రించుచున్న మాకు గ్రంథ సంస్కరణమును గూర్చిన బాధ్యత కలదని గుర్తించియే గ్రంథ ప్రకటనలు గావించుచున్నాము. విశ్వవిద్యాలయమువారు మాత్రము ఈ బాధ్యతను గుర్తించి నట్లు కనరాదు.

...పరమ ప్రామాణికముగా నుండవలసిన ఈ విశ్వవిద్యాలయ ప్రతిలోని దోషములకు బాధ్యులు శ్రీ రామకృష్ణయ్యగారా ? లేక శ్రీ ప్రభాకరశాస్త్రి గారా?

మాకు గ్రంథ ప్రకటన గూర్చియేగాని వ్యక్తి పక్షమేమియులేదు. ఇంత యపూర్వగ్రంథము నింతయాలస్యమైనను ఇఁతదోష భూయిష్ఠముగా వెలువడుటకు మిక్కిలి చింతించుచున్నాము. ఇకముందు తమ యాంధ్రగ్రంథములను సమర్థులును, ప్రామాణికులు నగు పండితులచేత పరిష్కరింపచేసినచో మద్రాసు విశ్వవిద్యాలయమువారి కీర్తి ఆంధ్ర లోకమున చిరస్థాయిగా విలసిల్లునని తలచుచున్నాము.

సోమవారము
12-12-1949

* * *

**నమస్కారములు**

శ్రీ తిమ్మావఝుల కోదండరామయ్యగారి వినోద విమర్శము భారతిలో చదివితిని. నేను రెండు వారముల క్రితము కుమార సంభవమును గూర్చి (27-6-49) వ్రాసితిని. వారుగాని, మీరుగాని దాని జూచియుండరు. లోఁగడ ఆం వారపత్రికలో శ్రీ కోదండ...గారు మురజబంధము సవరించి చూపిరి. కాని అందును రెండఃపాదము- సం । హరభవరోగ దారణ సురాసుర వంద్య - అనునెడ ఈ 'వం'లోని సున్న కుదరదు. దీని నాపత్పక్షముగా వారు తలఁచియుందురనుకొంటిని. శ్రీ మా. రా. కవిగా రచటనె ఉనికి అని వింటిని. వారి మూఁడు ప్రతుల ముచ్చట మీరెవరును కన్గొనలేదా? వావిళ్లవారి ప్రాఁతప్రతియు కల్లయేనా? శ్రీపాద లక్ష్మి-గారి విమర్శము నేఁజూడలేదు. అవశ్యము చూడవలయును. కొనుటకు దొరకలేదు. మీకడ నున్నచో బుక్‌పోస్టుగా బంపగోరుదును. శ్రీ వెం. రీ. ఇ. జర్నల్లో కు. సంభవ-పండితా. బసవ. ల గురించి విమర్శలు పడినట్లు (రెండవ కార్డ్ చూ.)

ఈ నెల భారతిలో బండారు తమ్మయ్యగారి వ్యాసము వలన తెలిసెను. సదరు పాఁత జర్నల్స్ కొనుటకు దొరకునా?

గురుచరణుల పూజా సభలకు మీరు రాఁగలరని శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారి వలన వింటిని. అపుడు సమావేశము కాఁగలమని ఆశించుచుంటిని (బెజవాడలో). అందఱయు యోగక్షేమములు వినవలతును. మఱియు... కు. సం. లో చిట్టచివర మంగళ మహాశ్రీలో మొదటి పాదమున ఒక దళము లోపించెను. మా. రా. ప్రతిలోను. -డిటో-

చిత్తగింపవలెను.

సూరవరం
ఆత్కూరు టపా, కృష్ణా జిల్లా
14-7-49

వేలూరి శివరామశాస్త్రి

## వినోద విమర్శము

# దీపవర్తి

బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు 9-2-38 తేది ఆంధ్రవారపత్రికలో 'నన్నిచోడని దీపవర్తి' పద్యమురు గూర్చి వ్రాసిన విమర్శము చూచి నేను బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిని వీరెట్లు చెప్పుదురో అని యర్థమడిగితిని. నే నడుగునప్పటికి వారు శ్రీ లక్ష్మీపతిశాస్త్రిగారు వ్రాసిన విమర్శము నెఱుఁగరు. వారు చెప్పిన యర్థ మీ క్రింది విధమున-

క. గుఱుతెఱిఁగి వస్తుచయమున
కొఱఁగెడు నాదీపవర్తియుం బోలె నిజం
బెఱిఁగి కృతవస్తుసమితికి
వఱలఁగ మదినొఱఁగు విబుధవర్గముఁ దలఁతున్.

గుఱుతు+ఎఱిఁగి = తన ప్రకాశమున కింకను ప్రజ్వలనము కలిగించు యోగ్యత కలవగుటను గుర్తించి, వస్తుచయమునకు = (అట్టి యోగ్యతగల) కర్పూర, కార్పాస, తైలాది వస్తు సముదాయమునకు, ఒఱఁగెడు నా దీపవర్తి యుంబోలె = వ్రాలునట్టి దీపపువత్తి (జ్వాల) విధమున- దీపవర్తియనుచో నిక్కడ దీపజ్వాల యర్థము చెప్పుకోవలెను. ఒఱఁగునది జ్వాలగాని వత్తిగాదు గనుక- నిజమ్ము ఎఱిఁగి = (తనమతి కింకను వికాసము కలిగింపఁదగిన)యంత స్సత్త్వము కలవగుటను గుర్తించి, కృత (తి?) వస్తు సమితికి = కవికృతములగు (లేక కబ్బముల నందలి) వృత్తి, రీతి, గుణా, లంకార, కథాది కవితావస్తు సముదాయమునకు, వఱలఁగ = (తనయొక్క, ఆ వస్తుసమితియొక్క మేల్మి) ప్రవ్యక్త మగుటకు, మదిన్ = మనసుతో (తృతీయార్థమున సప్తమి) ఒఱఁగు = వ్రాలునట్టి, విబుధవర్గమున్ తలఁతున్-

అనఁగా-

దీపము తానేవో కొన్ని (చమురు, దూది, మొదలగునవి) వస్తువుల మూలమునఁ బ్రజ్వలిత మగుచున్నదిగాన, అట్టి యోగ్యతగల యితర వస్తువుల సన్నిధి

కలిగినపుడు వాని పైఁదికి ప్రాలి అందును దన ప్రజ్వలనమును గొలుపును. ఇత రుల కావస్తువుల యోగ్యత నెఱిఁగించును. (జ్ఞానము జ్యోతిస్స్వరూపమనుట సర్వవిదితము.)

దీపపు మొగ్గకుఁ గొంచెము దూరముగాఁ గర్పూరమునుగాని, ప్రత్తినిగాని, స్పిరిటు మొదలగు నూనెలనుగాని ఉంచుకొన్నచో, గప్పుమని దీపజ్వాల వాని పైకి ప్రాలును. ఇది యెల్లరు నెఱిఁగిన ప్రకృతి చిత్రము. ఇట్లే- లతలును, కొంత దూరముగానే ఉన్ననుగూడ, ప్రాఁకుఁగొయ్య మొదలగు స్థిరవస్తువుల మీఁదికి (ఈ తీగకు కన్నులు, తెలివితేటలు ఉన్నవాయేమి అని వింత చెందు నట్లు) సాగి ప్రాలును. ఇదియు నెల్లరు నెఱుఁగుదురు.

చమురు మొదలగువాని మూలమున వెలుఁగుచున్న దీపమువలె ఉత్తమ కవి రచనముల మూలమున వికాసము చెందుచున్న విబుధ హృదయము- అట్టి యంతస్సారముగల సత్కావిరచనములు గోచరించినపుడు తనకింకను వికాసము గూర్చుకొనను, ఇతరులకు వాని యోగ్యత నెఱిఁగింపను, వానిమీఁదికిఁ బాఱును. ఈ విధమున తన్నుంబోలు కవులకు నుపకారకులగుచున్నారు గాన విబుధులను నన్నిచోడకవి స్తుతించినాఁడు.

పయి పద్యమున నుపమానోపమేయ వాక్యభాగములందు రెండింటను, 'వస్తుసమితి' 'వస్తుచయము' అని 'వస్తు' పదావృత్తి యుండుట కూర్పు చక్కన.

మఱియు 'ఒఱఁగెడు నాదీపవర్తి' యని యుపమానభాగమునఁ గలదుగాన 'మదినొఱఁగు విబుధవర్గము' అని 'యొఱఁగు' పదమే యావృత్తమగుట సొంపు. కాని ఎప్పుడో నేను తంజాపురపుఁ దాళపత్ర ప్రతినిబట్టి కుమారసంభ వమున కొన్ని పద్యముల పాఠముల గూర్చుకొంటిని. అందీ పద్యమున 'మది నెరుంగు' అని పాఠమున్నది. నా పాఠము సరియయినది యగునోకాదో ఎప్పుడో చూచినది! కవిగారు కూడ 'మది నెఱుంగు' అనియే ముద్రించిరి. దిద్దివలసియే యుండునేని తాళపత్ర ప్రతిలోని 'ఎరుంగు'ను, 'ఎఱఁగు'నుగా దిద్దుటకంటె నీ పద్యమున 'ఒఱఁగు'నుగా దిద్దుట యుక్తతరము.

పయి విధమున గుణగ్రాహులగు విబుధులను స్తుతించుటకు విరుద్ధముగా దోషగ్రాహులగు కుకవులకు నీ కవియే 'పిప్పికరిగెడు నీఁగలపెల్లు'నుగాను, దర్వాతి కవులు 'పుంటిపై ప్రాలు నీఁగలను' గాను దెగడుటయ్యెను.

ఇట్లు ప్రభాకరశాస్త్రిగారర్థము చెప్పినపిదప లక్ష్మీపతిశాస్త్రిగారి వ్యాస విషయమును వారి కెఱిఁగించితిని - నా మాటలతో చెప్పిన విషయమును విని వారు, కర్ణాట పండితులు చెప్పిన సంప్రదాయార్థమునకుఁ జాల సంతోషించి, ఆ పత్రిక దెచ్చి పెట్టగోరిరి.

కొన్నాళ్ళకుఁ దర్వాత శ్రీ లక్ష్మీపతి శాస్త్రిగారి వ్యాసమును ప్రభాకర శాస్త్రిగారికిఁ జూపితిని :- దానిపై వారిట్లు చెప్పిరి - ఇంతకుముందు నేను జెప్పిన యర్థము సహృదయ హృదయంగమమగునేని—"దీపవర్తి వస్తుచయమున కొఱఁగుననఁగా చమురున్న వైపున కొఱఁగునా యని విచారించిననదియు సందర్భమునకు సరిపడలేదు"— అన్న లక్ష్మీపతిశాస్త్రిగారి వ్రాఁత సందర్భము లేని దగును. అయినను-ఈ పద్యమును గూర్చి కర్ణాట పండితులెఱిఁగించిన 'నిధి' నిజముగా నిధియే. అట్టినిధి నెఱిఁగించిన యాకన్నడ పండితులపేరును శ్రీశాస్త్రిలు గారు పేర్కొనియుండవలసినది ! మన కపరిచితమయిన యీనిధి శాస్త్ర సంప్రదాయమును గొంత యెఱిఁగించినందు కా కర్ణాట పండితులు వంద్యులు-కాని యిందుఁ గొంత కొఱఁత గలదు.

కన్నడ పండితులు తెలిపిన కన్నడ పద్యములలో రెండింటను 'నిధి' పదమే కలదు. నన్నిచోడని పద్యమున వస్తుచయము గలదు. వస్తుచయమన్న పదమునకు 'నిధి' యన్న యర్థము ప్రతీతము గాదు. సుసాధము గాదు. సంప్రదాయము కుదిరినను, పదార్థ సంగతి కూడఁ గుదురువలెనుగదా ! కన్నడముననే ఆ కర్ణాట పండితులు చూపినవికాక మఱిక్రొత్త ప్రయోగములను రెండింటిని నేను గూడ నిటీవల యాదృచ్ఛికముగాఁ జూచితిని. అవి యివి :-

క. మానినియ సురతరత్నని
ధానం చాతుర్యదీపవర్తియి నిందె
త్తానుం కోళ్పొయ్తెనలా
మానినియోళ్చక్రిసురత సుఖమం పడెదం

—జగన్నాథవిజయము

ఆశ్వాసాంతగద్యము. ఇదుమృదు పదబంధ బంధుర సరస్వతీ సౌభాగ్య వ్యంగ్యభంగీ నిధాన దీపవర్తి చతుర్భాషాకవిచక్రవర్తి...నేమినాథపురాణము మానినియొక్క సురత రత్న నిధానమును శ్రీకృష్ణుఁడు, చాతుర్యదీపవర్తి మూల

మున కొల్లగొట్టెను-అని తొలిదాని కర్థము. రెండవది సంస్కృత సమాసగతమే కనుక టీక వ్రాయఁబనిలేదు.

వారు చూపిన ప్రయోగములందు నిధి పదమున్నట్లే, ఈ రెండు ప్రయోగములందు 'నిధాన' పదమున్నది. నన్నిచోడుడు గూడ 'గుఱుతెఱిఁగి నిధానమ్మున కొలఁగెడు'-

అని కూర్చి యుండఁ దగును. అట్లు కూర్పక పోయెను. ఆతని మనసున 'నిధానదీపవర్తి' వివక్ష లేకపోవచ్చును. నిధిశాస్త్ర సంప్రదాయ పరిజ్ఞాన నిరపేక్షముగా నాతఁడు సర్వసాధారణముగా గుర్తింపఁబడుచున్న 'ప్రకృతివైచిత్ర్యము' (కర్పూరాదుల పైకి దీపపు మొగ్గ వ్రాలుట)ను వివక్షించి యుండవచ్చును.

ఇంక నీ విశేషములు తెలియదగినవి. నన్నిచోడుడు జంగమ మల్లికార్జునుని శిష్యుఁడు. మల్లికార్జునుఁడు శైవశాక్తాగమ రహస్యవేది. తదాగమ దీక్షాపరుఁడు. శ్రీపీఠార్చన సురాకుంభ స్థాపన మండలార్చన మాంసాశనాదులాయన యనుష్ఠానములందుఁ గలవు. ఈ యర్థమును గుమారసంభవమున నన్నిచోడుఁడు చక్కఁగా జెప్పినాఁడు. కుమారసంభవము నవమాశ్వాసము చూచునది.

"అంతఁగొందఱు...[9-127-130] వస్తు వనఁగా 'ఆసవమని' నన్నిచోడఁ డిక్కడ స్పష్టముగాఁ జెప్పినాఁడు. 'ఆసవము' ఆల్కహాల్ కాన దీపము దానిపైకి వ్రాలును.

శ్రీ పీఠ సన్నిధిని దీప జ్వాలలు వెలుఁగుచుండ జంగమ మల్లికార్జున గురు పాదుకార్చన సమయమున చషకములలో 'వస్తుచయమును' నించి నివేదనము చేసి యాస్వాదించునపుడు 'గుఱు తెఱిఁగి వస్తుచయమున కొలఁగెడునా దీపవర్తి ''తీరులు దృష్టములగుచుండవచ్చును.

ఇందింకయు నీ క్రింది విశేషములు గూడ నెఱుఁగఁదగినవి. నన్నిచోడఁడే తన గురువగు మల్లికార్జును నిట్లు కీర్తించినాఁడు!

క. శ్రీ పీఠంబున నిడుకొని
శ్రీ పాదుకలర్చలిచ్చి సేవించెదనేఁ
బాపహరిఁ జెప్పి పుణ్యం
బాపాదింపంగ మల్లికార్జున దేవున్.

(శ్రీ పీఠంబుననిడుతన శ్రీ పాదుకలందు వ్రాలి) అచ్చు ప్రతి పాఠము. నేను జూపిన పై పాఠము తంజాపురపుఁ బ్రతిలోనిది)

మ. అమలజ్ఞాన సుదీపవర్తి గొని వృద్ధాచారుఁడై వేదశా
స్త్రములందున్న సదర్థ మెల్లఁగొని విద్వచ్ఛ్రీప్రతిగావించు వా
ని మహాత్ముండనఁ బొల్చు పుణ్యనిధి వాణీముఖ్య సర్వజ్ఞ జం
గమలింగంబగు మల్లికార్జున సదా కళ్యాణుఁ గీర్తించెదన్.

పయి పద్యమునందు 'గుఱు తెఱిఁగి వస్తుచయమునఁ కొఱఁగెతు' పద్యార్థమునే నన్నిచోడ కవి చెప్పినాఁడు. ఈ పద్యము నందుఁ గూడ 'నిధిని' గాని నిధానము గాని నిక్షేపింపఁడయ్యెను.

కావున నీ పద్యము నిధి శాస్త్ర సంప్రదాయజ్ఞాన నిరపేక్షముగా నర్థము చెప్పవలసినదగును. ఈ పరిశీలన మిట్లు చాలఁగాఁ బెరిగినది. ఇఁకఁ జాలును.

శ్రీ లక్ష్మీపతిశాస్త్రిగారు రత్నశాస్త్రాదులందు వెదకగా 'దీపవర్తి యొఱఁగుటకు శాస్త్రప్రమాణములు దొరకలే'దనిరి!. ఇది రత్నశాస్త్రమున దొరకునది కాదు. నిధిశాస్త్రమునఁ జూడవలెను. నిధి శాస్త్రగ్రంథమున నీ విషయము గలదు

జ్యోతి ర్యత్ర ధనం తత్ర నిశ్చయం నిర్దిశేద్ధనమ్
జ్యోతిర్విన్యస్తతైలేన సహస్రాణామథాపివా
వర్తేః ప్రజ్వాల్యమానాయాః శిఖాతస్మిన్నధోముఖా
ప్రహతై ర్మహితైః కుర్యాచ్చూర్ణైరేతైస్సుపూజితైః

అర్కతూలమయీవర్తి ర్వామేయం తత్ర దృశ్యతే
లోహగంధక చూర్ణేన చూర్ణస్తై త్వర్కతూలకైః
వేష్టయిత్వాచ సూత్రేణ వర్తిం కుర్యాత్ తథాభవేత్

—నిధిప్రదీపే, తృతీయ పరిచ్ఛేదే.

నిధులను గనుఁగొనుటకు శాస్త్రము నిధిప్రదీప మనుపేరఁ గలదు అది తిరువనంతపుర మహారాజ గ్రంథమాలలో నాగరాక్షరములలో ముద్రితమయి యున్నది. అందు నిధులున్న పట్టులను అక్కడి స్థలసన్నివేశమును బట్టి, అక్కడ మొలచు చెట్ల తీరులనుబట్టి అక్కడ వసించు, పక్షుల జంతువుల తీరులనుబట్టి, దీపవర్తి జ్వాలను బట్టి... కనుఁగొను విధానములు చెప్పఁబడినవి. కనుగొన్న నిధులను త్రవ్వి తీయుటకు చేయవలసిన బలిపూజాది విధానములు చెప్పఁబడినవి. జిల్లేడుదూది వత్తితో కొన్ని వస్తువుల చూర్ణమును పొదిపి చమురు పోసి వత్తి వెలిగించి చూడఁగా నిధియున్నచోట, దీపజ్వాల యధోముఖముగా వెలుగునట :-

విశేషము తెలియఁగ గోరు వారా గ్రంథము జూడవచ్చును.

పయి వ్యాసమున గుర్తింపవలసిన సారాంశము లివి !

1. నన్నిచోడని దీపవర్తి పద్యమునకు సర్వసామాన్యముగా నెల్లరకు నెఱుక కందియున్న ప్రకృతి వైచిత్ర్యమును గొనియే సముచితము, హృదయంగమమునగు నర్థముఁ జెప్పవచ్చును.
2. నిధాన పరిజ్ఞాన సంప్రదాయ విషయకమయిన విశేషార్థము చాల దొడ్డదియే. కాని యది నన్నిచోడనికి వివక్షితము కాకపోవచ్చును.
3. ఏలనఁగా-ఆ యర్థము స్పష్టముగా చెప్పుటకుఁ దగ్గ పదార్థ సంగతి పయి తెల్గు పద్యమున లేదు.
4. నన్నిచోడకవిదే యగు పద్యాంతరమునను లేదు.
5. కన్నడ ప్రయోగములు నాల్గింటను 'నిధి, నిధాన' పదములున్నవి గాన వాని కా విశేష శాస్త్రసంప్రదాయార్థము సరిపడుచున్నది.
6. 'వస్తు' పదమునకు 'ఆసవ'మని నన్నిచోడుడు అర్థము చెప్పినాఁడు. అది సర్వసామాన్యముగా నెఱుక నున్న ప్రకృతి వైచిత్ర్య పరమయిన యర్థమున సరిపడుచున్నది.
7. నిధాన పరిజ్ఞాన పరమయిన యర్థమునకు కన్నడ గ్రంథ ప్రయోగ మాత్ర శరణ్యమే కాదు - నిధిశాస్త్ర ప్రమాణముగలదు - 'నిధి ప్రదీపిక' నుండి శ్లోకము లుదాహరింపఁబడినవి -

[లేఖలు]

మదరాసు
17-12-1949

......'త్రిలిఙ్గ'లో కుమారసంభవము యూనివర్సిటీ వారి ప్రతిని గుఱించి సంపాదకీయము వ్రాసిరి. తమరు చూచియుందు రనుకొందును. 'కుమారసంభవము'నకు మంత్రసానితనము చేసిన ముగ్గురిలో నందలి దోషముల కెవరు బాధ్యులు? అని వ్రాసిరి. శ్రీరామకృష్ణయ్య గారిని గూర్చి చాల వ్రాసిరి. కుమారసంభవము సప్తమాశ్వాసము 19వ పద్యము 'ఎట్టెట్టా! శివుఁగల్చెనంటి'-అను పద్యమునకు అర్థము అన్వయము కుదురలేదు. శ్రీవెంకటరావుగారి కడకేగి యుండినపుడు వారి

నడిగితిని. వారును సరిగాఁ జెప్పలేదు. అందుఁ గొన్ని సవరణలు ఆవసరము లను కొందును. ఆ పద్యము నొకసారి తాము చిత్తగించి యుచితములగు సవరణలతో నర్థము కుదిర్చి తెలుపవలయునని కోరుచున్నాఁడను. 'పుట్టం బుట్టులు' అనియా 'పుట్టుంబుట్టులు' అనియా పదము? అర్థమేమి? 'ముట్టుం బోలినవాఁ'డనఁగా నేమి? 'శివుఁగల్చెనంటివిఁక' అని యుండవలయునా? 'మగలాడువారికి, మరిగి' అను పద్యములో 'ఏనుంగునకు బాడి' యనఁగానేమి? దయయుంచి వీనికిఁ బరిష్కార ములు తెలుపవలయును......

విధేయుడు

**తి. కోదండరామయ్య**

మదరాసు
26-3-1950

శ్రీగురుదేవుల దివ్య శ్రీచరణ సన్నిధికి సాష్టాంగ నమస్కారములు- ఉభయకుశలోపరి. తమ దివ్యానుగ్రహమువలన నిచ్చట మేమందఱము కులా సాగా నున్నాము...ఈ మధ్య నిచట జరిగిన విషయము లనేకములు మీకు వ్రాయవలసి యుండుటచేఁ దీరికగా విశదముగా వ్రాయుదును గాక యని తమ యుత్తరమునకు వెంటనే ప్రత్యుత్తరము వ్రాయలేదు. కనుక క్షమింపుఁడు.

ఈ మధ్య శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు మదరాసునకు వచ్చియుండి మొన్నటి దినమే స్వగ్రామము పోయిరి. వారు 14-3-1950 నాడు శ్రీ వావిళ్ళ వారి యింటికి వచ్చియుండి నన్నుఁ జూడవలయునని పిలువనంపిరి. నేను వారి దర్శనార్థమై శ్రీవావిళ్ళవారి యింటికిఁ బోయి యుండినపుడు వారి సమక్షములో నాకు, శ్రీ వావిళ్ళ వారికి కొంత తీవ్రముగానే మాటలు సాగినవి. కుమార సంభ వము వ్రాఁత ప్రతుల విషయములో శ్రీ లక్ష్మీపతిశాస్త్రిగారు పరిష్కరించిరను విషయములో వారుచేసిన మోసమును శ్రీ శివరామశాస్త్రిగారికి వారిచేతనే ఋజువు చేయించితిని. పిదప శ్రీశివరామశాస్త్రిగారు ఇదువరకు సమాధానముకుదిర్చి వావిళ్ళనిఘంటు ముద్రణమున, నింకనితర గ్రంథముల ముద్రణమున శ్రీ వావిళ్ళ వారికి సహాయము చేయునట్లుగా నేర్పాటు చేసిరి. అప్పటినుండి ప్రతిదినము శ్రీ వావిళ్ళవారి యింటికిపోయి వచ్చుచున్నాఁడను ... గారికిని నేనక్కడనుండుట కన్నెఱ్ఱగా నున్నట్లున్నది. దష్ట చతుష్టయము చేరినట్లుగాఁ జేరి యితరుల ప్రయ

త్నముల నెల్ల బడగొట్టి తాము గ్రంథముల బ్రకటించుటకు వారు చేయుచున్న దారుణ కార్యములు సాక్షాత్తుగా చూడవలసియున్నది.

క్షేత్రయ పదముల నచ్చువేయుటకై శ్రీ విస్సా అప్పారావుగారు కృష్ణా కలెక్టరు శ్రీ చంద్రశేఖరను గారికి తమకు గవర్నమెంటు చేత సహాయము చేయించవలసినదని వ్రాయఁగా వారా యుత్తరమును శ్రీవావిళ్ళవారి కడకుఁ బంపిరి సలహాకై. వీరు సహాయము చేయవలదని చెప్పినటులున్నది. శ్రీ పిఠాపురము రాజా గారు వీరికడనున్న క్షేత్రయపదములకై శ్రీ సీతాపతిగారు చెప్పగా శ్రీ వెంకటరావుగారిచే నడిగించగా వీరు తమ కడనున్న యధికపదముల నీయఁజాలమనిరట. ఘాపులూరి గణితమును త్వరలో ముద్రింతురట! తిరుపతిలో నది ముద్రితమగుచున్నదని నేననఁగా నంతకుమునుపే యిది ముద్రింపవలయునని తమ సంకల్పమయినట్లు వారు తెలిపిరి. శ్రీ వావిళ్ళ వారికి నామీద మాత్రము కొంత సదభిప్రాయమేర్పడినట్లుండినది. కాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు ఊరికిఁ బోవుచు నన్ను దమ వెంటఁ గొనిపోయి 'వారు చూపుచున్న యాదరము నిజమయినదని నేను తొలి రెండు దినములు భావించితిని గాని యది యథార్థము గాదని యావల తెలిసికొంటిని. తిరుపతిలో జరుగు విషయములఁ దెలిసికొనుటకై నిన్నుపయోగించుకొనుటకయి యీ నటన చేయుచున్నారని నా కర్థమయినది. కనుక నీవు అతి జాగ్రత్తగా నుండి నీకు నచ్చకపోయిన యెడల మెలకువగా నాయనతో విరోధము లేకుండ పైదొలగవలసినది. ఇచ్చటి మాటలు, వారి ప్రయత్నములు, పండిత దూషణములు శ్రుతికఠోరముగా నున్నవి. నా ప్రాచీనఖగోళమును ముద్రించుకొనుటకై కక్కుర్తిపడి స్వల్ప లబ్ధికై యీ యూబిలో చిక్కుకొంటిని. ఇది ముగిసిన పిదప నేనును పైదొలగ దలచుచున్నాఁడ' నని పలికి నన్ను అతి మెలకువగా నుండుమని చెప్పిరి. మఱియు మిమ్ములను ఉద్యోగమునుండి తొలగించవలసినదిగా కమీషనరు గారికి శ్రీవావిళ్ళవారు ఉత్తరము వ్రాసిరట! అట్టి యుత్తర మేలైన వారు వ్రాసిరో తెలిసికొని, వ్రాసి యుండిన నాయుత్తరము నెందుకైన మంచిది వారి నడిగి దాని సంగ్రహించుకొన వలసినదిగా తమ మాటలుగా మీ కుత్తరము వ్రాయమని చెప్పి వారు స్వగ్రామము వెళ్ళిరి. శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారిపై నేను వ్రాసిన వ్యాసమును చూచి తిరిగి పంపెదను దాని బ్రకటింపుమని చెప్పి దానిఁ దమవెంటఁ దీసికొనిపోయిరి...

ఈ యూబినుండి వెలువడి తమ యొడిలోఁ దలదాచుకొని శాంతిపొందవలయునని నా హృదయము వేగిరపడుచున్నది. సెలవు లొసగినదే తమ సన్ని

ధికి రాఁదలఁచుచున్నాఁడను. ఈ విషయము లన్నియు తమకుఁ గలఁత గలిగించు నేమో యని జంకుచున్నాఁడను...

ఇవి యెల్లఁ దమకు విశదముగా వ్రాసి మనసులోని బరువును తగ్గించు కొంటిని. 'అన్నమాచార్యోత్సవ క్రమము'ను ఒక ప్రతిని నాకుఁ బంపవలయునని ప్రార్థించుచున్నాఁడను. శ్రీ అమ్మగారికి, మిత్రులకు నమస్కారములు చిత్త గింపుఁడు.

విధేయుఁడు

**తిమ్మావఝ్ఝల కోదండ రామయ్య**

## బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి

సన్నిధికి నమస్కారము

అయ్యా !

నేను మంచము పట్టి యిప్పటికి 9 సంవత్సరములు గడచినవి కాని తమ దర్శనము యెన్నడును లభించినది కాదు. భారత గవర్నరు జనరల్ శ్రీ రాజ గోపాలాచారిగారు పదవిని వదలి చెన్నపట్టణము రాగానే నేను కోరకనే వచ్చి నన్ను చూచి వెళ్ళిరి. నేను పత్రికలలోను సభలలోను వీరిని తీవ్రముగ విమర్శించి యున్నానుగాని పూర్వపరిచితుడను కావున నా విమర్శన మరచి మైత్రితో కొన్ని గంటలు నాతో సంభాషించిరి తమకు నేను ఏ అపకారము చేయలేదు అవసరము జనించినప్పుడు నిజమును వెల్లడించుటకై నా పత్రికలో మీ వర్తనను విమర్శించి తిని. ఎవరితోను కలత పెట్టుకొనవలె ననెడి యుద్దేశ్యము నాకు లేదు. ఇకనైనా గతమును మరచి మనశ్శాంతి కొంత సానుభూతి కనపరతురని తలంచుచున్నాను. నన్నెచోడుని కుమార సంభవమును శ్రీ పిఠాపురము వారికి పరిష్కరించి ఇత్తు రని నాకు తెలిసినది. ఈ గ్రంథమునకు ప్రచారము అవసరము గావున దీని పరిష్కరించి నా కిప్పించగోరినాను. ఇందుకు సమ్మతమై జాబు వ్రాసినచో మరల నేను జాబు వ్రాసెదను.

ఇంతే నమస్కారములు.

చిత్తగించవలెను

వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి

[శ్రీ ప్రభాకరుల లేఖ]

ముక్త్యాల
26-4-50

ఆర్యా ! మిత్రమా !
వందనములు.

మీజాబు చేరినది. మీ యారోగ్యము చక్కబడుగాక. పెక్కేండ్లనుండి మీ రనారోగ్యగ్రస్తులుగా నుండుటకు వగచుచున్నాను. ఆర్తులే నాకాప్తులు. వారి క్షేమమునకై యదను కుదిరెనా క్షణమైనను జాగుచేయక వెళ్ళి యాదుకోగలను. ఆర్తులైన యనేకుల యెడ నట్టి యదను నే యర్థించి ప్రతీక్షించుచున్నాను. నాల్గు రోజులలో నేనిక్కడ నుండి తిరుపతికి వెళ్ళగలను. సాహిత్యాది వ్యవహారములకు సుదూరమయిన కార్యకలాపముతో నిక్కడనున్నాను. కుమారసంభవ విషయ మున శ్రీ పిఠాపురము రాజా వారికిని నాకును మిత్రముఖమున కొంత వ్యవహారము సాగినది. వారిని సాక్షాత్తు నేనెరుగను. మీ జాబువల్ల నది మీరునూ ఎఱిగినట్లు తెలియనయ్యెను. నేనై మాట తప్పజాలను. మీరుమీరు యోచించి పర్యవసానమును తెలపండి. మీ జాబును తిరుపతికి వ్రాయండి. ఆ కార్యము కొనసాగింపు యోగ్యత నాకు కలదని మీరు విశ్వసించుచుంటిరా ?

నిజముగా మీ నెయ్యుడు
వే. ప్రభాకరశాస్త్రి

[ఇది మాకు 5-5-50 నాటి జాబుతోపాటు అందినది-సం॥]

మద్రాసు
5-5-1950

అయ్యా !

తమ కార్డులు రెండును అందినవి. రాజశ్రీ ప్రభాకరశాస్త్రిగారి జాబును ఇందుతో పంపుచున్నాను. త్రిలిజ్గ రెండు ప్రతికలు పోస్టులో పంపినాను. గతము మరచి పూర్వపుమైత్రితో తమ గురువుగారు వర్తించునెడల నేను అన్నిటిని మరచి ప్రీతితోను, గౌరవముతోను వర్తింతుననుటకు సందేహములేదు. శ్రీగిడుగు సీతాపతిగారు శ్రీ వెంకటరావుగారిచే శ్రీ శాస్త్రిగారికొక జాబు వ్రాయించిరి. ఈ జాబువలన శ్రీ పిఠాపురము రాజాగారు నన్నెచోడుని కుమార సంభవము ముద్ర ణను విరమించినట్లు తెలియగలదు. తెనుగు వాచకములలో ఏమైన తాము సూచించు మార్పులను చేయించెదను. శ్రీ కృష్ణమాచారిగారు విజయనగరము

వెళ్ళిరి. పై సోమవారము వత్తురు. ఇచ్చట అందరు క్షేమము. తమ క్షేమసమాచారము వ్రాయండి.

ఇట్లు
**వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి**

మద్రాసు
19-6-1950

శ్రీగురుదేవుల దివ్యశ్రీ చరణ సన్నిధికి సాష్టాంగ నమస్కారములు. ఉభయకుశలోపరి. తమ దివ్యానుగ్రహమువలన నిచ్చట నందఱము కులాసాగా నున్నాము. నేఁడు కళాశాలలో నూతనోద్యోగమునఁ బ్రవేశించితిని. ఈ శుభ సమయములోఁ దమ దివ్యాశీర్వాదము నర్థించుచున్నాఁడను. నేను తిరుపతి నుండి వచ్చునపుడు తాము సెల విచ్చిన విషయములను శ్రీవావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి గారితోఁ జెప్పితిని. వారు ఆ విషయముల గూర్చి తమకుఁ బ్రత్యుత్తరము వ్రాసిరి. అది తమకుఁ జేరియుండు ననుకొందును. తమరు మదరాసు వచ్చినపుడు వారే తమ బసకు వచ్చి మిమ్ము సందర్శింతుమని చెప్పిరి. తమ యాశీర్వాదము నర్థించు

తమ శిష్యుఁడు
**తి. కోదండ రామయ్య**

తా. క.

కుమార సంభవములో తామొనర్చిన సవరణల పట్టికను గూర్చి శ్రీ వెంకటరావుగారి నడుగఁగాఁ దమకుఁ బంపినది మాత్రమే వారికి దామిచ్చినట్లును మరేదియుఁ దమకడ లేనట్లును వారు చెప్పిరి.

విధేయుడు
**తి. కోదండ రామయ్య**

[వావిళ్ళవారి ఆఫీసునుండియే వారి కార్డుమీదనే వ్రాసిన లేఖ యిది-సం॥]

19-6-1950

**బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సన్నిధికి,**

అయ్యా !

నమస్కారములు. శ్రీ కోదండరామయ్య గారి ద్వారా తాము చెప్పి పంపిన అంశములను విని ఖిన్నుడనైతిని. గతమును మరవవలెనని తమకు వ్రాసి

యుంటిని. ఈ ప్రార్థనకు విరుద్ధముగ మరల పూర్వాంశములను చర్చింపవలసి వచ్చినందుకు చింతిల్లుచున్నాను.

(1) చారు చర్య :-దీని తాలూకు వ్రాతప్రతి నా వద్ద చాలా కాలముగా నుండినందున దీని ముద్రించితిని. ఈ వరకే దీని తాము ముద్రించితి రను సంగతి నాకుగాని, శ్రీ చంద్రమౌళీశ్వరశాస్త్రి గారికి గాని తెలియదు. శ్రీ వెంకట రావు గారి ప్రోత్సాహమున దీని ముద్రించితినని తాము శెలవిచ్చితిరట. ఇది పొరపాటు. వీరి తండ్రిగారిని నేను చాలా కాలము నెరిగి యుండుటయు విద్యార్థి దశలో వీరికి నేను సహాయము చేయుటవల్ల వీరు పరీక్ష ప్యాసైనది మొదలు అప్పుడప్పుడు నన్ను కలిసికొనుట కలదు గాని మన యుభయుల మధ్య యేర్ప డిన కలతలకు వీరు కారకులు కారు.

(2) నన్నెచోడుని కుమార సంభవమును గూర్చి మా పోస్టు కార్డులమీద నా యెదుట శ్రీ వెంకటరావుగారు వ్రాసిన జాబును ముక్కలకు శ్రీ చంద్రమౌళీ శ్వరశాస్త్రిగారు పంపియున్నారు. ఇది మీకందకపోవుట నా తప్పుకాదు. శ్రీ పిఠా పురము వారిని సందర్శించి నేను ముద్రించిన కుమార సంభవమును వారేల ముద్రింపవలెనని ప్రశ్నించితిని. అందు మీద శ్రీ సీతాపతిగారికి కబురంపి దీని ముద్రణ ప్రయత్నమును మానుమనియు, తమ కుత్తరము వ్రాయుమనియు చెప్పిరి. శ్రీ సీతాపతిగారు, శ్రీవేంకటరావు గారిని వ్రాయమని కోరినందున వారు పై జాబును వ్రాసిరి.

(3) ఒకమారు తాము నా యింటికి దయచేసిన సరే! లేని యెడల చెన్న పట్టణము వచ్చినపుడు శ్రీ కోదండరామయ్యగారి ద్వారా తమ రాకను తెలియ జేసినచో తమ బసకు నేనే వచ్చెదను.

(4) నిన్న శ్రీ కోదండరామయ్యగారు నన్ను కలిసికొన్నప్పుడు చిర కాలముగ నా యొద్దనున్న వైద్య చింతామణి పద్య కావ్యమును వారికి చూపితిని. దీనికి శ్రీ గోపాలాచార్యులగారి వద్ద పండితులుగ నుండిన శ్రీ నుదురుపాటి విశ్వ నాథశాస్త్రిగారిచే చాలాకాలము క్రిందట లఘుటీక కూడా వ్రాయించితిని. ధన్వం తరి పత్రికలో ఈ గ్రంథము అచ్చగుచున్నదని శ్రీ చంద్రమౌళీశ్వర శాస్త్రిగారు వారము పది దినముల క్రిందట నాతో చెప్పిరి. దీని ముద్రించినచో అన్యథా తలచరాదు ఇంతే నమస్కారములు.

తిరువత్తియూర్ హై రోడ్, ఇట్లు

తండియార్ పేట్ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి

[కు॥ సం॥ ముద్రణము - కోరాడవారి లేఖలు] మద్రాసు
26-1-1944

బ్రహ్మశ్రీ వేదమూర్తులైన వేటూరి ప్రభాకరశాస్త్రులు వారికి, రామ కృష్ణయ్య అనేక నమస్కారములు.

ఆర్యా, నేనీ నడుమ ఓరియంటల్ కాన్ఫరెన్సు సందర్భమున కాశీకి వెళ్ళి యుండుటచేతను, అచ్చటినుండి అలహాబాదు, గయ వెళ్ళి, దారిలో అమలాపురంలో కొన్ని దినము లుండివచ్చుట చేతను, సుమారు ఒక నెల నేనీ యూర లేకుండుట తటస్థించినది. నేను మొన్న నే యిచ్చటికి వచ్చి ఆఫీసులో చేరినాను.

ఇదివరలో తమయొద్దకు పంపిన కుమార సంభవము తాలూకు ప్రూఫులు పంపగలందులకు ప్రార్థన. ఊరలేకుండుటచే చాలకాలము అయినది. మీరింతలో చూచియుండుటకును అవకాశమేర్పడి యుండును. ప్రెస్సువారు కబురంపినారు. చూచినంతవరకు వెంటనే పంపగలందులకు ప్రార్థన.

చిత్తగింపుడు
**కో. రామకృష్ణయ్య**

ఈసారి దయచేసి పోస్టు బుక్‌పోస్టుగా పంపుడు. ఆయిన ఖర్చు పంపెదను. ఈలోగా కవర్లు సర్వీసు స్టాంపులు తమకు చేర్చ ప్రయత్నము చేసెదను.

మరల వ్రాసెదను. క్షమింపుడు. కో. రా.

**బ్రహ్మశ్రీ శాస్త్రులుగారికి,**

ఆర్యా ! నమస్కారములు

మీరు పంపిన ప్రూఫులందినవి. మూడు నాలుగుచోట్ల సందేహము లుండుటచే మరల శ్రమ ఇచ్చుచున్నాను. దయచేసి చూచి వ్రాయగలందులకు ప్రార్థన. 9వ ఆశ్వాసం తాలూకు వెనుకటివారు వ్రాసిన వ్రాత కాపీ దొరకలేదు. ప్రెస్సులోను లేదు. కావున ఆయన పాఠములనుగూర్చి మనము బాధ పడనక్కరలేదు. మూలప్రతి పాఠములను (మార్పులేమైనా ఉంటె) క్రింద ఇచ్చిన చాలును. ఇక ముందంతా అట్లే చేయవచ్చునేమో అని అనుకుంటాను. తమరు అచ్చు పుస్తకములో 9 ఆశ్వాసము ఒకమారు చూచి మార్పులు మార్కు చేసి ఉంచితే వెంటనే ప్రూఫులలో సరిచేయవచ్చును. అవకాశమైతే మీరు మార్కుచేసిన పుస్తకము నాకు పంపితే మరల భద్రముగా మీకు అందజేయుదును. పని సుళువగును.

మీ ఆరోగ్యము సరిగా నున్నదని తలంచుచున్నాను. కాశీనుండి వచ్చిన పిదప కొంత చికాకుగానే ఉన్నది. ఇప్పుడు నయము. విశేషములన్ని వ్రాయ గోరెద.

చిత్తగింపుడు

**కో. రామకృష్ణయ్య**

**VIII** ఆ॥ చివరి భాగము.

177. ఒకటన్యాయము లేదె యెవ్వరికి - అని దిద్దుబాటు ఇక్కడ వ్రాత పుస్తకములో - 'నొక యన్యాయము లేదె యెవ్వరికి' - అని పాఠ మున్నది. ఈ పాఠము అర్థమునకు సరిపడియున్నదా? ఎట్లుంచ మనెదరు? మీ ప్రతిలో పాఠమేమి?

178. 'విరహకాలంబు మరుబాణ' అనియే ఇక్కడి వ్రాత ప్రతిలో నున్నది. తాపంబు అని మీ ప్రతి వ్రాసినవారు వ్రాసినట్లు తెలుపు చున్నారు. అర్థమెట్లు? అర్థమునకు సరిపడిన పాఠమేదో నిర్ణయించి వ్రాయప్రార్థన.

179. అలకలన్ తరుణులు అనే పద్యములో 'గళనాదమునంగరుప గాయన సింహాలు లనంగ్రమ్మ నూప్పరాలం' అని ఇక్కడి వ్రాత ప్రతి పాఠము. మీరు వ్రాసినది - (గళనాదమను) ఘనగాయని సాహ్యాళు లన - దీని కర్థము తెలియలేదు.

182. 'అరుణకరోత్కరాభిహతి నన్కయ్యెడు' అని మధ్య అక్షరములు పోయినట్లు సూచింపబడినది ఇచ్చటి ప్రతిలో. కరాభిహతి-నన్కను కయ్యెడు' అనియే ఉంచెదము - అర్థము?

199. ఆశ్వాసాంతము ఆఖరు పద్యము

ప్రారబ్ధపుణ్యు మితభాషు గుణాభిలాషున్ అని ఉన్నది. ణ్యుని ణ్యగా దిద్దినారు. ఏల? విశేషమేమైన గలదా అని!

[ తేదిలేదు. ఈ లేఖ ఇంతే కలదు. చూ. బ్లాకు - సం॥ ]

[ శ్రీ ప్రభాకరుల సమాధానము. చూ. బ్లాకు ]

ఆర్య ! వందనములు తిరుపతి

ఉభయ కుశలోపరి 10-2-44

మీరు వ్రాసిన సందేహములఁ గూర్చి :

1) ఒకటన్యాయము – అని దిద్దుబాటు ఎవ్వరుచేసినది? నేను చేయలేదే? మీ ప్రూఫులో ఆ పాఠమున్నదిగాఁ బోలును – అది దిద్దనేల వలసెను అని, నా దగ్గఱ ప్రతిలో ఉన్నపాఠమే ఉండదగినదని ఉంచినట్టున్నాను. ఒకటన్-క్లిష్టార్థము. ఎవరికైనా ఏదో ఒకటైనా తప్పుండదా? అని వ్రాతప్రతి పాఠమున కర్థము. ఇదే సరి అని నా తలపు

2) 'విరహతాపంబు' అని నా వ్రాత ప్రతి. విరహతాపముచే మేను ఇగురును. చిక్కిపోయి ఉండుటచే మరుబాణ వితతిగంట్లు – అప్పుడేర్పడినవి కానరాకుండును. ముడుచుకొని పోవును. అవి ఇప్పుడు కైపు మిగిలి ఒడలుపొంగగా ఆగంట్లు విరిసి కానవచ్చినవి అన్నట్లు నఖక్షతములున్నవి. ఇంత కంటె వ్రాయుటెందుకు? చూడండి.

3) గళనాదమనేది – ఘన గాయని, చూడండి. అలకలన్(ను); – గళనాదమను, వలిసన్నులను, వరలంబనములను. కనుక – గళనాదమను ఉండి తీర వలెను. వ్రాతలోని 'మునం'మను అని దిద్దండి. గరున – గరు (ఘ) అని దిద్దండి. న – నయేకాగా ఘన అయినది. గాయన, (ని) చేయండి – న అని ఉంచినా సరే – గాయనుడగును – గళనాదము ఒక గాయని లేక గాయనుడు. దానికి ఊర్పులు ప్రక్క హంగుదారులు. తోడిపాట సుతిపోయుట వగైరాలు చేసే వాళ్ళు. సాహ్యము = తోడ్పాటు చేసే, ఆళులు = చెలికత్తెలు.

4) అనుకనుకు, అన్కనుకు = పల్చగా కాకుండా, గట్టిగా ముద్దా కాకుండా ఉండే జాఱు పదనుకు అనుకు అని పేరు. వదులువదులు, పల్చపల్చన అన్నట్టు. అన్కనుకు-వ్రాతప్రతిలో న్క ఉన్నట్లున్నది గనుక.

5) ప్రారబ్ధ పుణ్య అని నా వ్రాత ప్రతి. ఇదే సరియయినది, సుందరమయినది. మంచి అర్థముగలది. చూడండి. తొలి రెండు చరణాలలోనూ మూడేసి విశేషణాలు, తుది రెండు చరణాలలోను రెండేసి – ఉన్నవి ఇట్టి చమత్కారములు గుర్తించక పూర్వాశ్వాసాంతపద్యాలు కొన్ని చెడినవి. నీ రేజపత్రతు నిభనేత్రు, జగత్పవిత్రున్ అంటే ప్రారబ్ధపుణ్య మితభాషు, గుణాభిలాషున్ –

అందురుగాని. నీరే-పత్ర నిభనేత్రు అనలేదా - ఇందులో చమత్కృతి చూడండి అనుప్రాసము. కారు, ధీరు, మాన్యు, దాన్యు, నేత్రు, విత్రు, భాషు లాషున్ - అని రెండేసిచోట్లనే - ఆతనికి ప్రారబ్ధపుణ్యుఁ డనుట విశేషముగాదు. ఆతఁడు ప్రారబ్ధపుణ్యులతో మితముగా భాషించువాఁడు. అతడెవరితో భాషించునో వారు ప్రారబ్ధ పుణ్యులు. పుణ్యరేఖ బయటపడిన వారితోనే ఆయన భాషించుట - అదీ మితముగా. తొలిరెండు చరణాలలో గూడ విశేషణములు రెండేసే అగునా అని చాల యోచించితిని. అవి మూడేసియే.

తొందరలో దిద్దినాను. ఇంకా స్పేసు మార్పులు చాలా అనుచితముగా ఉన్నవి. యతి మార్కులు దిద్దలేదు. రెండవ ప్రూఫు పంపుతారు గదా అని.

ఇక - నేను దిద్దేవి - అప్పటి కప్పుడు చూచి దిద్దేవే గాని 9వ ఆశ్వాసపు పట్టు నేను దిద్ది ఉంచుకోలేదు.

నేను చూచి ఉంచుకునే అవకాశమూ నా కంతగా ఇప్పుడు లేదు. మీ జాబుల తీరు చూడగా ఏదో రహస్య గర్భితముగా అస్పష్టముగా ఉన్నట్టున్నది. వ్యక్తిగతముగా మీకు నేనేమేని తోడ్పడుట - అవసరమైతే - ఉచితమే యగును. అంతేకాని ముప్పది యేండ్లపాటు నా మదరాసు జీవితములో తృణముగానైనను నన్ను గుర్తించని మద్రాసు యూనివర్సిటీకి నేను చాటుమాటుగా మీ వెనుకను బడి దాస్యము చేయుట - సుందరమేమో మీరే యోచించి చూడండి. మీరు గ్రంథ మచ్చు వేయిస్తూ ఉంటిరే - దానికి వ్రాతప్రతి - ప్రస్సులోనూ మీ దగ్గరాలేదా ? అది నాకు పంపరా ? నేను నా పుస్తకము పంపుటా ? నేనొక యక్షరము పాఠము దిద్దినను మీ ప్రూఫుపాఠము నేను దిద్దిన పాఠము, రెండూ విస్పష్టముగా ఎదురు బదురుగా జాబితా వ్రాసి ప్రకటించే ఏర్పాటుతోనే నేను మీ యీ గ్రంథ వ్యవహారమున వర్తింపగలను. అది ముందే మీతో చెప్పినాను. ఈ ప్రూఫులో దిద్దిన వన్నీ అలాగు వ్రాసి ఉంచినాను ఏనాటికైనా యూనివర్సిటి పుస్తక పరిష్కరణపు తీరు నా సవరించిన తీరూ కన్నుగలిగి చూచే వారికి-తెలియ దగినట్టు నా పరిశ్రమ ఉండవలెను. దీనిని నేనర్థించుట అనుచిత మేమో మీరు యోచించి చూడండి! మొన్నటి ప్రూఫులో - 'రవి పదాహతిబడి యుడురాజు వోయె' నన్న పద్యమొక్క దాని దిద్దుబాటు ఒక త్రాసు తూకములో ఉంచితే - లక్ష్మీపతి శాస్త్రిగారి వ్యవహారమంతా ఒక త్రాసులో ఉండదగినది కాదా ? నేను తిరుపతి వచ్చిన తర్వాత - విధిలేక - ఈ ఓ. టి. పరీక్షకు నేనగ్గము కాగలిగితిని గాని

మీరు నన్ను ప్రేమించితిరే కాక ! - యూనివర్సిటికి రంగాచార్లు, భాష్యకా చార్యులు, లక్ష్మీనారాయణశాస్త్రిలు, పరబ్రహ్మశాస్త్రిలు - పాటి వాడను కూడ కాకపోతినే !...

వే. ప్రభాకరశాస్త్రి

5-4-44.

ఆర్యా

నమస్కారములు. ఉభయకుశలోపరి. ఈ నడుమ ప్రెస్సు ఆలస్యము చాల జరిగినది. మొన్ననే వచ్చినది. పోస్టులో పంపబోవుచుండుగా పిఠాపురం శ్రీ వడలి లక్ష్మీనారాయణశాస్త్రిలుగారి కుమారుడు తిరుపతి వెళ్ళవలసియున్నది మొక్కుకొరకు అని చెప్పగా - నాతని చేతికిచ్చి పంపితిని. చేరిన దనుకొనె దను. చూచి వెంటనే పంప ప్రార్థితులు. మీకు శెలవు లెప్పటినుండి యిచ్చె దరు. వేసవిలో మీ మకా మెక్కడ ? అక్కడనే యుండెదరా ? క్రిష్ణా - గోదావరులకు వెళ్ళెదరా ? తెలుప ప్రార్థన. ఈ నెలాఖరువరకు మాకు ఆఫీసు న్నది. తరువాత నొకసారి గోదావరికి వెళ్ళవలసి యున్నది నాకు. ఈస్టరుకు మీకు శెలవు ఉండదేమో - మాకు మూడు దినములు మాత్రమున్నది. ఒకసారి నేనచ్చటికి రావలెననుకొన్నాను గాని సాగునట్లు కనబడలేదు. క్రొత్త పూపులు కూడ వాళ్ళేమియు ఇవ్వలేదింకాను. శ్రీ క. రామలింగారెడ్డిగారి సిఫారసు నాధా రముచేసికొని యూనివర్శిటీవారు శ్రీ నిడదవోలు వేంకటరావుగారిని వేసినా రిచ్చటి యుద్యోగమునకు. విశేషములేమి లేవు. మేలో మీరు మీటింగు కిచ్చటికి రావలసి యుండును గదా. వెనుకటి ప్రూపులు పంపలేదు ప్రెస్సువారింకను. అవసర మైతే నేనే ఒకసారి ఈ లోపుగ వచ్చెదను.

28, సింగరాచారి వీధి, ట్రిప్లికేన్
మద్రాసు,

చిత్తగింపుడు
కో. రామకృష్ణయ్య

5-6-44

శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిలువారికి కృతానేక నమస్కార పూర్వకముగ వ్రాయునది.

అయ్యా! తాము సరి చూచి పంపిన ప్రూఫులు చేరినవి. తరువాత మరియొకటి ఆఫీసునుండి పంపబడి యుండును. మరల 2వ ప్రూఫు పంపుట చాలా కాలయాపనమగు నను సందేహముతో మీ సవరణములన్నీ సరిగా పడినవా లేదాయని సరి చూచి నేనే పంపుతున్నాను. స్ట్రైకు చేసిన ఫారములింకను వాళ్ళు ఇవ్వలేదు. సాధ్యమైనంత వెంటనే తెప్పించి పంపెదను. సందేహములు మిగిలి యున్నవని తోచినచో రెండవ ప్రూఫు కూడా తమకు తప్పక పంపెదను. ఆఫీసులో తొందరపెట్టుదురే గాని ప్రెస్సులో సరిగా ప్రూఫులు పంపరు. పిఠాపురం రాజావారెప్పటి కప్పుడు వైస్ ఛాన్సలరుగారితో ఇంకా కాలేదా ? అని అడుగుతుంటారు. వీరు తొందరగా అడుగుచుందురు. మీ యారోగ్యము సరిగా నుంటున్నదని తలచెదను. నాకును ఈ మధ్య కీళ్ళనొప్పులు కొంచెము బాధించుచున్నవి. మీకు వీలుగా నుండునట్లయితే ఈ సారి రెండు మూడు ఫారములు తీసికొని నేనే వచ్చెదను. శెలవులలో విద్యార్థులు కూడ లేకుండుట వలన మీకు శ్రమగానే యుండును. దయచేసి యీ శెలవులలోనే మరికొంత భాగమగునట్లు చూడవలెనని కోరిక. ప్రెస్సువారిపై నాధారపడియున్నది గూడాను. వీరు ప్రోగుచేసి ప్రకటించిన 'గాలికబుర్లు' ఆశ్చర్యమును గొల్పినవి. ఇక్కడంతా క్షేమము. మీ క్షేమము, ఆరోగ్యమును గూర్చి తెలుపవేడెదను.

28, సింగరాచారి వీధి, ట్రిప్లికేన్
మద్రాసు

చిత్తగింపుడు
కో. రామకృష్ణయ్య

10-8-44

బ్రహ్మశ్రీ ప్రభాకరశాస్త్రిలు గారికి నమస్కారములు.

ఆర్యా, తామిచ్చటికి రేడియో సందర్భమున దయచేసినపుడు నేను వేరే మీటింగుకు వెళ్ళి రాత్రి వచ్చుట చాల ప్రొద్దుపోవుటచే కలుసుకొనలేక పోయినాను. మీ రేడియో ప్రసంగము కూడ 7-45 తరువాత నగుటచే పబ్లిక్ రేడియో

ఆగిపోవును. గావున వినుట తటస్థింపలేదని విచారించుచున్నాను. వెనుక పంపిన ప్రూఫులు తమకు చేరియుండును. మరల రెండవ ప్రూఫులు పంపుటకు ఆలస్యమగుచున్నదను కారణముచే పంపుటలేదు. మీ దిద్దుబాట్లు సాధ్యమైనంత జాగ్రత్తగనే చూచి తరువాతి ప్రూఫ్‌లోని కెక్కినవని నిశ్చయమైన తరువాతనే స్ట్రైకార్డరిచ్చుచున్నాను. ప్రెస్సువారునూ ఆలస్యము చేయుచునే యున్నారు కాని అధికారుల తొందర విపరీతముగ నున్నది. అయినను మనకు సాధ్యమైన రీతినే మనము చేయగలము గాని వేరు కాదు గదా! మీ యొద్ద ఇదివరకు నేను పంపిన అచ్చుపడ్డ ఫారము లెంతవరకు వచ్చినదీ జ్ఞాపకములేదు. ఎన్నో ఫారం వరకు మీ యొద్దనున్నవో తెలుప ప్రార్థన. ఒకసారి ఆ ఫారాలన్నీ పంపినను సరే. పంపగలందులకు ప్రార్థన. తక్కినవి అచ్చు పడ్డంత వరకు ప్రెస్సునుంచి పుచ్చుకుని తమకు మరల పంపెదను. పదముల పట్టిక తయారుచేయుటకు ఆ నెంబరు ప్రకారము సరిజూచుట కొకసారి కావలయును కూడాను. అన్ని కలిపి కుట్టించి మరల మీకు పంపెదను. పద్యమేదో జారిపోయినట్లు పడనట్లు తామన్నారని మా వాడు చెప్పినాడు. అది యేదో గుర్తు తెలుప వేడెదను.

కుమార సంభవ విమర్శనము నా కాపి ఇదివరకే ఎవరో విద్యార్థులో విద్యాధికులో తీసుకుపోయినారు ఎవరో జ్ఞాపకములేదు. లైబ్రరీ కాపీయే రిఫరెన్సుకు కావలసి వచ్చినప్పుడు వాడుకొనుచున్నాము. ప్రూఫులు వెంటనే చూచి పంపగలందులకు ప్రార్థన. తమ ఆరోగ్యము సరిగా నున్నదని తలుస్తాను. మొన్న మిమ్ములను కలుసుకొన లేకపోయినందుకు చింతిల్లుచున్నాను. జవాబు వ్రాయ ప్రార్థన.

యూనివర్సిటీ బిల్డింగ్స్
మదరాసు

కో. రామకృష్ణయ్య

6-10-44

ఆర్యా, నమస్కారములు. తమరు వెనక నిచ్చటికి వచ్చినపుడిచ్చిన ప్రూఫుకాపీ చూచి వెంటనే పంపగలందులకు ప్రార్థించుచున్నాను. చిక్కు విషయములుంటే మార్కుచేసి యుంచిన మరియొక ప్రూఫులో మార్చవచ్చును.

మీ యొద్దనున్న అచ్చుపడిన వెనుకటి ఫారములు కూడ ఒకసారి పంప ప్రార్థన. ఇండెక్సుకి, దిద్దవలసిన అచ్చుతప్పులు చూచి వ్రాసుకుని మరల మీకు పంపెదను. ప్రెస్సువాళ్ళు మరియొక కాపీ ఇచ్చునట్లులేదు. తూచి కాగితములు పంపుచున్నారు. నంబరు లెక్కకు తక్కువ వచ్చునంటున్నారు. నేను మరల తమకు పంపెదను కావున దయయుంచి పంపగోరెదను. ప్రూఫుగూడ వెంటనే పంప ప్రార్థన. మీ మీటింగు ఎక్కడ? ఇక్కడనే జరుగును గదా? ఎప్పుడు ? వ్రాయ ప్రార్థన. అంతా క్షేమము మీ యందరి క్షేమము వ్రాయగోరెదను.

యూనివర్శిటీ ఆఫీసు<br>మద్రాసు

చి త్తగింపుడు<br>కో. రామకృష్ణయ్య

చూ. పుట 109, 110 - (శ్రీ కోరాడవారి లేఖాంశము-ఒక పార్శ్వము)





చూ. పు 59 - కందుకూరి వీరేశలింగము పంతులుగారి లేఖలోని తుదిభాగము



చూ. పుట. ౨౨ - శ్రీ ప్రభాకరులు 1916 ప్రాంతాలలో తమ నోటుబుక్కులో కాపీ చేయించుకొన్న తం|| లైబ్రరీ తెలుగు కేటలాగులోని ఆరంభము. ఇందులో మొత్తము 20 పుటలున్నవి. 6 విభాగాలలో మొత్తము 675 గ్రంథములనుగూర్చిన లిస్టు ఇది. వీనిలో 189 నెం|| కుమార సంభవము - తెలుగు పద్యకావ్యము - నన్నె చోడకవి. చూ. డా|| ఆనందమూర్తి వ్యాసము (ఇందే)

# నన్నెచోడ కుమారసంభవవ్యాఖ్య

## డా॥ పోచిరాజు శేషగిరిరావు

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కవితలు వెలయించుట; రూపకాను వాదములు చేయుట; ప్రాచీన గ్రంథ పరిష్కరణము, చరిత్ర శోధన, సాహిత్య విమర్శలు సాగించుటేగాక ఇసుప గుగ్గిళ్ళ వంటి ఆంధ్ర కావ్యములు కొన్నింటికి వ్యాఖ్యలు రచించిరి. అట్టి వానిలో నన్నెచోడ కుమారసంభవ కావ్య వ్యాఖ్యాన మొక్కటి.

వ్యాఖ్యానరచనము ఉద్దండపాండితీపాటవములతోపాటు, ప్రతిభతో నుండినగాని పొసగదు. వ్యాఖ్యాత కపసరమని పెద్దలు భావించిన బహుగ్రంథ పరిశీలనము — బహుముఖ పాండిత్యము — నిష్పక్షపాత వైఖరి — వివిధ విషయ పరిజ్ఞానము — దురవబోధములైన విషయములను సుగమ మొనర్పగల సామర్థ్యము శ్రీ ప్రభాకరుల హృదయకేదారమున పుష్కలముగా పండినవి. ఇంత మాత్రమే కాదు. కవి హృదయమును గ్రహింపగల సహృదయత, జాణతనము వ్యాఖ్యాత కపసరము. వీని అన్నింటికి దోడు నవనవోన్మేషశాలినియైన ప్రతిభ ఒక వరప్రసాదము. ఇంతటి సాధనసామగ్రీ సంపత్తితో శ్రీ శాస్త్రిగారు వ్యాఖ్యాన రచనమునకు దొరకొనిరి.

వ్యాఖ్యానములు ముత్తెఱగులుగా కానవచ్చును. 1) సమగ్ర వ్యాఖ్యానము, 2) గచ్ఛద్వ్యాఖ్యానము. 3) ధావద్వ్యాఖ్యానము. శ్రీ శాస్త్రిగారు రచించినంత మేరకు వ్యాఖ్యలు సమగ్రమైనవే. మల్లినాథులవలె వేటూరివారు పదవాక్య ప్రమాణపారావారపారీణులు. మూలమునందు లేనిది ముట్టుకొనలేదు. అనపేక్షితమైన దానిని వ్రాయలేదు. అన్వయముఖముననే సర్వమును వ్యాఖ్యానించినారు.

నన్నెచోడ కుమారసంభవ వ్యాఖ్యకు 1948లో, వీరికి ప్రోత్సాహము కల్గించినది పిఠాపురం మహారాజా శ్రీ రాజా రావు వెంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరు వారు. * శ్రీ రాజా వారి ప్రేరణమున, శాస్త్రిగారు వ్యాఖ్య నుద్యమించి, దానికి నాందిగా మూలమును సర్వుష్టముగా పరిష్కరింప నెంచి, ఎనిమిది ఆశ్వాసముల పర్యంతము 'ముద్రిత పాఠములు, సవరణ' యను పేర పట్టికలు సిద్ధము చేసినారు. కుమార సంభవమును పరిష్కరించుట వ్యాఖ్యానించుట శ్రీ రాజా వారి ఆశయ మెనటు కన్పట్టును. ఈ వ్యాఖ్య వ్రాతప్రతిపై 'పరిష్కర్త—వ్యాఖ్యాత : వేటూరి ప్రభాకర శాస్త్రి' అని కలదు.

ఈ వ్యాఖ్య కుమారసంభవములోని ప్రథమాశ్వాసములోని తొలి 36 పద్యములకు — అనగా 'మృదురీతి సూక్తులింపొదవంప' అను పద్య పర్యంతము సాగినది. [1] శ్రీ శాస్త్రిగారు పరమపదించిన పిమ్మట వారి శిష్యులు డా. నిడుదవోలు కోదండ రామయ్యగారు తొలి రెండాశ్వాసములకు టీక వ్రాసి 'త్రిలింగ' లో ప్రకటించినారు. కవిరాజశిఖామణిపై డా. అమరేశం రాజేశ్వర శర్మ, డా. టి. కోదండ రామయ్య, వేదము వేంకటరాయ శాస్త్రి (ఎం.ఏ) గారలు విమర్శ గ్రంథములు ప్రచురించినారు. ఇంత దనుక నన్నెచోడ కుమార సంభవమునకు సంపూర్ణ వ్యాఖ్య వ్రాయు యత్నమునకు నెవ్వరు దొడగినట్లు కానరాదు.

శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు ఈ కృతి తొలి రెండాశ్వాసములు ప్రకటించిన నాటినుండి (1909) శ్రీ శాస్త్రిగారు నన్నిచోడుని కాలనిర్ణయమును గూర్చి, కవితారీతి గురించి, అసాధారణ ప్రయోగ వైవిధ్యము గురించియు వ్యాసములు వ్రాయుచునే యుండిరి. కాలనిర్ణయ విషయమున శాస్త్రిగారు ప్రకటించిన వ్యాసము [2] 'ఇప్పటికి చివరి మాటగా ఉంది' అని శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వ్రాసిరి. [3] కేనము, గోమిని వంటి పదముల కర్థములు కన్నడ, ద్రావిడ భాషా పరిజ్ఞానముతో వారు వివరించినారు.

---

* చూ. లేఖలు (ఇందే).

1. ఆటు పిమ్మట కొంచి నెలలకే జమీందారీల రద్దు చట్టము రాగా, శ్రీ రాజవా రీ యుద్యమము నుపసంహరించుకొన్నారు. ముఖ్యముగా వారి ప్రోత్సాహము పైననే వ్రాయ సంకల్పించిన శ్రీ శాస్త్రిగారికిది నిరుత్సాహ హేతువై, పిమ్మట దాని నాపి వైచినారు.

2. ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక 14 సంపు. 1 సంచిక.

3. పరిశోధన — 1 సంపు. 3 సంచిక — పుట 13

## వ్యాఖ్యాన పద్ధతి :

కొన్ని పద్యములకు తాత్పర్యము వ్రాయుట జరిగినది. కొన్ని పట్టుల పదార్థముల కమరకోశ ప్రమాణ మొసంగినారు. ఇది ప్రాచీన కావ్య వ్యాఖ్యా పద్ధతి. సాధుపాఠనిర్ణయ మొనరించుట మరియొకటి. శ్రీ శాస్త్రిగారే, పాఠమును సవరించిన చోట నెల్ల, ఆ విషయమును చెప్పినారు. వ్యాఖ్యాన సందర్భమున వచ్చిన వింత శబ్దములు ఉదా: ముసుగ, ముసరు వంటి వాని వివరణ లొసంగిరి. అట్టి పట్టులందు శబ్ద స్వరూపము, ప్రమాణములు, సమీప ద్రావిడ భాషలలోని రూప భేదములు, తదుపరి అర్థ వివరణ అను తీరున సాగినది.

'తన జనకుఁ డురుస్థాణువు' అను పద్యమునకు వ్యాఖ్య వ్రాయుచు 'స్థాణుర్భవాన్ మూల విహీన ఏవ, పుత్రో విశాఖో రమణీ త్వపర్ణా పరోపనీతైః కుసుమై రజస్రమ్, ఫలత్య భీష్టం కిమిదమ్ విచిత్రమ్' అను ప్రసంగరత్నావళి లోని శ్లోకము చూపి, అందలి యలంకారమును పేర్కొన్నారు.

అట్లే మఱియొక పట్టున 'తాడిడి పలంబు గొనుట' అనుచోట అర్థమును వివరించుటతో తృప్తి పడక, ప్రయోగాంతరమును — మంచన కేయూరబాహు చరిత్రములోని దానిని పేర్కొనిరి. ఇందులకే శాస్త్రిగారిని పదవాక్య ప్రమాణ పారావార పారీణు లనుట.

శ్రీ శాస్త్రిగారు శబ్ద వేత్తలు. కావుననే 'సద్యము' సద్యః అను నవ్యయమునకు తత్సమరూపమని తెల్పుటయే గాక, తిక్కన, శ్రీనాథుల ప్రయోగములు ప్రదర్శించి చూపిరి.

## వ్యాఖ్యాన ధోరణి :

తను వసితాంబుదంబు, సితదంతయుగం బచిరాంశు లాత్మగ
ర్జన మురుగర్జనంబు, కరసద్రుచి శక్రశరాసనంబునై
చన మదవారి వృష్టి హితసస్యసమృద్ధి గన్రభవేశినాఁ
జను గణనాథుఁ గొల్తు ననిశంబు నభీష్టఫలప్రదాతఁగాన్.

''గణనాథుని మేను కాఱుమబ్బు, తెల్లని దంతాగ్రము మెఱపు, తన బిగ్గఱ యఱపులు పెల్లుఱుములు. తొండపు శోభ యింద్రధనుస్సునై యొప్పగా మదోదక వర్షముచే హిత సస్య సమృద్ధి = హితులనెడి సస్యములకుఁ బరితృప్తి ; కన్= అగునట్లు ; అభ్రవేళ = వానకారు ; నాన్ + చను + గణనాథున్ = అన నొప్పు వినాయకుని ; అభీష్ట ఫలప్రదాతగా ; అనిశము = సదా ; కొల్తును. ఇది అర్ధవివరణముతీరు.

'దంతయుగం బచిరాంశుపులు' అను వ్రాతప్రతిలోని, ముద్రణములోని పాఠమును దిద్దితిని. విఘ్నేశ్వరుఁ డేకదంతుఁడు గాన తక్కిన వన్నియు నేకవచనములోనేయున్నవిగాన [తనువు, అంబుదము. గర్జనము, రుచి, శరాసనము, అభ్రవేళ ]యట్లు మార్చితిని. ముద్రిత ప్రతిలో 'అచిరాంశులు' అని బహువచన మున్నది. దంతాగ్రము నోరు మూసినపుడు కానరాక తెరచినపుడు గాన వచ్చును. అప్పు డచిరాంశు సామ్యము సుందరముగా నుండును. అలంకారము రూపకము. మూడు చరణములందు సరసయతి. చవర్గమునకు శషశలకు సరస యతి. జస, చస, జశ యతులిందున్నవి.[1]''

ఇట్లు ఛందోలంకారముల — నెఱిగించుటతో పాటు సాధుపాఠ నిర్ణ యములు, వాని వలన పద్యమున కేర్పడిన సారస్యము వివరించిరి. ముక్కకు ముక్క యర్థము చెప్పుటగాక, కొందఱు వ్యాఖ్యాతల వలె జటిలములైన చోట్ల విడువక - అట్టి వాని కర్థములు సాధించు వఱకు నిద్రపోని దీక్ష వారిది. కవి హృదయ మెఱిగించుటకైన నిర్విరామ కృషి యీ వ్యాఖ్యలో గాననగును. ఇట్లు వ్యాఖానము 36 పద్యాల వఱకు నడచినది. అంతకు ముందే. 1949 ప్రాంతమున నన్నెచోడ కుమార సంభవము శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారి పర్యవేక్షణతో మద్రాసు విశ్వ విద్యాలయము వారిచే ప్రకటింపబడినది. దానికి సాధుపాఠ ముల నిర్ణయించి వారికి పంపిరి. అవి మేమెఱిగినదే. ఆ ప్రస్తావనయే వారిపీఠికలో లేకుండుట విచిత్రము !!

---

1 కుమార సంభవ వ్యాఖ్య ప్రతి—డా. వే. ఆనందమూర్తిగారి కడకలదు. వారి సౌజన్యములో దీని నిట నుదాహరింప గల్గితిని.

# తథ్యమిథ్యావివేచనము

## ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి

[ ప్రభాకరశాస్త్రిగారి పరిశోధన పరిమాణమునకు కంటె ప్రమాణమునకు బిరుదు .... ప్రథమశ్రేణి పరిశోధకపరమేష్ఠులలో ప్రభాకరశాస్త్రిగారిది ఒక ప్రత్యేక స్థానము .... ప్రామాదికములను పరిహరించి ప్రామాణికములను పరిగ్రహించుట కర్తవ్యము– సం॥ ]

తెలుగు వాఙ్మయమునందు పరిశోధన తొలుత అవ్యాజము. తరువాత సవ్యాజము. మొదట పండితుల వ్యాసంగము. పిదప పరిశోధకుల వ్యాసంగము. పండితుల వ్యాసంగమునందు పట్టుదల కలదు. పరిశోధకుల వ్యాసంగమునందు పట్టు, విడుపు కలవు గుణదోషములు, భ్రమప్రమాదములు నాడు, నేడు కలవు. బహుశః ఏనాడును ఉండును. పరిశోధన ఉపరిశోధన కానిచో పదివేలు. రామకోటి లేనిచో పరాంకోటి.

కందుకూరి వీరేశలింగము, మానవల్లి రామకృష్ణకవి, కొమర్రాజు లక్ష్మణరావు, జయంతి రామయ్యపంతులు, వేటూరి ప్రభాకరశాస్త్రి, బండారు తమ్మయ్య, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, మల్లంపల్లి సోమశేఖరశర్మ ప్రభృతులు ప్రథమశ్రేణి పరిశోధక పరమేష్ఠులు. ప్రథమశ్రేణిని ప్రభాకరశాస్త్రిగారిది ఒక ప్రత్యేక స్థానము. పండితులలో అంత పరిశోధకుడు, పరిశోధకులలో అంత పండితుడు అరుదు. అంతేకాదు. ప్రభాకరశాస్త్రిగారి పరిశోధన పరిమాణమునకు కంటె, ప్రమాణమునకు బిరుదు. పరిధి కూడ పరిణాహము కలది. అందు 'నన్నెచోడుని కుమారసంభవము' ఒకటి.

'నన్నెచోడుని కుమారసంభవము' గురించి 1918వ సంవత్సరమునందు ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించిన విషయమిది !

"శ్రీరామకృష్ణ కవిగారు ప్రచురించిన కుమారసంభవపు ముద్రిత ప్రతిలో నీ పద్య మిట్లున్నది (మును మార్గకవిత) 1909 సం॥ దీనిని ముద్రించినారు. అప్పుడీ పద్యమునకు వారు పాఠాంతరమును జూపలేదు. వారి యచ్చునకు మాతృక యెక్కడిదో చెప్పనులేదు. కాని తంజాపురపు సరస్వతీ పుస్తక భాండాగారమునఁ దాటియాకులపై వ్రాయఁబడిన కుమారసంభవపుఁ బ్రతి యున్నది. అక్కడఁ దక్క నింతవఱకుఁ బ్రత్యంతర మెక్కడను గనరాదు. వినరాదు .... ....

కవిగారికి 'ఘన సత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపుల్' అన్న పాఠమెక్కడనుండి వచ్చినదో! వారింక నెక్కడి ప్రతి సంపాదించినారో! ప్రథమ భాగమును ముద్రించునప్పటికి వారీ తంజావూరు ప్రతి నెఱుఁగనే యెఱుఁగరు గావలయు. ఎఱిఁగియుందురేని యనర్ఘమగు నీపాఠముఁ (జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్) జూపకుండుట కేమి కారణము?"

ఇందలి ఆశ్చర్యార్థక, ప్రశ్నార్థక చిహ్నములు అలంకార ప్రాయములు కావు. కవిగారు ప్రథమ భాగమును ప్రకటించినపుడు పాఠాంతరమును చూపని మాట నిజము. మాతృక ఎక్కడిదో చెప్పని మాట వాస్తవము. ప్రత్యంతరము కనరాని మాట సత్యము. వినరాని మాట యథార్థము. 'ఇంతవఱకు'ను అనుమాట 'ఇంతవఱకును' ఇంతే. బహుశః ఎంతవఱకును అంతే. కనుక 'పాఠ మెక్కడ నుండి వచ్చినదో!', 'ఎక్కడి ప్రతి సంపాదించినారో!' అని ఆశ్చర్యము కలుగుట సహజము. అంతేకాదు. తంజావూరి ప్రతిలోని 'పాఠమును చూపకుండుట కేమి కారణము?' అను ప్రశ్న ఉత్పన్న మగుట అంతకంటె సంగతము.

ఇట్లు సవిమర్శకముగ 1908 వ సంవత్సరము నందు ప్రకటించిన పయి విషయములోని '— చెప్పనులేదు. కాని తంజాపురపు —' అను పదముల మధ్య 1976 వ సంవత్సరము నందు చేరిన పంక్తులు కలవు. అవి ముందు వివరింతును.

1924 వ సంవత్సరము నందు జయంతి రామయ్యపంతులుగారు ప్రకటించిన విషయమిది[2]:

"—రామకృష్ణకవి గారి ప్రతిని (తంజావూరు ప్రతిని) స్మరింపక పోవుటకుఁ గారణ మేమున్నదో తెలియదు. తంజావూరు పేరైనను రామ కృష్ణకవిగారు తలపెట్టలేదు .... మనకు వలెనే కవిగారికిని తంజావూరు ప్రతి యొక్కటి మాత్రమే లభించియుండునని యూహించుట కొక హేతువు కనఁబడుచున్నది. .... రామకృష్ణకవి గారికి (తంజావూరి ప్రతిలో ....) లోపించిన భాగములు దొరకలేదు. వేఱు వేఱు ప్రదేశము లందు దొరకిన మూఁడు ప్రతులలోను నొక్కచోటనే లోపములుండుట చిత్రము".

1931 వ సంవత్సరము నందు నడకుదుటి వీరరాజుపంతులుగారు ప్రక టించిన విషయ మిది[3]:

"బ్ర. శ్రీ. రామకృష్ణకవి గారు గ్రంథపీఠిక యందు తమకు కుమారసంభవము ప్రతులు మూఁడు లభించియున్నవని వ్రాసినారు. తంజావూరి వ్రాఁత ప్రతిలో లుప్తములై యున్న భాగములే ముద్రిత పుస్తకము నందును గానరాక, ఆయా స్థలముల చుక్కలు పొదువఁబడి యున్నవి. భిన్నదేశములందు పుట్టిన ప్రతులు మూఁటి యందును ఒక్క- చోటనే పాఠములు పోయి యుండుట యెల్లవారికి నాశ్చర్యముఁ గొలుపక మానవు. కవిగారు లోకమునకుఁ గల యీ సందేహాశ్చర్యములను దీర్ప వలసి యున్నారు రామకృష్ణకవిగారి యొద్ద నున్న ప్రతులు మూఁడును ఏకమాతృకకే పుత్రికలేమో యని యనుకొనుటకు వారచ్చటచ్చటఁ జూపిన 'పాఠభేదములును', వారిచ్చిన 'ముఖ్య పాఠభేదములు' అను శీర్షిక గల యనుబంధ పత్రమును, ఒందు రెండుచోట్లఁ గల లుప్తభాగ పూరణములును వలను పడనీయకున్నవి".

1937 వ సంవత్సరము నందు శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు ప్రకటించిన విషయ మిది[4]:

"ద్వితీయ సంపుటాంతమున ముఖ్య పాఠభేదము లనుశీర్షిక క్రిందఁ జేర్చిన పాఠములు తంజావూరి ప్రతిలోని పాఠములతో సరిగా

నున్నవి .... రెండవ సంపుటములోని పాఠభేదములు ఒకటి రెండు దక్క మిగిలిన వన్నియుఁ తంజావూరి ప్రతిలోని పాఠములతో సరిగా నున్నవి .... ముద్రిత ప్రధాన పాఠము లితరములగు ప్రతులలోనివని యూహింపవలయునుగాని యట్లనుకొనుటకు వీలులేని విషమ సందర్భ మొకటి కనఁబడుచున్నది .... లుప్తభాగములు ముద్రితపుఁబ్రతిలోఁ గూడ లుప్తములుగానే యున్నవి .... పయి పద్యములు తంజావూరి ప్రతినుండి గ్రహింపబడినవని చెప్పుటకుఁ దగిన యత్యంత సాదృశ్యము గలదు .... ఇంత సాదృశ్యము గల ప్రతులఁ జూచి పరిష్కరించు నపుడు తంజావూరి ప్రతి పాఠముల కంటె భిన్నములగు పద్యభాగములెట్లు వచ్చినవో దురవగాహము .... పరిశీలింపఁగా ముద్రిత భాగముల కంటె భిన్నమగు ముఖ్య పాఠభేదము లనునవి తంజావూరి ప్రతి ననుసరించి యున్నవి. దానిచే మొదటి పాఠమునకు నితర గ్రంథములు మూలములు గావలయును. తంజావూరి ప్రతిలో సుంతయైనను భేదము లేకుండఁగ నున్న పై (లుప్త) భాగములు చూడగా తంజావూరి ప్రతినుండియే మూలము గ్రహింపఁబడినట్లున్నది. ఈ సందర్భమెట్లు సంగతమగునో?"

1976 వ సంవత్సరము నందు — 1918 వ సంవత్సరము నందు ప్రభాకర శాస్త్రిగారు ప్రకటించిన విషయము నందు చేరిన పంక్తు లివి :

"కవిగారు కుమారసంభవము రెండవభాగపుఁ బీఠికలో నిట్లు వ్రాసినారు. 'కుమారసంభవ ప్రతులలో నొకటి నాకు నైజాము రాజ్యమునఁ బ్రాచీన శాసనశోధనార్థము పోవుచుండగాఁ గర్ణాటదేశముననే లభించెను. తక్కినవి రెండును శుద్ధద్రవిడదేశముననే యగపడెను'. ద్రవిడకర్ణాట దేశములందు మూఁడు ప్రతులు దొరికినను నచ్చులోఁ బెక్కులు గ్రంథపాతము లుండుట వింతగా నున్నది. ఆ మూఁడు ప్రతులు నొక్క మాతృకకే పుత్త్రికలా యేమి? కాకున్నచో నవి పాఠభేదములు లేకయు సమాన గ్రంథపాతములు గలిగియు నుండుట వింత గదా? పట్టికలో ముఖ్య పాఠభేదములని వారు చూపినవి ప్రాయికముగా ముద్రణ సందర్భానుగుణముగాఁ జేయఁబడిన సంస్కారములకు వ్రాఁతప్రతిలో నున్న

తప్పు పాఠములుగా గోచరించుచున్నవి. కుమారసంభవ ప్రతుల యొక్కయుఁ బాఠముల యొక్కయు రహస్యము లింకను బయల్పడ వలసియే యున్నవి''.

ఇవి ప్రభాకరశాస్త్రిగారు ఇతరత్ర ప్రకటించినవి అనిగాని, వ్రాసిపెట్టు కొన్నవి అనిగాని, తెలుపకుండ చేర్చినవి. 'ప్రథమ ముద్రణము ననుసరించి యథామాతృకముగ పునర్ముద్రించుచున్నాము' అని 'మనవి' మాటలు పలికి, ప్రభాకర పరిశోధకమండలి వారు ప్రభాకరశాస్త్రిగారి పీఠికను మార్చుట చిత్రము కారణము తెలుపుదురుగాక.

కుమారసంభవమునకు 'ప్రత్యంతరము గనరాదు. వినరాదు' అను ప్రభాకరశాస్త్రిగారి తొలిపలుకు, 'ప్రతుల యొక్కయుఁ బాఠముల యొక్కయు రహస్యము లింకను బయల్పడవలసియే యున్నవి' అను తుది పలుకు మణిపూసలు.

తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయములోని తాళపత్ర గ్రంథమును తఱచి చూడగా బయల్పడవలసిన రహస్యములు బయల్పడినవి. అవియెల్ల 1983వ సంవత్సరము నందు ప్రకటించితిని.[6]

కవిగారు 'నన్నెచోడుని కుమారసంభవము' ప్రకటించుటకు (1909) బహుపూర్వమే. (1870) తంజావూరు సరస్వతిమహలు గ్రంథాలయమునందు తాళపత్రగ్రంథము కలదనుటకు సాధానాభాసమైన, వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి 7.12 1917వ తేదీని కందుకూరి వీరేశలింగముగారు వ్రాసిన ఉత్తరము—ప్రామాణికము కాదని 1983వ సంవత్సరము నందే ప్రకటించితిని.[7] అందు వీరేశలింగముగారు 'తంజావూరు తెలుగు పుస్తకముల పట్టిక'ను '1870వ సంవత్సర ప్రాంతము నందు' గాక '1885వ సంవత్సర ప్రాంతము నందు మాత్రమే' తెప్పించుకొని యుందురని, తదావశ్యకము కవులచరిత్ర రచనమని, '1887వ సంవత్సరము నందు మాత్రమే గాక 1899వ సంవత్సరము నందును ప్రకటించిన ఆంధ్రకవుల చరిత్రము నందు వీరేశలింగముగారు

నన్నెచోడుని పేరెత్తలేదు. కుమారసంభవము ఊసెత్తలేదు .... అనగా 1899వ సంవత్సరము నాటికి వీరేశలింగము గారు తెప్పించుకొన్న 'తంజావూరు తెలుగు పుస్తకముల పట్టిక' యందు 'నన్నెచోడుని కుమారసంభవము' ప్రసక్తి లేదని, వీరేశలింగముగారు 'కుమారసంభవాది కావ్యములను చూడ'లేదని అవగాహన మగును' అని సంభావ్యమైన సమన్వయము కలదు. '1885వ సంవత్సర ప్రాంతము నందు'కూడ వీరేశలింగముగారు 'తంజావూరు పుస్తకముల పట్టిక'ను తెప్పించుకొనలేదు. తదావశ్యకము కవుల చరిత్ర రచన మాత్రమును కాదు కందుకూరి వీరేశలింగముగారు ప్రభాకరశాస్త్రిగారికి వ్రాసిన ఉత్తరము కంటె ప్రామాణికమైన, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు గ్రంథస్థము చేసిన విషయ మిది[8] :

"1896వ సంవత్సరము డిశంబరులో వీరేశలింగముగారు తంజావూరు నగరమునకు సముద్రితాంధ్ర గ్రంథములను సంపాదించుటకై వెళ్ళిరి. ఆ పురమును తెలుగు నాయకులు బరిపాలించినపుడు అమూల్యమైన యాంధ్రగ్రంథ భాండారమొకటి సంపాదించి యుండిరి. మన దేశములో నెచ్చటను దొరకని యాంధ్ర గ్రంథము లనేకము లచ్చట దొరుకుచు వచ్చెను. నాచన సోముడు రచియించిన 'యుత్తరహరివంశ' మను మహాకావ్యము, తెనుగు దేశమున నెవరెంత ప్రయత్నించినను దొరకినది గాదు వీరేశలింగముగారు తంజాపురీగ్రంథభాండారములోని పుస్తకముల జాబితా తెప్పించి చూడగ, నందులో నాచన సోముని యుత్తర హరివంశము యొక్క వ్రాతప్రతి యొకటి యున్నట్లు కనబడెను. ఆ గ్రంథము నశించిపోయినదని చింతించుచున్న వీరేశలింగముగారికి, పేదకు పెన్నిధి దొరికినట్లయ్యెను. వెంటనే వారు వ్యయప్రయాసములకు లోనై తంజావూరు పోయియు నచ్చట మండల న్యాయాధిపతిగ నుండిన 'హేమ్‌నెటు' (Hamnet) దొరగారి సహాయ్యమున, నెవరిచేతనో 'యుత్తర హరివంశమున'న కొక ప్రతివ్రాయించి, తెప్పించి, తమ వివేకవర్ధనీ ముద్రాక్షరశాలలో దానిని ప్రకటింప నారంభించిరి.... ఆమహాత్ముని భాషాభిమానముచేతనే, మున్ను నశియించినదని చెప్పుకొన్న యుత్తర హరివంశము, మన యాంధ్ర సారస్వతమున కలంకారమై ప్రకటింపబడెను"

ఇందు కందుకూరి వీరేశలింగముగారు 'తంజావూరు తెలుగు పుస్తకముల పట్టిక'ను తెప్పించుకొన్న సంవత్సరము, హేమ్‌నెట్ దొర తంజావూరు మండల న్యాయాధిపతిగ ఉన్న సంవత్సరము 1896వ సంవత్సరమని స్పష్టముగ కలదు. అంతేకాదు. వీరేశలింగముగారు '1896వ సంవత్సరము డిశంబరులో' తంజావూరు వెళ్ళినది 'అముద్రితాంధ్ర గ్రంథములను సంపాదించుటకు' అని ఇదమిత్థముగ కలదు. అముద్రితాంధ్ర గ్రంథ సంపాదనమునకు ప్రయోజనములు రెండు– 1 ఆంధ్రకవుల చరిత్ర రచనము. 2. అముద్రితాంధ్రగ్రంథ ప్రచురణము. 1899వ సంవత్సరమునందు వీరేశలింగముగారు ప్రకటించిన ఆంధ్రకవుల చరిత్రము నందు, 1917వ సంవత్సరము నందు సరిచేసి ప్రకటించిన ఆంధ్ర కవుల చరిత్రము నందు నాచన సోమనాథుని ఉత్తరహరివంశము గుఱించి ఉన్నంత విషయమును ఇంచుమించు కలదు. లేనిది బుక్కరాయల పెంచుకల దిన్నె శాసనము విషయము మాత్రమే. అంతేకాదు. నాచన సోమనాథుని ఉత్తరహరివంశము 1897వ సంవత్సరము నందే ప్రకటింపఁబడినది. కారణము 'ఆ మహాత్ముని భాషాభిమాన'మే. అంత భాషాభిమానముతోను, 1896వ సంవత్సరము నందు తెప్పించుకొన్న తంజావూరు తెలుగు పుస్తకముల పట్టిలో 'నన్నెచోడుని కుమారసంభవము' ప్రసక్తి కలదేని, 'ప్రతి వ్రాయించి, తెప్పించి, ప్రకటింపకపోయినను, 1899వ సంవత్సరము నందు ప్రకటించిన ఆంధ్ర కవుల చరిత్రము నందు 'నన్నెచోడుని కుమారసంభవము' గుఱించి వ్రాయుట సంభవము. కాని 1899వ సంవత్సరము నందు ప్రకటించిన ఆంధ్రకవుల చరిత్రము నందు 'నన్నెచోడుని కుమారసంభవము' గుఱించి నామమాత్రముగ నైనలేదు. కనుక 1983వ సంవత్సరము నందు బయల్పడిన రహస్యములు భావ్యములు కావలయును.

ప్రథమతః 'నన్నెచోడుని కుమారసంభవము'ను ప్రకటించిన మానవల్లి రామకృష్ణకవిగారి ఒక ప్రతిపాదన మిది[9] :

> "కుమారసంభవములోని పద్యము లధర్వణచ్ఛందము .... లో నుదాహరింపఁబడినవి. అధర్వణుఁడు – క॥ మగణమ్ముఁ గదియ రగణము వగవక కృతి మొదట నిలుపువానికి మరణంబగు నిక్కమ్ముండ్రు

మడియఁడె యగునని యిడి తొల్లి వేంకటాదిత్యుఁడనిన్ —యని యును బూర్ణబిందు ప్రాసము క్రింద పద్యము నుదాహరించెను'.

ఇది 1909వ సంవత్సరము నందు ప్రకటింపఁబడినది. 1979వ సంవత్సరము వఱకు ప్రభుత్వము సాగించినది. 'పూర్ణబిందుప్రాసము' నకు 'మగణమ్ముఁగదియ' అను పద్యమునకు లక్ష్యలక్షణ సంబంధమ లేదు. అంతేకాదు. ముద్రితాముద్రిత లక్షణ గ్రంథము లందు 'మగణమ్ముఁగదియ' అను పద్యము మృగ్యము. అయినను ముద్రితాముద్రిత లక్షణ గ్రంథము లెల్లక్షోదక్షమముగ పరిశోధన కావించిన విద్వాన్ రావూరి దొరస్వామిశర్మగారిని అడిగితిని. 'ఎక్కడను లేదు. అయినను మఱల చూచి చెప్పెదను' అని, మాసద్వయము తర్వాత 'ఎక్కడనులేదు' అని సవివరముగ వ్రాసిరి. అది గ్రంథస్థ మయినది.[10] అయినను ఎందుకైనను మంచిదని మఱొక పరిశోధకునిచేత మఱల ముద్రితాముద్రిత లక్షణ గ్రంథము లెల్ల పరిశీలింపఁజేసితిని. తంజావూరు, మదరాసు: తిరుపతి, వేటపాలెము, హైదరాబాదు, కాకినాడ, వాల్తేరు గ్రంథాలయములలోని ముద్రితాముద్రిత లక్షణ గ్రంథములెల్ల మూలముట్టుగఁ జూచిన మీదట'ఎక్కడను లేదు' అనియే సమాధానము వచ్చినది. ఇది కూడ గ్రంథస్థ మయినది.[11] ఇదియెల్ల 1979—1984 సంవత్సరముల నడుమ జరిగిన సంఘటన. మఱి ప్రభాకరశాస్త్రిగారు 1926వ సంవత్సరము నందే ప్రకటించిన విషయ మిది[12],

"రామకృష్ణకవిగా రుదాహరించిన పై పద్యము నేనెఱిఁగినంత వఱకు లక్షణగ్రంథములలోనెక్కడను గానరాలేదు నేను దీనిఁ గూర్చి శ్రీ కవిగారిని బలుదడవ లడిగితిని. తమ దగ్గఱ నథర్వణచ్ఛందస్సు కలదనియు దానినుండి యీ పద్య ముదాహరించితి మనియు వారనిరి. ఆ గ్రంథము వెల్వడిన తర్వాత నా యథర్వణుని గూర్చి విశేషము లెఱుఁగఁగలమేమో కాని యిప్పుడేమియు నిర్ణయింపఁజాలము. కం.పీ. గారు కవిగారి పేరు చెప్పకుండ దాని నుదాహరించిరి, కాని, వారు వేఱొకచోట దానిఁ జూచి యెఱుఁగరు"

కవిగారు తమ యొద్ద కలదన్న అథర్వణచ్ఛందస్సు కవిగారి జీవిత కాలము నందు 1866—1957 వెలువడలేదు. ఒక్క అథర్వణచ్ఛందస్సు

మాత్రమే కాదు; కవిగారు తమ యొద్ద కలవన్న అథర్వణుని భారతము, చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనము మొదలైన అనేక గ్రంథములు ఇంతవఱకును వెలువడలేదు. ఇక ముందును వెలువడునవి కావు అవి కవిగారి యొద్దనైన కలవి అయిన, ఎప్పుడో వెలువడి యుండును. కనీసము మఱొకరికి కనబడి యుండును. అథర్వణచ్ఛందస్సు ప్రభాకరశాస్త్రిగారు 'పలుదడవ లడిగి' నను ప్రత్యక్షము కాలేదు. కందుకూరి వీరేశలింగముగారు కవిగారి పేరు చెప్పకుండ కవుల చరిత్రము నందు ప్రకృత పద్యమును ఉదాహరించినమాట యథార్థము. వీరేశలింగముగారు ఆంధ్రకవుల చరిత్రము నందు ఉదాహరించుటవలననే, ప్రభాకరశాస్త్రిగారు 'నేనెఱిగినంతవఱకు లక్షణ గ్రంథములలో నెక్కడను గానరాలేదు' అని — 1926లోనే పత్రికాముఖమున ప్రకటించినను, అది 1979 వఱకు ప్రచార రథయాత్ర సాగించుట ప్రాప్తించినది. తథ్యమిథ్యా వివేచనము లేకపోవుటవలని విపరీతము. పరిశోధనకు తథ్యమిథ్యా వివేచనము ప్రథమ కర్తవ్యము. అది ప్రభాకరశాస్త్రిగారికి ఆనాడే కలదు. కనుక 'నన్నెచోడుని కుమారసంభవము' గుఱించి ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించిన అభిప్రాయము లివి ప్రామాణికములైనవి.

'ప్రబంధరత్నావళి'లోని 'నన్నిచోడడు (కళావిలాసము)' అను ప్రభాకరశాస్త్రిగారి ఆరోపము మాత్రము ప్రామాదికము.

ప్రబంధరత్నావళికి ఆధారమైన పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరము తంజావూరి ప్రతిలోని ప్రథమాశ్వాసము నందు 'మదనస్తుతి—కళావిలాసం' అను శీర్షికను 'పృథుల విశ్వంభరారథమున' అను పద్యము, ద్వితీయాశ్వాసము నందు 'తాంబూలానకు — కళావిలాసం' అను శీర్షికను 'తలపోయంగ' అను పద్యము, తృతీయాశ్వాసము నందు 'విటలక్షణం—కళావిలాసం' అను శీర్షికను 'శ్రీమంతుడు' అను పద్యము, 'భద్రదత్త కూచిమార పాంచాలులు' అను శీర్షిక, అనంతరము, గ్రంథపాఠము తదుపరి ఇంచుమించు ఒకచంపకమాల ఉత్తరార్థం, తదనంతరము 'కళావిలాసము' అను శీర్షికను 'తొడవులు పెట్టు' అను పద్యమును కలవు. మఱి గణపవరపు వేంకటకవి ఆంధ్రప్రయోగరత్నాకరము నందు 'నన్నెచోడ కళావిలాసము' అను శీర్షికను రెండు పద్యములు కలవు. అవి నిమిత్తముగ ప్రబంధరత్నాకరములోని మొదటి మూడు కళావిలాసపద్యములు, 'లలనలు

గొండఱు' అను మఱొక పద్యమును కలిపి, నాలుగు పద్యములను నన్నెచోడుని కళావిలాసములోని పద్యములని ప్రథమతః మానవల్లి రామకృష్ణకవిగారి ప్రతిపాదనము.[13] తదుపరి ప్రబంధరత్నాకరములోని నాలుగు కళావిలాస పద్యములను నన్నెచోడుని కళావిలాసములోని పద్యములని ప్రభాకరశాస్త్రిగారి పరిగణనము.[14] ఆమీద కళావిలాసపద్యములు నాలుగు, 'లలనలు గొండఱు' అను మఱొక పద్యము కలిపి అయిదు పద్యములను నన్నెచోడుని కళావిలాసములోని పద్యములని నిడుదవోలు వేంకటరావుగారి నిర్ణయము.[15] కాని ప్రబంధరత్నాకరములోని కళావిలాసము, ప్రయోగరత్నాకరములోని నన్నెచోడ కళావిలాసము కాదు.

గణపవరపు వేంకటకవి ప్రయోగరత్నాకరము నందు ఇట్లు కలదు—
'వ. ఇందుకే నన్నెచోడ కళావిలాసం—

నగజాత నారదు నుడి వి
నగ లేక్రాగహము జెంది నగ నీహరుఁడు లే
నగవు పెదవి నిగుడఁగ తి
న్నగ పలికెన్ సతికి మునికి నాయము దోఁపన్

* * * * *

వ. ఇందుకే నన్నెచోడ కళావిలాసం—

పాథోనిధి గాంభీర్యున్
రాధాకాముక పదాబ్జరాజత్సేవా
మేధాధుర్యు తపోరా
గాధేయుని మునివతంసు గాధేయు వసిన్'

ఇందు మొదటి పద్యము నందు 'నారదుని మాట విని పార్వతి ఆగ్రహము చెంది నవ్వగా, ఈ శివుడు పెదవి మీద చిఱునవ్వు విరియగ, పార్వతికి నారదునికి న్యాయము తోచునట్లు తిన్నగా పలికెను' అని కలదు. పార్వతికి కోపము వచ్చునట్లు నారదుడు ఆడిన మాట ఏమో, ఈ హరుడు అను వక్త ఎవరో వ్యక్తము కాదు గాని, ఇది పార్వతీపరమేశ్వరులకు, నారదునికి, మఱొక వ్యక్తికి మధ్య నడిచిన వ్యవహారమని వ్యక్తమగును. రెండవ పద్యము నందు

వనము నందున్న గాధేయుని గురించి కలదు. గాధేయుడు తపోరాగాధేయుడు. రాధాకాముక పదాబ్జరాజత్సేవామేధాధుర్యుడు. పాథోనిధి గాంభీర్యుడు. రాధా కాముకుడన కృష్ణుడు కృష్ణుని పాదారవింద ములయందు ఒప్పుచున్న సేవాబుద్ధి కలవారిలో గాధేయుడు శ్రేష్ఠుడని సమాసార్థము. అనగా కృష్ణ భక్తుడని తాత్పర్యము. గాధేయుడన విశ్వామిత్రుడు. విశ్వామిత్రుని కృష్ణ భక్తి అపూర్వము. అట్టి విశ్వామిత్రుని, వనము నందు ఎవరో ఏమో చేసిరనియో, చూచిరనియో రెండవ పద్యమునందు కలదు ఒక పద్యము నందు పార్వతీపరమేశ్వర నారదుల ప్రసక్తి, మఱొక పద్యము నందు కృష్ణ భక్తుడైన విశ్వామిత్రుని విషయము కల 'నన్నెచోడకళావిలాసము' నానాపురాణ కథావిలాస మని అవగాహన మగును. కనుక ప్రబంధ రత్నాకరము లోని 'కళావిలాసము', ప్రయోగ రత్నాకరములోని 'నన్నెచోడ కళావిలాసము' కాదు.

పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరములోని 'కలావిలాసము' కేవలము కామశాస్త్రము తంజావూరి ప్రతిలోని వయి నాలుగు పద్యములు మాత్రమే గాక, నాయొద్ద నున్న ప్రత్యంతరము నందు 'విటలక్షణము' అను శీర్షికను మఱొక మూడు పద్యములు, 'విటశృంగారము' అను శీర్షికను రెండు పద్యములు, 'కుటిలవేశ్యాలక్షణము' అను శీర్షికను ఒక పద్యము, 'వేశ్యమాత' అను శీర్షికను ఒక పద్యము, 'భద్రదత్త కూచిమార పాంచాలురు' అను శీర్షికను ఒక పద్యము, 'చిత్తిని' అను శీర్షికను ఒక పద్యము, 'హస్తిని' అను శీర్షికను ఒక పద్యము, 'శంఖిని' అను శీర్షికను ఒక పద్యము, 'పద్మిని' అను శీర్షికను ఒక పద్యము, 'బాలకు' అను శీర్షికను రెండు పద్యములు, 'యౌవన(కు)' అను శీర్షికను రెండు పద్యములు, 'ప్రౌఢకు' అను శీర్షికను రెండు పద్యములు, 'లోలకు' అను శీర్షికను ఒక పద్యము, 'కూర్మి' అను శీర్షికను ఒక పద్యము మొత్తము ఇరువది పద్యములు కలవు. ఇందు ఏడు పద్యములకు ప్రత్యేకముగ 'కళావిలాసము' అను ఆకరములు లేవు పదమూడు పద్యములకు 'కళావిలాసము' అను ఆకరములు కలవు ఆకరములు లేని ఏడు పద్యములు కళావిలాసములోని పద్యములు కావచ్చును. కాకపోవచ్చును ఇవియెల్ల ఇటీవల ప్రకటించితిని[16] మొత్తముమీద ప్రబంధరత్నాకరములోని కళావిలాసము కేవలము కామశాస్త్రము. 'నన్నెచోడ కళావిలాసము' కామశాస్త్రము కాదు. కనుక ప్రబంధరత్నావళిలోని 'నన్నిచోడు(డు—(కళావిలాసము)' అను ఆరోపము ప్రామాదికము

'ప్రమాదో ధీమతామపి' అని ప్రసిద్ధమైన ఆభాణకము. కనుక ప్రామాదికములను పరిహరించి, ప్రామాణికములను పరిగ్రహించుట కర్తవ్యము.

సూచికలు :

1. ప్రబంధరత్నావళి ప్రథమ ముద్రణము, పీఠిక, పుటలు *xii—xiii*
2. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, సంపుటము 13, సంచికలు 3 — 4, పుటలు 146—49
3. విమర్శతరంగిణి, పుటలు 277—8
4. కుమారసంభవ విమర్శము, పుటలు 3—6
5. ప్రబంధరత్నావళి, ద్వితీయ ముద్రణము, పీఠిక, పు. 19
6. నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీన గ్రంథమా ?!, పుటలు 168—83
7. అదే, పుటలు 184—88
8. స్వీయచరిత్రము, పు 149
9. కుమారసంభవము, ప్రథమభాగము, పీఠిక, పుటలు 3—4
10. అరువలె, పుటలు 306—7
11. అథర్వణుని కృతులు-సమీక్ష, అముద్రితము
12. రెండు వలె, సంపుటము 14, సంచిక 1, పు. 7
13. తొమ్మిది వలె, పుటలు 1—2
14. ఒకటి వలె, పుటలు 57—8; అయిదువలె, పుటలు 41—2
15 అయిదు వలె, పీఠిక, పుటలు 39—40
16. భారతి, మార్చి 1985, పుటలు 45—47

# మా సమాధానము

## డా॥ వేటూరి ఆనందమూర్తి

ఆచార్య కోర్లపాటి శ్రీరామమూర్తిగారు తమ వ్యాసమున ప్రస్తావ వశమున పేర్కొన్న ఒకటి రెండు అంశములకు సంగ్రహముగా మా యీ సమాధాన మవసరమైనది.

1. ''ఇవి ప్రభాకరశాస్త్రిగారు ఇతరత్ర...
కారణము తెలుపుదురుగాక.'' (పు.౯)

''మధ్య 1976వ సంవత్సరమునందు చేరిన పంక్తులు కలవు. అవి ముందు వివరింతును '' (పు.౬) అని తొలుత పేర్కొని పిదప దానినే కొంత విస్తరించి శ్రీరామమూర్తిగారు కారణము తెలుపగోరిరి

మేము మాకడనున్న 1918 *Ed* (28 పుటల పీఠిక+190పు. టెక్స్టు, అనుబంధము+6పు. వివరణ పట్టికగల) గ్రంథవిషయమును అందేగల సూచనల మేరకు, శాస్త్రిగారు ఇతరత్ర సూచించిన 'విషయములతోపాటు, మరికొన్నిటిని తదుపరి గుర్తించిన వాటిని, తగు సూచనలతో, 1976 నాటి పునర్ముద్రణములో 'మనవి మాటలు' తుది పేరాలో విశదముగా పేర్కొన్న విధమున జతపఱచి ప్రకటించితిమి. ఇందు మార్పుగాని, చిత్రముగాని లేదని వ్రాసిన చాలుననుకొందుము. (ప్ర.ర. 1918) అనుబంధము పు. 190లో గల పంక్తులను (ఆ పంక్తులను గ్రంథమునందు చేర్చి చదువుకొనవలసినదిగా శాస్త్రిగారే అందు ముద్రించి యుండిరి. చూ. ఇందే- పు.౨౪)శ్రీరామమూర్తిగారు చూచియుండినచో వారి ఆ సందేహమునకుగాని మా యీ సమాధానమునకుగాని అవసరముండెడిది కాదు. బహుశః వారికడనున్న అచ్చుప్రతిలో ఆ అనుబంధ భాగములు లోపించినవో లేక పరాకున వారావిషయము గుర్తింపలేదో మరి!

2 (*a*) "ప్రబంధ రత్నావళిలోని నన్నిచోడడు (కళావిలాసము) అను ప్రభాకర శాస్త్రిగారి ఆరోపము మాత్రము ప్రామాదికము" (పు.౧౩)

ఈవిషయమే వారి గ్రంథమందును గలదు. వారు ప్రబంధరత్నాకరము వ్రాతప్రతిలో, కళావిలాసము 'నన్నెచోడని కళావిలాసము'గా పేర్కొనబడ లేదని తెల్పిరి ఈ విషయమై హైదరాబాదులోని ప్రాచ్యలిఖితపుస్తకశాలలోని ప్రబంధరత్నాకరము D No.189 - M.No 352 మైక్రోఫిల్మును పరిశీలించితిని. అందు కళావిలాసము నన్నెచోడునిపేర అకు; 108/B ; 142; 144/B లలో కాబడలేదు. కాని శాస్త్రిగారు కాపీచేయించి భద్రపరచుకొన్న మా వ్రాతప్రతిలో అవి నన్నెచోడనిపేర గలదు. చూ. బ్లాకు. పు.119 ఈ విపర్యయమునకు హేతువేమో అరయవలసి యున్నది

(*b*) 'తంజావూరి ప్రతిలోని పదునాఱుగు పద్యములు మాత్రమేగాక ....... ఇందు ఏడు పద్యములకు ప్రత్యేకముగ 'కళావిలాసము' అను ఆకరములు లేవు. పదమూడు పద్యములకు 'కళావిలాసము' అను ఆకరములు కలవు ఆకరములు లేని ఏడు పద్యములు కళావిలాసములోని పద్యములు కావచ్చును, కాకపోవచ్చును. ఇవియెల్ల ఇటీవల ప్రకటించితిని' (పు. ౧౫)

అని మీది విషయమునే పరిశీలించుచు శ్రీ రామమూర్తిగారు 'మొత్తము ఇరువది పద్యము'ల శీర్షికలుద్ధరించిరి. పద్యముల మొదళ్ళీయలేదు.

శాస్త్రిగారి వ్రాతప్రతిలో పై పద్యముల ప్రక్కన వారానాడు సూచించిన విషయము లివి గ్రహింపదగినవి. శ్రీరామమూర్తిగారు పై పద్యములు 'కళావిలాసము'లోని పద్యములు కావచ్చును కాకపోవచ్చును' అని వ్రాసినవాటిలో ఒకటి ఎఱ్ఱయ కొక్కోకమందలివి, మరికొన్ని సింగయ కవికర్ణము నందలివి.

(6—12—1916: 15—12—1916 నడుమ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాయించుకొన్న ప్రబంధరత్నాకరము (తంజావూరి) గ్రంథవిషయముగల నోటుపుస్తకాలు (మూడు) మా గ్రంథాలయమున కలవు. అందు నన్నెచోడని కళావిలాసమును గూర్చిన విషయము లిట్లున్నవి.

బుక్ 1–పుట 25 మదనస్తుతి–అను శీర్షిక క్రింద (చిమ్మపూడి అమరేశ్వరుడు–విక్రమసేనము-'గొనయము తమ్మినూల్' అను పద్యము తర్వాత) "నన్నెచోడుని కళావిలాసము"–సీ॥ పృథుల విశ్వంభరారథమున కెమరుగా.... అని కలదు.

బుక్–3–పు. 119. భుక్తికి—అను శీర్షిక తర్వాత తాంబూలము– "కళావిలాసము– చోడుడు."

తలపోయఁగరుచులాబుడు

(చారుచర్య)—వడన ఎకాస సౌరభ....

లఘుకారి క్రిమిదోష....

[పు. 151 విట షణము- న్నెచోడుడు-కళావిలాసము] - శ్రీమంతుఁడు గణవంతుఁడు.

(విటశృంగారము)-సీ॥ సౌరకంపుఁ(గ)లువ(గ)క మిగుల వెచ్చనగాక.
(ఈ పద్యం ఎఱ్ఱయ కొక్కోక శాస్త్రమందు గలదు. ఆ-౨–3)
(కువిటుడు.) ఎఱ్ఱాప్రెగ్గడ - కుమారనైషధము
సీ॥ అడియాసలేకొల్పి....

(వేశ్యాలక్షణము)—[కవికర్ణము. (4–121)]
సీ ధనమాన వేళాంటు దలఁపదయేనది

జఃజలోచనకు నౌషధపుఁగూర్మి

(కుటీవేశ్యలు) (ఈశీర్షిక 'కుటీవేశ్యలు' — వేనినిశ్రీరామమూర్తిగారు 'కుటిలవేశ్యలు'గా గుర్తించిరి. చూ. పు.౧౫)
[కవికర్ణము (4—94)]
సీ. మడమలు మోయంగ మైలచీరలు కట్టి.

[వేశ్యమాత - కవికర్ణము (4-109)]
భావింపదర్ధపు.

భావజు విడిచిన పాడింటివై బొర్లి.
[110 -111 మధ్య కవికర్ణములో నొక గీత పద్యము గలదు]

చదురులు లే వ లేతువులు....

'........డియతం దరుదేరఁ గాంచియుం

దడవకయుండ నెప్పటివిధంబని కౌఁగిటఁజేర్చ నంతకున్'.

(భద్ర ద త్తక కూచిమార పాంచాలురు-)

(కళావిలాసము)

తొడవులువెట్టి....

లలనలు కొందరాత్మపరు....

[సింగయ కవికర్దము]

పాయనివేడ్కలై.

ప్రయోగరత్నాకరమువందలి ''నన్నెచోడుని కళావిలావము - 'పాథో నిధి''- వంటి పద్యములను ప్రభాకరులు (చూ.పు.౫౫) గుర్తించియు తమ సంకలనమున జేర్చుకొనలేదు.

*  *  *

శాస్త్రిగారి వాక్యములివి గుర్తింపదగినవి:

"ప్రయోగరత్నాకరము, రంగరాట్ఛందము.... పద్యములను గూడ నీ కూర్పునందుఁ జేర్పఁ జూచితినిగాని యాలోచింపఁగా వందసత్యతాసంశయము సంఘటిల్లెను.... సందిగ్ధములగు పద్యభాగము లట్లే నిల్పితిమి. ప్రయత్నపూర్వకమగు విపర్యయ మిం దేదియు నుండదు."

(ప్రబంధరత్నావళి పుట - 10-32)

*  *  *

''కళావిలాసము'' పేరు గలవి రెండు భిన్న గ్రంథములా? ఒకే గ్రంథమా

కళావిలాసకర్త నన్నిచోడడు కాడా?

కళావిలాసము నుండి లభ్యమగుచున్న పద్యములు మొత్తమెన్ని?

ప్రబంధరత్నావళిలో శ్రీరామమూర్తిగారు గుర్తించిన విపర్యయమునకు హేతువేమి? ఇవి పరిశీలింపవలసిన అంశములు.

# నన్నెచోడుని కుమారసంభవము కూటసృష్టియా?

## తీర్థం శ్రీధరమూర్తి

[18, నవంబరు 1800 నాటికి పూర్వము నుండి తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయమున కుమార సంభవము యొక్క తాళపత్ర గ్రంథము కందు. అనగా మానవల్లి రామకృష్ణకవిగారి జీవితకాలమునకు (క్రీ.శ. 1866 – 1957) పూర్వము నుండి నన్నెచోడుని కుమార సంభవ తాళపత్రగ్రంథము సరస్వతీ మహలు గ్రంథాలయములో నుండునట్లు కరబడరము. సం].

మానవల్లి రామకృష్ణకవిగారు 'విస్మృత కవులు' అను శిరోనామము క్రింద పెక్కు అపూర్వ గ్రంథరత్నములను వెలుగులోనికి తెచ్చి, సాహితీ రసికుల కృతజ్ఞతకు పాత్రులైరి. ఆ గ్రంథములలో నన్నెచోడుని కుమార సంభవము ఒక అనర్ఘ మణి. ఈ గ్రంథము రెండు భాగములుగ ప్రకటింపబడినది. ప్రథమ భాగము 1909వ సం॥లోను, ద్వితీయ భాగము 1914వ సం॥లోను ముద్రింప బడినవి.

నన్నెచోడుని కుమారసంభవము వెలువడిన వేళా — విశేషమెట్టిదో కాని ఆ గ్రంథముపై వెలసినంత విమర్శ ఆంధ్రసాహిత్యములో మఱియే యితర గ్రంథముపైనను వెలువడి యుండలేదని తోచుచున్నది. కుమారసంభవము "గూఢ వస్తుమయ కావ్యము" (1–21) గా సంతరింపబడియుండుటయే దీనికి కారణము కావచ్చును!

నన్నెచోడుడు నన్నయభట్టుకంటె ప్రాచీనుడా? నన్నెచోడుని దేశకాలాదు లేవి? నన్నెచోడుడు శివకవియా? నన్నెచోడుని గురువు, కృతిపతియైన మల్లికార్జున

యోగి యెక్కడివాడు? కుమార సంభవమును నన్నెచోడుడే రచించెనా? కుమార సంభవమునకు గల మూలప్రతులెన్ని? వానియునికి యెక్కడ? ఇత్యాది జటిల ప్రశ్నలపై తర్కవితర్కములు చాలకాలముగ సాగుచునే యున్నవి.

ప్రకృతము మిత్రులు డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు సుదీర్ఘకాలము (1956-1983) గాఢ పరిశ్రమము గావించి, నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీన గ్రంథమా?![1] అను బృహద్విమర్శగ్రంథమును ఒక దానిని విరచించి యున్నారు. ఆ గ్రంథము యొక్క స్వరూపము స్థూలముగ తెలియుటకై యందలి విషయ సూచిక చూపబడుచున్నది.

ప్రధాన గ్రంథము :

1. కుహనావాదము, 2. కృతక రచనము, 3. కుటిల శృంగారము, 4. కూడలి స్థలము, 5. కృత్రిమ పాఠము, 6. కూటసృష్టి.

**అనుబంధములు :**

1. నన్నెచోడ కళావిలాసము 2. మోహనాంగి మారీచీ పరిణయము, 3. సరస్వతీ మహలు గ్రంథాలయము – సంగ్రహ చరిత్ర, 4. కవిగారి కతిపయ పద్యములు, 5. సూచికలు, 6. ప్రసక్త గ్రంథ పట్టిక, అభిప్రాయములు. గ్రంథ మందలి పుటల సంఖ్య 309.

పై విమర్శ గ్రంథములో అనేక విషయములు చర్చింపబడియున్నవి. వానిలోనెల్ల నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీన గ్రంథము కాదు; అది మానవల్లి రామకృష్ణకవిగారి కూటసృష్టి యని రాద్ధాంతము గావించుటే ప్రధాన విషయమై కనుపట్టుచున్నది. కావున ప్రధానమల్లనిబర్హణ న్యాయానుసారముగ ఆ విషయమై నాలుగు మాటలు వ్రాయుట ఈ రచనయొక్క ప్రధానోద్దేశమై యున్నది. కాబట్టి మొదట విమర్శ గ్రంథమందలి ప్రధానాంశములను పేర్కొని, తరువాత వానికి యథావకాశము సమాధాన మొసగబడుచున్నది.

---

1. రమణశ్రీ ప్రచురణము. నెం 1 సీ సేండ్స్ క్వార్టర్స్, ఆంధ్రా యూనివర్సిటీ, విశాఖ పట్టణము, 1983.

(1) కుమార సంభవము కూటసృష్టి :

''ఒక నన్నెచోడుడు అను పూర్వకవి కలడనుటకు, అతని కృతి కుమార సంభవము అను పూర్వ కావ్యము కలదనుటకు, ఒకానొక ఆధారము లేకుండ ''నన్నెచోడుని కుమార సంభవము''ను కూటసృష్టి చేయుట సంభవము కాదు. గత శతాబ్దియందు కావలి వేంకట రామస్వామిగారు ప్రకటించిన దక్కను కవుల జీవిత చరిత్ర రేఖలు అను గ్రంథమునందు మోహనాంగి అను పూర్వ కవయిత్రి కలదని, ఆమెకృతి మారీచి పరిణయము అను పూర్వకావ్యము కలదని ఆధారము కలదు. కావున వర్తమాన శతాబ్దియందు సెట్టి లక్ష్మీనరసింహముగారు ''మోహనాంగి మారీచీ పరిణయము''ను కూటసృష్టి చేయుట జరిగినది. అది కూటసృష్టి కాదని, కృష్ణదేవరాయల కూతురు మోహనాంగియే రచించినదని ఇటీవల ఒక వాదము తలయెత్తినదని గాని నిలువలేదు, అంతేకాదు, శ్రీనాథుడు రసికుడు అను జనశ్రుతి ఆధారముగ ''శ్రీనాథుని రసికాభిలాషము''ను సెట్టి లక్ష్మీనరసింహము గారి కూటసృష్టియే. అట్లు ప్రబంధరత్నాకర బాలబోధచంద స్సర్వలక్షణసారములు ఆధారముగ ''నన్నెచోడుని కుమారసంభవము''ను మానవల్లి రామకృష్ణకవిగారి కూటసృష్టి అగుట సంభవమే'' (విమర్శ, పుట, 228)

సెట్టి లక్ష్మీనరసింహముగారి మోహనాంగి మారీచీ పరిణయము, శ్రీనాథుని రసికాభిలాషములవలె నన్నెచోడుని కుమారసంభవము కూటసృష్టి యనుటకు వీలు లేదు. మారీచీ పరిణయము నుండియు, రసికాభిలాషము నుండియు పద్యములను లాక్షణికులుగాని, కవులుగాని యెక్కడను సముద్ధరించి యుండలేదు. ఆ గ్రంథములు రెండును కేవలము నామమాత్రావశిష్టములు కుమారసంభవము అట్టిది కాదు. నన్నెచోడుని నామమును, అతని కుమార సంభవనామమును, ఆ కావ్య మందలి పద్యములను కొందరు లాక్షణికులు, కవులు తమ తమ కృతులయందు పేర్కొనియున్నారు. ఈ విషయమును ఒక విధముగ విమర్శకులును అంగీకరించి యున్నారు. చూడుడు !

''కవి సంజీవనియందు కలదన్న విషయము, ఛందస్సు లేక బాలబోధ ఛందస్సు లేక సర్వలక్షణసారము అను ఒక అర్వాచీన లక్షణ గ్రంథమునందు కలదు. అందు "నన్నెచోడుని కుమార సంభవములోని" అను ఎత్తుగడ లేదుగాని,

"కుమారసంభవం" అను ఉపక్రమణిక ఉన్నది. రంగయ (?) సర్వలక్షణసారము అను మఱొక అర్వాచీన లక్షణ గ్రంథమునందు ఇట్లు కలదు.

వ. "నన్నెచోడుని కుమారసంభవము.

కం. నెఱి గలిగి నాడునాటికి
గుఱి గడపన్ జేసి జఘనకుచ కచభరముల్
చిఱుదొడలు నడుము నల్గును
విఱిగెడినో యనుచు గిరిజ వెరచుచు నడువన్."

ఇక పెదపాటి జగన్నాథకవి ప్రబంధ రత్నాకరమునందు ఇట్లు కలదు.

"నన్నె చోడ కుమార సంభవము.

మ. హరినీలోపమ మధ్యకేశి శశిబింబా స్యోష్ఠరాజీవకే
సరనేత్రామల గంధి విద్రుమలతాసద్వర్ణ తన్వంగి సిం
ధుర కుంభాలసయానపూర్ణరుచి సంస్తుత్యారుణజ్యాంఘ్రికం
ధరశైవాత్మజ చెప్పనొప్పదె సుధా ధర్మార్థ చూడామణీ,

క. నెరి గడిచి నాడునాటికి
గురి గడవంగ బెరిగి జఘనకుచ కచభరముల్
చిరు తొడలు నడుము నర్గును
విరిగెడినో యనుచు గిరిక వెరచుచు నడిచెన్." (పుట—౩)

దీనిని బట్టి చూడగా నన్నెచోడుని కుమారసంభవము, అందలి పద్యములు కవిలాక్షణికులచే పరిగ్రహింపబడినట్లు స్పష్టమగుచున్నది. ఇట్టి భాగ్యము మారీచీ పరిణయ రసికాభిలాష కృతులకు గలదా ?

పైవానిలో బాలబోధచ్ఛందస్సు నా దృష్టి గోచరము కాలేదు. కాని రంగయ సర్వలక్షణసారము, పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరము అను

రెండు గ్రంథములును[2] తంజావూరి సరస్వతీ మహలు గ్రంథాలయమున గలవు. వీనిలో స్పష్టముగ నన్నెచోడుని కుమార సంభవములోని పద్యములు ఉదాహరింప బడి యున్నవి. కాని విమర్శకులు పై గ్రంథములను ''అర్వాచీనములు'' అని ఒక్కమాటతో కొట్టిపారవైచిరి. అర్వాచీనమనగా మానవల్లి రామకృష్ణకవిగారి సమకాలమున వెలసిన గ్రంథమని భావమా యేమి ? చూడుడు !

పెదపాటి జగ్గన (జగన్నాథకవి) ప్రబంధరత్నాకరమను సంకలన గ్రంథ మును సంతరించి పెట్టెను. అందులో ఆ కవిప్రశక్తి యిట్లు కలదు.

సీ. శ్రీ పెదపాటి పురీపాల గోపాల
  కృష్ణ ప్రసాదిత శ్రీల వెలసి,
ఘన వైష్ణవమతజ్ఞ కందాళ తిరుమలా
  చార్య కృపాకటాక్షమున నలరి,
కావ్యలక్షణ లక్ష్య గణితాదిసత్కళా
  ప్రజ్ఞా విశేష వైభవము గలిగి,
రాజ విద్వత్సభా రసిక బాంధవ మాన
  నీయ ధర్మాచార్య నియతి మెరసి,

తే. మల్ల ప్రెగ్గడ వీరనామాత్యపుత్రి
రామ, నభిరామ, గుణధామ, రామనామ
కామనీ మణిఁ బెండ్లియై ఘన గృహస్థ
మహిమ చెన్నొందు జగ్గన మంత్రి వరుడు.

వ. ..... ..... ..నవ రసోత్పత్తియు నను వర్ణనంబులంగల్గ కవీంద్ర కావ్య నామంబులతో వివరించెద. (కేటలాగు, పు.. 409)

ప్రబంధరత్నాకరమను పై సంకలన గ్రంథమున కవీంద్ర కావ్యనామ ములతో ఆయా పద్యములు గ్రహింపబడి యున్నవి. వానిలో కుమారసంభవము లోని పద్యములు కవి నామాంకితముగ చూపబడినవి. ఈ జగన్నాథకవి అర్వాచీన

2. చూ. డి. నం. 714, 189. మొదటిది లక్షణ గ్రంథము. రెండవది సంక లన గ్రంథము.

కవియగుటకు వీలులేదు. ఇతడు కందాళ తిరుమలాచార్య శిష్యుడు. పైగా రాజా స్థానమున మత గురువు. మానవల్లి రామకృష్ణకవిగారు జగన్నాథకవిని ప్రాచీన కవిగా నిట్లు పేర్కొనియున్నారు.

"(మడికి సింగన యొక్క సకలనీతి సమ్మతమునకు) పిదప క్రీ. శ. 1620లో జగన్నాథకవి రత్నాకరమను గ్రంథమున ప్రాచీన పద్యముల నెత్తి యోజపఱచి యైదాశ్వాసముల కృతి రచించెను"

(ప్రబంధమణి భూషణము, పీఠిక, పుట -2)

"నూతన కవి సూరన ధనాభిరామమను కావ్యమును రచించెను. 1620లో రచింపబడిన రత్నాకరమున వీనిలోని పద్యములుదాహృతములయ్యెగావున, నితడు (నూతన కవి– సూరన) తత్పూర్వుడు" (అందే, పుట 7).

ఈ విధముగా నిర్ధరింపబడిన పెదపాటి జగన్నాథ కవి ప్రాచీన కవి యనుటకు సందియము లేదు. ఈ కవి సంతరించిన పద్యములలో నన్నెచోడుని కుమారసంభవములోని పద్యములు చేరియుండుటచే నన్నెచోడుని కుమారసంభవము క్రీ. శ. 1620 కంటె ప్రాచీనమైన గ్రంథమని అంగీకరించుటకు సందియ మేమున్నది ?

(2) తాళపత్ర గ్రంథము—స్వరూపము :

"తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయములోని తెలుగు తాళపత్ర గ్రంథముల కట్టలపైన—క్వాచిత్కముగ లోపల—తాళపత్రములమీద లిఖించిన ప్రాచీన నవీన ముఖ పత్రికలు కలవు. ప్రాచీన తాళపత్ర ముఖపత్రికలయందు తాళపత్ర గ్రంథము పేరు, లిపి, వివరము, తాళపత్రముల సంఖ్య, తాళపత్ర గ్రంథసంఖ్య గ్రంథ సమగ్రతాసమగ్రత, ప్రక్రియా విశేషముతోపాటు ప్రత్యేక ముగ ఇట్లు కలదు.

"నళనామ సంవత్సర చైత్ర శుద్ధ ప్రతిపదా భానువారం మధ్యస్థులు సేనాధురంధర రాజశ్రీ రామయ్య వరహప్పయ్య దీక్షితులు — వారి యాజ్ఞా ప్రకారం ... రుజు ...."

ఇందలి నలనామ సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమీ ఆదివారము సరిగా 6-4-1856 వ తేదీ. ఇట్టి ప్రాచీన తాళపత్ర ముఖ పత్రిక గల తెలుగు తాళపత్ర గ్రంథము 1856వ సంవత్సరమునాటికి తంజావూరు సరస్వతి మహలు గ్రంథాలయమునందు ఉండుట తథ్యము. మఱి "నన్నెచోడుని కుమార సంభవము" తాళపత్ర గ్రంథము కట్టపైనగాని, లోపలగాని ఇట్టి ప్రాచీన తాళపత్ర ముఖపత్రిక లేదు. నవీన తాళపత్ర ముఖ పత్రిక కలదు. అందు ఇట్లు కలదు.

*Telugu* ***D*** 152 నన్నెచోడ కుమారసంభవమ్,

169 పద్యకావ్యం కుమార సంభవము (దేవనాగరలిపిలో ఈ వ్రాత కలదు) *Kumara Sambhavamu by*

***Complete*** *Nannechoda*

ఇది చూడగానే ఇటీవలి తాళపత్ర ముఖ పత్రిక అని తెలియును. ఇందు ***D*** 152 అనగా ***Descriptive Catalogue No.*** 152 వివరణ పట్టికలోని క్రమ సంఖ్య. అది 1933 వ సంవత్సరమునందు ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ప్రకటించినది. అందు 152 వ క్రమసంఖ్య "నన్నెచోడుని కుమార సంభవమే" కనుక నవీన తాళపత్ర ముఖ పత్రిక లేఖన కాలము స్థూలముగ 1933 వ సంవత్సరము తదనంతరమును కావచ్చును. కుమారసంభవము తాళపత్ర గ్రంథము కట్టపైన గాని, లోపలగాని ప్రాచీన తాళపత్ర ముఖ పత్రిక లేకపోవుట ప్రాగభావమా ? ప్రధ్వంసాభావమా ? అను ప్రశ్న వ్యర్థము. ఇది యెల్ల 1912 వ సంవత్సరము కంటె పూర్వము తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయమునందు కుమార సంభవము తాళపత్ర గ్రంథము లేదనుటకు నిర్ధారక సాధనము" (విమర్శ, పుటలు 189–190)

కుమార సంభవముయొక్క తాళపత్ర గ్రంథము కట్టపై ప్రాచీన తాళపత్ర ముఖ పత్రము లేకపోవుటచే ఆ గ్రంథము 1912 వ సంవత్సరము కంటె పూర్వము తంజావూరు గ్రంథాలయమున లేదనియు తరువాత చేరినదనియు, కావున నవ్యమనియు ఆక్షేపము.

ఇక్కడ కొంత వివరణము కావలసియున్నది

1. ప్రాచీన ముఖ పత్రము లేకుండుటకు కారణము.
2. గ్రంథమున మఱియేదైన ప్రాచీనతను తెల్పు సాక్ష్యమున్నదా ?

పై రెండు విషయములను విమర్శింపవలసియున్నది, వరాహప్పయ్య నాటి కాలమున ప్రతి తయారైయుండినచో విమర్శకులన్నట్లు ఆ కాలమునాటి ముఖ పత్రము తప్పక యుండవలసినదే.అట్టి ముఖ పత్రము శ్రీరాఘరామము మొదలగు తాళపత్ర గ్రంథములపై గలదు.తంజావూరిని శివాజీ శరభోజి రాజులు పాలించు కాలములో ఆ రాజులపట్ల వరాహప్పయ్య దీక్షితులు ప్రత్యేక మంత్రి పదవిలో నుండి ప్రాచీన తాళపత్ర గ్రంథముల నుద్ధరించెను. లనగా మూల మాతృకలకు పుత్రికలను (కాపీలను) వ్రాయించెను. అట్టి పుత్రికలపై మాత్రము అతని పేర ముఖ పత్రములు వెలసినవి. దీనికా ముఖ పత్రములోని వ్రాతయే సాక్షి. మరియొక ఆధారము.

"His profound learning in Sangeetha and Sahitya, mastery over fine arts, convinced the aharaja who Mplaced the supervision of the Saraswathi Mahal Library in his care. There are many manuscripts which have been copied and transcribed under the orders from Sevadhurandhara Varahappa Diksit Pandit as evidenced by the fly leaf[3].

దీనిని బట్టి తేలుసదేమనగా, వరాహప్పయ్య దీక్షితుల కాలములో ఏ ప్రతులకు పుత్రికలు వెలసినవో వానికి మాత్రమే నాటి ముఖపత్రములుండునని తెలియు చున్నది. నన్నెచోడుని కుమార సంభవము కట్టపై నాటి ముఖపత్రము లేకపోవుట వలన అది ఆ కాలమున తయారైనది కాదని విశదమగుచున్నది కదా ! ఇక కుమార సంభవము ప్రతిలో దాని ప్రాచీనతను తెలుపు సూచనయేమైనను కలదా ? అని విచారింతము.

---

3. Tanjur as a seat of Music, Page 258, Dr. S. Seetha, Head and Prof. of Indian Music, University of Madras 1981.

నన్నెచోడుని కుమార సంభవము యొక్క తాళపత్ర గ్రంథములో 54వ పత్రము యొక్క రెండవ ప్రక్క ఆరవ ఆశ్వాసాంత గద్యమునకు తరువాత పని వ్రాలు ఇట్లు గలదు.

"శ్రీమద్రాజాధిరాజ మహారాజ శహాజి రాజ సాహెబ్ సార్వభౌమస్య విజయోస్తు. యిష్టార్థాస్సంతు, భవానీ శంకర కృపయా ఆయుష్యాభివృద్ధిరస్తు".

దీనినిబట్టి నన్నెచోడుని కుమారసంభవప్రతి శహాజీ కాలమున వ్రాసినట్లు విదితమగుచున్నది. శహాజి కాలము క్రీ. శ. 1684-1710. అందుచేత నన్నె చోడ కుమారసంభవ తాళపత్ర గ్రంథము 18వ శతాబ్దమునాటిదని, నిర్ణయమగు చున్నది.

నన్నెచోడుని కుమారసంభవముయొక్క తాళపత్రగ్రంథము ప్రాచీనమైన దనుటకు మఱొక యాధారము కూడ ఆ గ్రంథాలయముననే కనుపట్టుచున్నది.

## (3) గ్రంథ పట్టికలు

"తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయమునందు గ్రంథ పట్టికల తాళపత్ర సంపుటములు రెండు కలవు. ఒకటి "రౌద్రి నామసంవత్సర మార్గ శీర్ష శుద్ధ విదియా మంగళవారము" అనగా 18—11—1800 తేదిని తయారు చేసినట్లు అందే కలదు. అది కేవలము సంస్కృతగ్రంథ పట్టిక."

(విమర్శ, పుట, 188).

ఇక్కడ ఒక విచిత్రము జరిగిపోయినది. కేవలము సంస్కృత గ్రంథ పట్టిక అని భావింపబడు 18—11—1800 నాటి పై తాళపత్ర గ్రంథ పట్టికలో సునిశిత పరిశీలన లోపము వలన కావలయును, సంస్కృత కుమార సంభవము అను భ్రాంతితో (నన్నెచోడుని) కుమారసంభవము యొక్క తాళపత్ర గ్రంథము చేరిపోయినది. ఆ కారణము చేతనే కందుకూరి వీరేశలింగంపంతులుగారికి పంప బడిన తెలుగు గ్రంథముల జాబితాలో నన్నెచోడుని కుమారసంభవము వదలి

పోయినది [1] ఆ సంస్కృత గ్రంథ సూచికను తయారు చేసిన వి. సమీరీతిగా అందులో నున్నది.

“రౌద్రీ సంవత్సరము మార్గ శీర్ష శుద్ధ ద్వితీయాయాం అంగారకవారం మధ్యస్తులు వేదమూర్తి గంగాధర భట్లు సదాశివభట్లు లాంఛిగె వారి అధికారమందు

---

1. వీరేశలింగము పంతులుగారు తెలుగు గ్రంథముల పట్టికను తప్పించుకొని తరవాత కొన్ని సంవత్సరములకు తామే వెళ్ళి కుమార సంభవాది కావ్యములను చూచినట్లు శ్రీశాస్త్రి గారికి వ్రాసిన లేఖలో వ్రాసినారు. వదలిపోయినట్టు వారంటు పేర్కొనరు. ఈ వార్తను మేము ప్రకటించిన పిదప — 1870 సం॥ నందు పంతులుగారు దానిని చూచు సందర్భము లేదని వ్రాయుచు 'తెలుగు పుస్తకముల పట్టిక' యందు 'నన్నెచోడుని కుమార సంభవము' ప్రసక్తిలేదని, వీరేశలింగముగారు 'కుమార సంభవ-ని కావ్యమును చూడ' లేదని అవగాహన మగును - అని కొర్లపాటి శ్రీరామమూర్తి గారు వ్రాసినారు. (చూ. నన్నెచోడుని కుమార సంభవము ప్రాచీన గ్రంథమా — పు. 186). ఈ విషయమై మఱి కొంత సమాచార మందించిన శ్రీరామమూర్తి గారి 'తథ్య మిథ్యా వివేచనము' వ్యాసమును ఈ యూ సంచికలోనే (పుట. [illegible]) చూడనగును. వీరేశలింగము పంతులు గారి లేఖలోని అంకెను మేము 1870గా చదివితిమి. ఆ భాగము ని పత్రికలో ముద్రించినాము. (చూ. బ్లాకు). ఆ అంకె 1890 కూడా కావచ్చును. అప్పుడు '1885వ సంవత్సరమందు మాత్రమే తదావశ్యకము కలదు.' అని విమర్శకులంగీకరించిన వివరణతో సంపదించును. ఆ గ్రంథమందు నాడు వారికి 'శ్రద్ధలేకపోవుట'యే కవుల చరిత్ర (1889)లో దాని 'పేరెత్త' కుండుటకు హేతువు కావచ్చును. ఇంతకూ కవిగారు దానిని 1909లో ప్రకటించిన పిదపనే కదా ఆ కావ్య ప్రశస్తిని లోక మెఱిగినది!

ప్రస్తుత విషయ మదికాదు, వీరేశలింగము గారు తంజావూరు వెళ్ళి కుమార సంభవమును చూచినట్లు వ్రాసిన సంవత్సర మది (లేఖను బట్టి) 1870 కాక 1890 అయినను (చిలకమర్తి) వారందిచ్చిన సమాచారమును బట్టి 1896 అయినను) అది విమర్శకులన్న 1912 సం॥ కన్న పూర్వమే కుమార సంభవ గ్రంథమచట కలదను విషయమును విశదీకరించుచున్నదని మనవి.

—మణి మంజరి సంపాదకులు.

తాళపత్ర పుస్తకాలు రుజువుజూచి వ్రాసిన వివరం రామాయణం పేటి పుస్తకాల్కు లెఖ వివరం.''

ఇందులో రామాయణం పేటి పుస్తకాలు అనగా రామాయణము మొదలగు కావ్యములు గల పెట్టె అని భావము. ఆ పెట్టెలో "కుమారసంభవము'' సంస్కృత కావ్యమను దృష్టితో ఆ సంస్కృత తాళపత్ర గ్రంథ సూచిక యొక్క 7వ ఆకులో, పద్యకావ్యము అను శీర్షిక క్రింద నిట్లున్నది :

1. పద్య కావ్యం. కుమార సంభవం.
   తెలుగులిపి. ఆకులు 127.
   పూర్తి 189. (క్రమ సంఖ్య)

పై కుమార సంభవమే నన్నెచోడుని కుమార సంభవమని ఎట్లు భావింప వచ్చునని కొందరికి సంశయము కలుగుట సహజము. తంజావూరు గ్రంథాలయము లోని తెలుగు గ్రంథములకు ఒక ముద్రిత వివరణ గ్రంథ పట్టిక కలదు. దాని వివరము లివి. **Descriptive catalogue of the Telugu manuscripts in the Tanjore saraswathi mahal library, waltair, 1933.**

పై ముద్రిత వివరణ గ్రంథ పట్టిక సూచనమైనది. అందు 33వ పుటలో నన్నెచోడుని కుమారసంభవమును గూర్చి యిట్లు పరిచయము గలదు.

152. కుమారసంభవము (నన్నెచోడుడు)

**M**. 189. 161/4 × 1¼, 127, 1 - 126 సమగ్రము.

పై వివరణములో **M.** 189 అనగా **Manuscript No.** 189. ఈ సంఖ్యయే మొదట చెప్పబడిన సంస్కృత తాళపత్ర గ్రంథ సూచికలోని గ్రంథ క్రమసంఖ్య మరియు 127 అను సంఖ్య ఆ గ్రంథములోని పత్ర సంఖ్యను తెలుపు చున్నవి. కావున కుమార సంభవము యొక్క గ్రంథక్రమ సంఖ్యయు, పత్ర సంఖ్యయు కూడ ముద్రితాముద్రిత గ్రంథ పట్టికలయందు సమానముగ కనబడు చుండుటచే రెండును ఒక గ్రంథమనుటకు సందేహము లేదు. ఆ ప్రాచీన సంస్కృత తాళపత్ర గ్రంథ పట్టిక 15-11-1800వ తేదీన తయారుచేసినట్లు

(విమర్శ పుట 188) విమర్శకులంగీకరించుచున్నారు. కావున నన్నెచోడుని కుమారసంభవము యొక్క తాళపత్ర గ్రంథము 18–11–1800 నాటికి పూర్వమునుండి తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయమున కలదనుటకు ఇంతకంటె ప్రబల సాక్ష్యమేమి కావలసి యున్నది? 152 సంఖ్యా వర్ణనాత్మక గ్రంథ పట్టిక తయారుచేయు సందర్భమున క్రొత్తగా ఒసగబడినది. అందే కల 189 అను సంఖ్య ప్రాచీన తాళపత్ర గ్రంథసూచికయందలి క్రమసంఖ్యకు జ్ఞాపిక యని గుర్తుంచుకొన వలయును. ఇది కీలకము. సారాంశమిది. 152 గ్రంథసంఖ్య నూతనముగా ఒసగబడినది. 189 సంఖ్య వ్రాతప్రతియొక్క ప్రాచీనతను తెల్పుచున్నది కావున తాళపత్ర గ్రంథము ప్రాచీనమైనదని తెలివిడి.

## (4) తాళపత్ర గ్రంథమునకు మూలము ముద్రిత గ్రంథము :

''తంజావూరి ప్రతి కవిగారి అచ్చుప్రతికి అనుసరణమనియే అనిగాహన మగును" విమర్శ, పుట, 176).

మానవల్లి రామకృష్ణకవిగారు నన్నచోడుని కుమారసంభవమును ప్రకటించిరి. ఆ ముద్రిత ప్రతిని ఆధారముగా గొని తాళపత్ర గ్రంథము తయారు చేయబడినదని ఒక నిందారోపణము కలదు. ముద్రితములైన గ్రంథముల యొక్క పరిచయము అందరికి కలదు. కాని తాళపత్ర గ్రంథములోని లేఖన విధానము కొందరికి మాత్రము పరిచయము. సరస్వతీ మహలు గ్రంథాలయములోని నన్నెచోడుని కుమారసంభవము యొక్క వ్రాతతీరు తెలిసినగాని అది ముద్రితగ్రంథమునకు అనుసరణమా? కాదా? యని నిర్ణయింపరాదు. ప్రకృతము తంజావూరు ప్రతిని తెచ్చి చూపుటకు వీలులేదు. కాని ఆ తాళపత్ర గ్రంథమును యథాతథముగ వ్రాయించి పెట్టుకొన్న నిడుదవోలు వెంకటరావుగారు అందుండి యుదాహరణములను చూపుచు ఆ ముద్రితాముద్రిత గ్రంథముల స్వరూపమునిట్లు విశదము చేసియున్నారు.

తాళపత్ర ప్రతిపాఠము :

1. ఆ. 122 వ పద్యము.

''హరిం దన గర్భమునం జరాచరమను
విశ్వంబు దాల్చి చనువాని సితె తీర—[లవిశేషించ్చుచు

ధర్మార్థ కర్మార్థ ఫలభోగాస్పదం] మణివోలె ధరించిన శరనిధి
పెంపెరికైనం జనునె పొగడదను''

ముద్రిత ప్రతి పాఠము.

క. హరి దన గర్భమునం జరా
చరమయ విశ్వంబు దాల్చి చనువాని సితే
తరమణి వోలె ధరించిన
శరనిధి పెంపేరికె నం జనునే పొగడన్.

మచ్చుకు చూపితినిగాని కుమారసంభవమున ఆదినుండి అంతమువరకును వ్రాత యిట్లే యుండును.... ఇప్పటికి 41 యేండ్ల క్రిందట తంజావూరి తాళపత్ర మాతృకనుండి యథామాతృకముగ వ్రాయబడిన ప్రతి నా వద్ద గలదు.[4]

బ్రాకెట్టులోని భాగము పద్యమునకు తరువాతవచ్చు వచన భాగములోనిది. వ్రాత ప్రతి పాఠమునకును, ముద్రిత ప్రతి పాఠమునకును గల విభేదము అజగజాంతరము. ఎవరికైనను నన్నెచోడుని కుమార సంభవ ముద్రిత ప్రతిలోని పాఠములు చూచి తాళపత్ర గ్రంథమును తయారుచేసినట్లు భావింప ఏమైన పోలికలు కనుపట్టుచున్నవా? అసలు తాళపత్ర గ్రంథము లందలి వ్రాత విలక్షణ మైనది. చదువరులకు క్లేశజనకమైనది. అందులకే మానవల్లి రామకృష్ణ కవిగా రొకచో నిట్లు వ్రాసికొన్నారు.

''అల్పజ్ఞుడగు నా యట్టివాడు అజ్ఞానముచేత లేఖక దోషముల గుర్తించి ముద్రింప జాలకున్నను కేవలము తాళపత్రములలోని పతనక్రమమును పోగొట్టి దీనిని సర్వజన హస్తగతము చేసినందుకే యించుక సంతోషింతురుగాక,'' (కుమార సంభవము, ద్వితీయ భాగము, పీఠిక, పుట 39)

4. మానవల్లి కవి రచనలు, ని. వెం. గారి పీఠిక, పు. 12, ఆం. సా. అకాడమి, హైదరాబాదు, 1972.

5. అపవ్యాఖ్యానము :

అలి ధమ్మిల్ల మృణాళహస్తఁ గమనీయావర్తనాభిన్ మహో
త్పలగంధిం గలహంసయాన విలసద్బంధూకరక్తోష్ఠ ను
త్పలనేత్రిం గమలాస్య నంగజరసాంభః పూరఁ దత్పార్వతీ
జలజావాసముఁ జొచ్చి యాడక, మనోజాతోత్సవం బాయునే

ఇందు పార్వతి జలజావాసము ప్రధానరూపకము. అలిధమ్మిల్లాదులు ఉపస్కార రూపకములు. పార్వతి విషయము. జలజావాసము విషయి. పార్వతి పరముగ ధమ్మిల్లము, హస్తములు, నాభి, గంధము, ... యము, రక్తోష్ఠము, నేత్రము, ఆస్యము, అంగజరసము విషయములు. జలజావాసము పరముగ అలి, మృణాళము, కమనీయావర్తము, మహోత్పలము, కలహంస, బంధూకము ఉత్పలము, కమలము, అంభఃపూరము విషయులు. ఇందు ఆవర్తనాభికి కమనీయ విశేషణము, ఉత్పల గంధికి మహా విశేషణము, బంధూకోష్ఠకు విలసత్, రక్త విశేషణములు, పార్వతికి తత్ అను నిర్దేశము గణమాత్ర ప్రయోజనములు. అంతేకాదు. ఉత్పలము పునరుక్తభూతము'' (విమర్శ, పుట 66).

పై పద్యము వ్యాఖ్యానము 'కృతకరచనము' అను గ్రంథ విభాగము లోనిది. ఇందులో విమర్శకుల ... తెల్లమగుచున్నది. మహోత్పల గంధి అనుచోట మహా విశేషణ మనియు, ఉత్పల నేత్రి అనుచోట ఉత్పలపదము పునరుక్తమనియు రెండు దోషములు చూపబడినవి. పద్యములో నిట్టి దోషము లుండుటకు కారణము అది ప్రాచీన గ్రంథము కాదని సాధించుటకే యని విమర్శకుల యాశయము. మహోత్పల పదములో ''మహా'' గొప్ప యను సర్థమున విశేషణముకాదు. సమాసములయందు కొన్నియెడల 'మహత్' శబ్దము మొదట చేరినప్పుడు అవి విలక్షణార్థాభిదాయకములగును. మహారజత మహాబ్రాహ్మ ణాదులిట్టివి మహోత్పల మనగా గొప్ప కలువ అని అర్థముకాదు. ''అరవిందం మహోత్పలం'' అని వైజయంతి నిఘంటువు నుడువుచున్నది. (పుట, 157, వావిళ్ళ) కావున, తరువాత వచ్చు ఉత్పల శబ్దము పునరుక్తికాదు. తిక్కనగారు

''ఇయ్యరవిందగంధికులమేమి చరిత్రము చందమెట్టి . ..(విరాటపర్వము)

అని యొకచో వ్రాసియున్నారు. అనగా ప్రకృతము ఆ స్త్రీ పద్మినీ జాతిస్త్రీ యని కవి హృదయము. తల్లక్షణము రతిరహస్యమున చూడనగును.

ఇంత గొప్ప భావములుగల పై రచనమున దోషము నారోపింప దగునా ? ఇట్టివి మరికొన్ని కలవు. అవి ఎట్టి రీతిచే విడువబడినవి.

విమర్శ గ్రంథములోని క్రింది వాక్యములను సహృదయులు సమాలోకింతురు గాక !

1. ఆదికవి నన్నయ మొదలు అర్వాచీనకవి చెన్నకంటి వేంకటాచలము వరకు మున్నూటిమంది కవుల పద్యములను కుమారసంభవ కర్త అనుకరించుటయే సంభవము (పుట 91).

2. ఏవంవిధమైన కుమారసంభవము సత్ప్రదసబంధురములైన స్వర్ణయుగ ప్రబంధములకు గురుస్థానీయము కాదు. అప్రదసబంధములైన క్షీణదశక్షీణాంధ్ర యుగ ప్రబంధములకు శిష్యస్థానీయము (పుట 125).

3. ఒక తమిళ కర్ణాటాంధ్ర సంస్కృతవాఙ్మయ కోవిదుని కుమారసంభవము మఱొక తమిళ కర్ణాటాంధ్ర సంస్కృత వాఙ్మయ కోవిదుడు లభించువఱకు అజ్ఞాతవాసము చేయుట అసంగతము— (పుట 148).

4. పాపము శమించునుగాక! కుమార సంభవ కూట సృష్టికర్త మానవల్లి రామకృష్ణకవిగారే కావలయును (పుట 225).

5. కుమారసంభవము ప్రాచీన గ్రంథముగాక నవీనగ్రంథమని సిద్ధాంతము (పుట 238).

ప్రాచీన కవులు, లాక్షణికులు కొందరు నన్నెచోడుని కుమార సంభవమును పేర్కొని, అందలి పద్యములను ఉట్టంకించి యున్నారు. శహాజిరాజు కాలమునందే లేఖకులు కుమార సంభవము యొక్క తాళపత్రగ్రంథమును వ్రాసి పెట్టిరి. ఆ తాళపత్ర గ్రంథము పూర్వమే తాళపత్రి గ్రంథ సూచికలో పద్దు కెక్కియున్నది. కుమార సంభవముయొక్క తాళపత్రి గ్రంథములోని లేఖన విధానము ప్రాచీన పద్ధతిని చాటుచున్నది. ఇన్ని కారణములవలన నన్నెచోడుని కుమార సంభవము ప్రాచీన కృతి, అనగా మానవల్లి రామకృష్ణ కవిగారి జీవిత కాలమునకు (క్రీ.శ. 1866–1957) పూర్వము నుండి నన్నెచోడుని కుమార సంభవ తాళపత్రి గ్రంథము సరస్వతీమహలు గ్రంథాలయములో నుండునట్లు కరబదరము.

రామకృష్ణకవిగారు ప్రాచీన గ్రంథములను ప్రకటించి సాహితీ రసికుల మన్ననలకు పాత్రులైరి. ఆ కవిగారి భాషాసేవ అనుపమానము, అద్భుతము.

క. ''వినదగు నెవ్వరు సెప్పిన
వినినంతనె వేగపడక వివరింపదగున్
కని కల్ల నిజము దెలిసిన
మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ!''

# దొరకినాడు నన్నెచోడుని గురువు మల్లికార్జునుడు

వేదము వేంకటరాయశా.

నన్నెచోడుని గురువు జంగమ మల్లికార్జునుని కనుగొనుటకు చేసిన ప్రయత్నములన్నియు ఇంతవఱకును ఫలింపలేదు. జంగమ మల్లికార్జునులు చాలమంది దొరకుచుండుటయే ఇందులకు కారణము. అట్లే నన్నెచోడ నామధారులును అనేకులు కనబడుచున్నారు. కాని కవియు, చోడబల్లి శ్రీసతులకు కుమారుడునైన నన్నెచోడుడు కానరాడు. అసలు శ్రీసతియే కానరాదు. 'శ్రీ' లేని సతులేహెచ్చు. పైగా దొరకిన నన్నెచోడు లెవ్వరును కావ్యకర్తలుగారు.

అన్నిటిని మించి కుమారసంభవ కృతియే—తనది ప్రాచీనకాలము కాదు, అర్వాచీనకాలమని కృత్యాది పెంపకము, కృతిసమర్పణకార్యము, షష్ఠ్యంతరచన, సప్తసంతానముల ప్రస్తావన, అష్టాదశవర్ణనలు మొదలైన అనంతర ప్రబంధ లక్షణములచేత చాటుటనుబట్టి శాసనములచేతగాక కేవల కావ్యగుణములచేతనే ఈతని కాలమును గుర్తింపవలసి వచ్చినది. ఇట్లు తలచి చూడగా దాదాపు క్రీ.శ. 1300 తర్వాత ఇతని కాలముగా నుండునని నాకు తోచినది. మరల చదువుచుండగా ఇందుల కనుకూలమైన ఈ క్రింది విషయములు గోచరించినవి. అవి వేములవాడ భీమకవి వృత్తాంతమునకు సంబంధపడినవి. కన్నడమునకు బసవపురాణమును అనువదించిన భీమనయే వేములవాడ భీమకవి. శ్రీ వీరేశలింగము పంతులవారు వ్రాసినది, ఈ సందర్భమునకు, చాల సమంజసముగా కనబడుచున్నది. వారి వ్రాత యిది—

"నేను చూచినంతవఱకు భీమకవి విరచిత కృతిని గూర్చి నా కొక్క యాధారము కనబడుచున్నది. కృష్ణదేవరాయనికిఁ గొంచెము ముందున్న వాఁడయి ౧౫౦౦వ సంవత్సర ప్రాంతమునందు బసవపురాణమును పద్య

కావ్యముగా రచించిన పిడుపర్తి సోమనాథకవి భీమకవి బసవపురాణమును రచియుంచెనని తన గ్రంథముయొక్క ప్రథమాశ్వాసములో నీక్రింది పద్యమునందుఁ జెప్పియున్నాడు.

సీ. విరచించె జైమిని వేదపాద స్తవం
  బొకపాదమునను వేదోక్తి నిలిపి,
హరభక్తి వైదికం బని శ్రుతు లిడి చెప్పెఁ
  బతిభ సోమేశుఁ డారాధ్య చరిత,
సరవి శ్రీనాథుఁడా చరిత పద్యప్రబం
  ధము చేసె ద్విపదలు తఱచు నిలిపి,
యాతండు పద్యకావ్యము చేసె నైషధ
  మంచిత హర్షవాక్యములుఁ బెట్టి.

గీ. సోమగురువాక్యములఁ బెట్టి భీమసుకవి
గరిమ బసవపురాణంబు గణన చేసె,
గానఁ బూర్వకావ్యము వేఱుగతి రచింపు
వారి కాదికావ్యోక్తులు వచ్చినెగడు.

ఈ కవి శ్రీనాథునికిఁ దరువాత నేఁబది యఱువది సంవత్సరములకే యున్నవాఁ డగుటచేత, నాకాలపు సంగతులను జక్కఁగా నెఱిగినవాడు. పాల్కురికి సోమనారాధ్యుఁడు తెలుఁగున రచించిన ద్విపద కావ్యములు రెంటిలో పండితారాధ్య చరితము నక్కడక్కడ ద్విపదలుంచుచు శ్రీనాథుఁడు పద్యకావ్యముగా జేసెననియు, బసవపురాణమును భీమకవి పద్యకావ్యమునుగా జేసెననియు కవి చెప్పుచున్నాడు. తనకు బూర్వమునందే భీమకవి బసవపురాణమును పద్యకావ్యముగాఁ జేసియుండినయెడలఁ దాను మరల బసవపురాణమునే పద్యకావ్యమునుగా రచియింపవలసిన యావశ్యకమేమివచ్చినది? ఏమియు లేదు. మహాకవియైన భీమకవికంటెఁ దానెక్కువ ప్రౌఢముగాను మనోహరముగాను రచియింపఁ గలుగుదు నన్న నమ్మకముచేతనా? కాదు. అందుచేత భీమకవి బసవపురాణమును పద్యకావ్యముగా రచించినది తెలుఁగుభాషలో గాదనియు, వేఱొక భాషలోననియు నిందువలనఁ దేలుచున్నది. కవి శ్రీనాథుడు ఆరాధ్య చరిత్రమును పద్యకావ్య

ముగా జేసెనని చెప్పి దానిక్రిందనే సందర్భమంతగా కనఁబడని నైషధ భాషాం తరీకరణ కథనము నుగ్గడించుట భీమకవికి భాషాంతరమనియు, నైషధమునందు వలెనే ప్రతిభాషాంతరీకృత గ్రంథమునందును మూలగ్రంథ వాక్యములు కొన్ని పడుట యనివార్యమనియు చూపుటకొఱకయియున్నది. ఆకాలమునందు భీమ కవి తన భాషాంతరమునందు మూలగ్రంథ వాక్యములనే కొన్నిటిని బెట్టెనని జనులు నిందించుటవలన నిట్లు వ్రాయవలసివచ్చియుండును."

ఇచ్చట ఈ యభిప్రాయమును శ్రీ చాగంటి శేషయ్యగా రాక్షేపించిరి. "పై పద్యములు పిడుపర్తి సోమనాథకవి, భీమకవి భాషాంతరీకరణమును సమ ర్థించుటకై వ్రాసినాడనుటకంటె తన గ్రంథమునందు పాల్కురికి సోమనాథుని మూలకావ్యము నందలి వాక్యములు వచ్చిపడినను చదువరులు తనయందు గ్రంథ చౌర్యము నారోపింపక యుండుటకై వ్రాసియుండెనని భావించుట సమంజసమని నా యభిప్రాయము."అని.

అందునుగాక, తన రచనను సమర్థించుకొనుటకని స్పష్టమే. 'పూర్వ కావ్యములు వేఱుగతి రచించువారి' అని యన్నంమన భాషాంతరీకరణముగా నుండనక్కఱలేదు. శ్రీనాథుడు పండితారాధ్య చరిత్రను తెనుగుననేకదా వ్రాసెను. జైమినిది ఆంధ్రము కాదుగదా. సోమేశునిది శ్రుతులతోడి యాంధ్ర రచన. ఒకరు వ్రాసినదే మఱియొకరు అంత సన్నిహితులు ఒక భాషలోనే వ్రాయరని శ్రీ పంతులవారి యభిప్రాయము. కాని దీనిని కూడ ఆక్షేపింప వచ్చును. అట్లేల వ్రాయరాదు. వస్తుగుణముచేత ఆకృష్టులై కవులు వ్రాయు టలో తప్పేమి? శ్రీనాథుని రచన పునరుక్తమేగదా కాబట్టి భీమకవి ఆంధ్ర మందే వ్రాసియుండవచ్చునుగదా. కాని అట్టి యాంధ్ర రచన కానరాదు. కన్నడ రచన స్ఫుటముగా కన్నుల యెదుట నున్నది. ఈ విషయమును శ్రీ పంతుల వారు కంఠోక్తముగ చెప్పకున్నను వారి యభిప్రాయము కనబడుచునే యున్నది. వేములవాడ భీమకవిగాని మఱి యే యాంధ్ర భీమకవిగాని ఆంధ్ర బసవపురా ణకర్త గాడు. పాల్కురికి సోమనాథ పిడుపర్తి సోమనాథు లిరువురే దేదీప్య మానులు. అందుచేతనే పంతులవారు కన్నడమును గ్రహింపవలసి వచ్చినది. శ్రీ వీరేశలింగము పంతులవారిని అనుసరింతము.

"భీమకవిది భాషాంతరమైనచో నది యేభాష? వైష్ణవ మత గ్రంథములు సాధారణముగా సంస్కృతములో నుండునట్లే శైవమత గ్రంథములు కన్నడములో నుండునుగాన, గర్ణాట భాషయని వేఱుగఁ జెప్పవలసినపనిలేదు. ఆకాలమునందలి తెలుగు పండితుల కందఱికిని సంస్కృత కర్ణాటక భాషలు సాధారణముగా వచ్చి యుండెడివి. అందుచేత తెనుగును సహితము కర్ణాటకమనుచుండుట యప్పు డప్పుడు కలదు. శ్రీనాథుడు తన భీమఖండములో నేమనెనో చూడుడు.

''ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాషయండ్రు,
పలుకునుడికారమున నాంధ్రభాష యండ్రు,
ఎవ్వరేమన్ననండ్రు నాకేమి కొఱంత
నాకవిత్వంబు నిజము కర్ణాట భాష.''

భీమకవి పాల్కురికి సోమనాథకవికృతమైన ద్విపద తెలుగు బసవపురాణ మును గర్ణాటక భాషలో భామినీ షట్పదిపద్యములతో నెనిమిదాశ్వాసముల మహా కావ్యమునుగాఁ జేసెను."

ఈసందర్భమున ఈ కన్నడ భీమకవి ఆంధ్రుడే యనుటకు శ్రీ పంతుల వారు చూపిన ఉపపత్తి యుక్తియుక్తముగా నున్నది. ఇది వారి అనంతర వాక్యము. ''ఈ కవి ఆరాధ్యబ్రాహ్మణుఁడనియు బసవపురాణము భీమకవీశ్వర రగడ యనుపుస్తకమును రచించెననియు, ఈతనిని సుమారు 1358వ సంవత్సర మందున్న పద్మణాంకుడు, 1585వ సంవత్సర ప్రాంతమందున్న విరూపాక్ష పండితుడు మొదలైన వీరశైవులు నుతించియుండిరని, కర్ణాటక కవి చరితము చెప్పుచున్నది. ఆరాధ్యబ్రాహ్మణు లాంధ్రులలోతప్ప నితరులలో లేరు. భీమకవి తాను శివకవిదేవపుత్త్రుఁడననియు, ఉభయ కవిత్వ సమర్థుడననియు బసవపురాణములో నీక్రింది పద్యమునఁ జెప్పుకొని యున్నాఁడు.

''విమల సద్గురు సేవె యలి జం
గమభజనెయలి లింగనిష్ఠె
సమతెయలి తనుమన ధనంగళని త్తభవభక్తి ॥
సమయవార్ధి వివర్ధనోత్సవ

హిమగు శివకవిదేవ నాత్మజ
సుమతి భీమ నుభయ కవిత్వ సమర్థను సురువడె ॥

భీమకవి తన బసవపురాణమును శాలివాహన శకము 1291కి సరియైన సౌమ్య సంవత్సర శ్రావణ బహుళదశమి గురువారము ముగించితి నని పుస్తకాంతమున నీ పద్యములోఁ జెప్పికొనెను.

''కోవిదరు కేశొళ్లితెనలుడు
దేవవిధి నయనేందు సంఖెగ
శోవిశకవరుషం గళాగలు సౌమ్యవత్సరద ॥
శ్రావణ బహుళపక్షదశమీ
జీవవారదొళాది వృషభేం
ద్రావతారద బసవచరితె సమాప్తి యా యితు ॥

దీనినిబట్టి భీమకవి శకసంవత్సరము 1291కి సరియైన క్రీ.శ. 1369వ సం॥ బసవపురాణమును రచించి ముగించెనని తెలియుచున్నది; గాన నితడు 1340–1350 సం॥ ప్రాంతమున నుండి యున్నవాఁడని నిస్సందేహముగా సిద్ధాంత మగుచున్నది. బసవపురాణమునందుఁ గవియే శివలెంకమంచన పండితుడును గురు మల్లికార్జున పండితుడును ప్రసాదించిన ''యుద్దండమతి''తో గృతి జేసెదనని చెప్పకొని యుండుటచేతను, ఈతనిది ఉద్దండ లలిత ధారాళ కవిత్వమని ఇతరులు పొగడియుండుటచేతను,

'వచియింతు వేములవాడ భీమన భంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు''

అని శ్రీనాథుఁ డీతని కవిత్వమును శ్లాఘించుట వింతకాదు. భీమకవి కవిత్వము యొక్కయుద్దండ లీల కొంత తెలియుటకును' అతడు పాల్కురికి సోమనాథుని బసవపురాణమును భాషాంతరీకరించెనని తేటపడుటకును బయి పద్యము క్రింది రెండు పద్యములనుం గూడ నిందుదాహరించుచున్నాను.

శిక్షిత ప్రతిపక్ష సజ్జన
పక్షసాక్షా దుక్ష రాక్షస
దృక్ష దక్ష మఖక్షయ మఖశిక్షితక్ష్వేడ ॥
త్ర్యక్ష గణపసమక్ష కరుణా
వీక్షణ జగద్రక్షణ గణ వి
చక్షణ బసవ సూక్ష్మ అక్షయ రక్ష సెంమునను ॥
ఇదసకళ మహేశ్వరామళ
పదపయోజపరాగమదష
ట్పదియెని పాల్కురికె సోమేశ్వరసు కారుణ్య,
ఒదవిదఖిళాప్రపూరిత
హృదయ భీమకవి ప్రణీతా
భ్యుదయ బసవపురాణకథెయొళు అష్టమాశ్వాస ॥

శ్రీ పంతులవారి యీ వ్రాతం బట్టి మన భీమనయే కన్నడ భీమన యను టకు 'ఉద్దండ కవి' యనుట బలవత్తమ ప్రమాణముగా కనబడుచున్నది. ఇరు వురును భీమనామకులు, ఆంధ్రులు, ఉద్దండకవులు. 'ఇంకను నేమి కావలయు, ఇందొకడొక్కఁడె కార్యసిద్ధికౌరెంకి, ఇవన్నియుం గలయు తీవిని దైవమొసంగె నేటికిన్' ("వస్త్వేకైకమపీహ వాంఛిత ఫలప్రాప్తేః పదం; కింపునః, మద్భాగ్యోపచయాదయం సముదితః సర్వోగుణానాంగణః") శ్రీనాథుడును కన్నడ ప్రస్తావమును వదలెనేగాని 'భీమనామమును ఉద్దండ లీలను చెప్పినవాడేగదా.

కాని దీనిని ఆంధ్ర కవితరంగిణి ఆక్షేపించినది. వేములవాడ ప్రస్తావము లేకపోవుట, తండ్రి శివకవిదేవుఁ డని మాత్ర ముండి ఆంధ్రదేశ మందలి విచిత్రకథ కానరాకపోవుట మొదలైన కారణములచేత 'శ్రీ పంతుల వారింత దూరము వ్రాసినను, ఈ కన్నడ బసవపురాణకర్త వేములవాడ భీమ కవి యని నిస్సందేహముగా చెప్పుటకు వీలులేదనియే తోచుచున్నది.' అని శేషయ్యగారి విమర్శ. 'శివకవి కుమారుడైన భీమకవి యింకొకడుండెనని యేల యనఁగూడదు? వేములవాడ భీమకవి తాను 'దక్షారామ భీమేశ నందనుడ' నని చెప్పుకొని యున్నాడు వీరశైవులు తండ్రి పేరు చెప్పరుగావున వేములవాడ భీమకవి భీమేశ్వర పుత్రుడనని చెప్పుకొని యున్నాడని కొందఱనవచ్చును....''

అని యింకను వ్రాసినారు. ఈ యాక్షేపము నిలువదు. వేములవాడ భీమకవి తండ్రి దేవుడనునది పుక్కిటిపురాణము. ఆయన చెప్పకొనెనా? తాను పితంతువు నకు దేవుని కృపచేతనే జనించియుండినయెడల అంతటి భక్తుడు భక్తి పార వశ్యమున, లోకమును తృణీకరించి ఆ విషయమును దమారము వాయించినట్లు చాటుకొనియుండడా. నాటి భక్తుల ఆవేశాదికములట్టివేగదా యుండినవి. ఆయన చెప్పకొనలేదు. 'ఘనుడ వేములవాడ వంశజుడ, దక్షారామ భీమేశ నందను డ' అన్న పద్యము చాటువుగదా. రచయిత ఎవరు 'దక్షారామ భీమేశుడు' దేవుడే ఏలకావలయును? ఆ పేరిటి పురుషుడు, మానవుడు, ఉండరాదా? దక్షా రామ భీమేశుడే శివకవి యేలకారాదు. దాక్షారామము తీరాంధ్రదేశమందు గోదా వరీ తీరమందలిది. వేములవాడ ఒకప్పుడు కర్ణాటకమందుండి, తర్వాత తెలుగు దేశములో చేరిన కరీంనగరు జిల్లాలోనిది. కాబట్టి ఈ కథలను ఆధారముగా గ్రహించి ఒక నిర్ణయమునకు రాలేము. వేములవాడ భీమకవికి ఆరోపితములై యుండు నితరకావ్యములను బట్టి ఆతడు వీరశైవుడు కాడనువాదములో సారమే లేదు. కాలసామీప్యమునుబట్టి, అనగా శ్రీనాథుడు క్రీ శ. 1360 నుండి 1430, లేక 1380—1450 వాడుగానో ఉండి, భీమకవి 1350కి ముందుండి, ఇరువురు కవిత్వకాలములకును ఏబదియేండ్ల అంతరముండియుండు ననుకొనుట చక్క గానే కుదురుచున్నది. అందుచేత ఉద్దండకవి యనుటయును కుదిరినది.

శ్రీనాథుని పద్యము తెలుగు కవిత్వమును గూర్చినదగుటచేత ఈ భీమకవి ఆంధ్రములోను కన్నడములోను కూడ కవిగా నుండి యుండును. కాని శ్రీనాథుడు పద్యమున నన్నయకు ముందుగా ప్రస్తావించిననాడే! అతనిని శ్రీనాథుడు అతి ప్రాచీనుడుగా భావించెనని అర్థమగుచున్నది గదా అని కొందఱు సంశయింపవచ్చును. ఇందులకు సమాధానము—శ్రీనాథుడు చారిత్రక దృష్టితో చెప్పెనా? రామరాజభూషణుడు 'మహిమున్ వాగనుశాసనుండు' పద్యమున చారితకదృష్టి చూపెనా? మన కవులు కవిత్వ గుణములను ఆలంకారిక మర్యా దలలో చెప్పచు తమకు తోచినట్లు పద్యము లల్లినారు. పైగా చారిత్రక దృష్టియే లేక అద్భుత శక్తులను నమ్మునట్టి యా కాలమున అట్టి అద్భుత శక్తులు గల వాడు ప్రాచీనుడను భావమేమైన గలిగెనేమో. కాని 'నా కవిత్వంబు నిజము కర్ణాటక భాష' యని చెప్పిన శ్రీనాథునికి భీమకవి రచించిన కన్నడ బసవ పురాణము దొరికియుండదా, ఆయన చూచియుండడా, ఆ గ్రంథ రచనాకాలము

తెలిసియుండదా. కాబట్టి, శ్రీనాథుడు చరిత్ర కార దృక్పథముతో వ్రాసిన వ్రాత కాదది. అట్లే 'చిన్నారి పొన్నారి' సీసపద్యము వ్రాసెను గదా. తన గ్రంథముల నన్నిటిని ఏల పేర్కొనలేదు. ప్రధానములను మాత్రమేల పేర్కొని మిగిలిన వానిని వదలెను. హరవిలాసములో పూర్వకవి స్తుతియేల చేయలేదు.

వీనినెల్ల చూడగా శ్రీ వీరేశలింగము పంతులుగారు తలంచినట్లు శ్రీనాథుడు స్తుతించిన వేములవాడ భీమకవియే కన్నడ బసవ పురాణ కర్తయని తలంచుట సమంజసము. ఆతడు తెలుగులోని కవిగా నుండి యుండును. మఱి యాతని వేములవాడ ఎచ్చటిదో. ఈతడు గోదావరీయుడో లేక తెలంగాణమువాడో— అచర్చ ఇచ్చట అప్రస్తుతము. భీమకవులు పలువురుండి యుండురు. ఉదాహరణకు భీమేశ నందను డొక్కడు, ద్రాక్షవాటి కవిరాక్షసు డొక్కడు, రాఘవ పాండవీయాది కావ్యకర్త యొక్కడు, కాని ఇక్కడ మనము సంపాదింవ వలసినది మల్లికార్జునుని.

కవియే తన బసవ పురాణమున శివలెంక మంచన పండితుడును గురు మల్లికార్జున పండితుడును ప్రసాదించిన ఉద్దండమతితో కృతి చేసెదనని చెప్పుకొని యున్నాడు గదా. ఈ పండితు లెవరు? శివలెంక మంచన పండితుడు ప్రాచీన పండితత్రయములోని వాడు కాడు. కాజాలడు. బసవపురాణ కర్తయైన పాల్కురికి సోమనాథుని గ్రంథమందే పూర్వుడుగా ప్రస్తావితుడు ఇంత వెనుకకు రాడు. ఆ పరంపరలోని ఆ పేరిటి మఱియొకడుగా నుండును. గురు మల్లికార్జున పండితుడు నన్నెచోడునికిని గురువైన మల్లికార్జునుడే కావలయును. ఇరువురును గురువులు, శాపానుగ్రహ శక్తియుక్తులు.

నన్నెచోడుని కాలముగా నాకు తోచిన 1300 ప్రాంతమువా డితడు. మతము కూడ సరిపోవుచున్నది. ప్రతాపరుద్ర చక్రవర్తి కాలమున వెలువడిన బసవపురాణమునకు వెనువెంటనే కన్నడానువాదము వెలువడుటయు మతాళి నివేశమునకు సరిపోవుచున్నది. ఇంచుమించు నలువది యేండ్లలోనే జరిగి యుండును. గురు మల్లికార్జున పండితుడనుటలో పండిత శబ్దమునకు సమాధానము నరయవలయును. నన్నిచోడుడు తన గురువును జంగమ మల్లికార్జును డనెనేగాని ఎచ్చటను పండితు డనలేదు. ఇతడు పండితుడుగాన భిన్నుడు కావచ్చును గదా

కాని నన్నెచోడుని కాలమును ఇతని కాలమును సరిగా క్రీ శ. 1300 తర్వాతను 1340 కి ముందును కుదురుటచేత నీ పండిత శబ్దము అంత బాధకముగాక గురు శబ్ద గౌరవముచే నిరువుర యభిన్నతకు దారి యేర్పడునా యను ఆశ కలుగు చున్నది.

'పాల్కురికి సోమనాథు డెప్పటివాడు' అని యొక చిన్న పరిశోధక గ్రంథమును వ్రాసి (వావిళ్ళ ప్రచురణము) శ్రీ నేలటూరి వేంకటరమణయ్య గారు అతనిని ప్రతాపరుద్రుని సమకాలమువాడని నిర్ణయించిరి. ఈ రాజు క్రీ.శ. 1297—323 నాటి వాడు. మహమ్మదీయ దండయాత్రలవలన దేశమునందు అరాచకము ప్రబల నారంభించిన కాలము. సోమనాథుని బసవపురాణము అటు తర్వాత కన్నడింపబడి ఆ రచయిత ఈ గురువులను పేర్కొనుటచేత వీరు కూడ ప్రతాపరుద్రుని కాలమువారుగానే యుండవలయును

ఇందులకు అనుకూలముగానేయున్నది శ్రీ వెంకటకృష్ణారెడ్డిగారి జయ చైత్ర సంవద' శ్రీబండారు తమ్మయ్యగారన్నట్లు తక్కిన డొంక తిరుగుడు గర్భ గూడార్థ ప్రతిపాదక కాలనిర్ణయాద్యక్షర సాంఖ్య గణనములు త్యజింప దగినవి. కాని 'జయచైత్ర' మనుటమాత్రము నా వాదమున కనుకూలముగా నున్నది. క్రీ. శ. 1294 లో నొక జయయున్నది. తర్వాతి జయ క్రీ శ 1354 శ్రీనాథునికి, ఎఱ్ఱనకును చాల సమీపమునగాన పనికిరాదు. క్రీ. శ. 1294 జయలో నన్నెచోడునికి సమకాలికుడుగా గురు మల్లికార్జును డుండెనేని ప్రతాప రుద్రుని సమకాలికుడైన పాల్కురికి సోమనాథుని కాలమును అదేగావున, తర్వాతి వాడో లేక వయసున కొంత చిన్నవాడోయైన సోమనాథుని బసవపురాణ మును కన్నడీకరించిన భీమనయు నాటి వాడేయై, అతని గురువులు శివలెంక మంచనయు గురు మల్లికార్జున పండితుడును ఈ జయ నాటికి ఉండియుందురనుట సాధువే క్రీ. శ. 1297 నాటికి ప్రభువైన ప్రతాపరుద్రుని కాలమున అభివృద్ధికి వచ్చి, 'వినమత్కాకతి సార్వభౌమ కవితా విద్యాధరు'ని మనుమనికాలమునకు ప్రాచీన ఉద్దండ కవిగా జనుల స్మరణలో మల్లికార్జున గురువు నిలిచియుండుట సరిగానే యున్నది.

❋

పండితులు పరిశోధించి ఈ గురు మల్లికార్జున పండితుని, ఇంకను స్ఫుటముగా వెలుగులోనికి తేగలుగుదురుగాక యని కోరుచున్నాను.

*          *          *

[''పెద చెఱకూరి శాసనమున పాకనాఁడిరువది యొక్క వేయిటి కధీశుఁడు, చోడబల్లి కుమారుఁడ నగు నన్నిచోడఁడు దొరికినాఁడు. కొప్పరపు శాసనమునఁ దెలుఁగు చోడులచే నారాధితుఁడు కాలాముఖ దీక్ష గొన్నవాఁడు నగు మల్లికార్జున గురువు దొరికినాఁడు ...

కుమార సంభవమున ..నన్నిచోడని తల్లి పేరు శ్రీసతి యని యున్నది. పై శాసనములందది కానరాలేదు గాన నాతఁడే యీతఁడనరాదని యాక్షేపింపరాదు. అట్లాక్షేపింపఁ బూనినచోఁ గల్గెడు ననర్థములకు మితిలేదు.'' అని యిప్పటి కరువది యేండ్ల క్రింద (1925) శ్రీ ప్రభాకరులు వ్రాసినారు.

కుమార సంభవ రచనా కాలమును గూర్చిన పరిశోధన నేటికినీ సాగుచున్నది.

''కేవల కావ్యగుణముల'' నాధారముగా చేసికొని నన్నెచోడుడు క్రీ. 1300 ప్రాంతము వాడని భావించిన శ్రీ వేంకటరాయశాస్త్రిగారాకాలము వాడుగా గుర్తింపదగిన గురు మల్లికార్జున పండితుడొకడు దొరకినాడనీ ఆతడే నన్నెచోడని గురువగు ననీ ఆవిషయము పరిశీలింపదగుననీ వ్రాయుచున్నారు.

ప్రభాకరుల దివ్య స్మ కంకితమైన మా ఎూ మణిమంజరి విశేష సంచికకు గల పరిమితుల దృష్టితో ఈ విషయములను గూర్చిన చర్చను మేమిందు ఆహ్వానించుట లేదు. అయినా వాదము నందలి అర్థానర్థముల మితి నెరిగిన పండిత పరిశోధకులు అన్ని విషయములను పరిశీలింతురు గాకని కోరుదుము. సం॥]

*

# కుమారసంభవం తంజావూరి ప్రతి-
# నేను నకలు చేసినతీరు

-తిరుమల రామచంద్ర

బృహస్పతే రవిశ్వాసః—అనేది కౌటిల్యుడు ఉదాహరించిన బార్హస్పత్య నీతి సూత్రం. ఎవరినీ మంచివాడని విశ్వసించవద్దు. మంచితనమనేది ఎవరికిగాని నిరూపితంకాదు. అందువల్ల ఎదుటివానిని నిత్యమూ శంకిస్తూనే ఉండాలి. ఈ శంక తీరడానికి ఎదుటివాని మంచితనం అసందిగ్ధంగా మనకు రుజువుకావాలి—అంటాడు బృహస్పతి.

బృహస్పతి చెప్పిన తక్కిన విషయాల సంగతి ఎలావున్నా, ఈ అవిశ్వాస సూత్రం మాత్రం తెలుగు విద్వల్లోకానికి బాగా ఒంటబట్టినట్లుంది. ప్రతి కావ్య కర్తృత్వాన్నీ—దాదాపు—శంకించడం వారికి విద్యావినోదమయింది: ఈ అనుమానాలు, శంకలు నన్నయతోనే ప్రారంభించారు కొందరు. నన్నయ భారతం వ్రాయలేదు; అతని మిత్రుడు నారాయణభట్టు వ్రాశాడు. రంగనాథ రామాయణ కర్త ఎవడు? మనుచరిత్రను రచించిన పెద్దనే మరొక పద్ధతిలో లంకానారికేళ పాకంలో ఆముక్తమాల్యద వ్రాశాడు. బుద్ధితెలిసినప్పటినుంచి కదనాలతో గడపిన కృష్ణరాయలకు అలాటి కావ్యం రచించగల తీరికేదీ? పెద్దనకాకపోతే, తెలుగు కొత్తగా నేర్చుకొన్న తమిళదేశపు సంస్కృత పండితుడెవడో వ్రాసి ఉంటాడు. లేకపోతే దాని శైలి కంకరపై నడిచే బండిలాగ ఎందుకుంటుంది? కన్యాశుల్కం గురజాడ అప్పారావు నాటకంకాదు; గోమఠం శ్రీనివాసాచార్యులది …….

ఇలాటిదే నన్నిచోడని కుమార సంభవ కర్తృత్వం గురించి ఇటీవల — ముఖ్యంగా — రామకృష్ణ కవిగారు, ప్రభాకర శాస్త్రిగారు, నేలటూరి వేంకట రమణయ్య గార్లవంటి పరిశోధక తల్లజులు కీర్తిశేషులైన పిదప చెలరేగిన సందేహం! దీనిని సందేహం అనడంకన్నా—నిందారోపణం అందాము. పాత

పండితులు తమకు అనుకూలంగా ప్రాత గ్రంథాలలోని పారాలు దిద్దేశారనో, తమ తిక్కలతో పద్యాలు చేర్చారనో, ఏకైక ప్రతులున్న కావ్యాలను దాచి పెట్టారనో అపవాదాలుండేవి పూర్వం. ఇప్పుడలాకాదు. గ్రంథాలు పాతవాళ్ళ పేరుతో వ్రాసి ఎవ్వరికీ తెలీకుండా తాళపత్ర గ్రంథాల కట్టలలో దూర్చారు. పాత తాటాకులు ఎక్కడివయ్యా? ప్రతి తాళపత్ర గ్రంథంలోను వ్రాయనివి—అలేఖ్యాలు ఉంటాయి. వాటిని ఏరి గుదిగుచ్చి దానిలో వ్రాసి తాటాకుల మధ్య పెట్టారు. ఇదీ ఆరోపణ పద్ధతి. కనుక ఎలా ఇలాటివారితో వాదం?ప్రతివాదానికి అధిష్ఠానసామ్యం ఉండాలి; అది లేనప్పుడు వాదం కుదరడు.

ఆదేమి దైవ దుర్విలసనమో, మానవల్లివారు 1909 లో నన్నెచోడని కుమారసంభవం ప్రచురించి నప్పటినుంచీ వాదవివాదాలు చెలరేగుతూనేవున్నాయి. దానికి కారణం, ఆయన ఆ కావ్యంలోని వివిధ వైచిత్రీవిలసితాలను చూచి నన్నయ కంటే పుందుదని భావించడం. దానితో తెలుగు దేశంలోని పండితోత్తములు రెండు స్కంధావారాలుగా విడిపోయి ఒక తరంపాటు ముష్టాముష్టి, బాహాబాహి పోరాడారు.

కొందరు కావ్యమంతా కూటసృష్టి అన్నారు; ప్రాచీన సంకలన గ్రంథాలలో ఈ కావ్యంలోని పద్యాలు ఉదాహృతం కాలేదన్న కారణంతో. ఆ సంశయము పోయి కొందరు ప్రాచీనులు ఉదాహరించిన ప్రమాణం దొరకగానే, అంతా అబద్ధం, కావ్యం మొత్తాన్నే కూటసృష్టి చేయగల మాయావులు లక్షణ గ్రంథాల్లో వాటిని దూర్చలేరా? అంటూ కొత్తవాదం ప్రారంభించారు. అందువల్లనే వాదానికి అధిష్ఠాన సామ్యం ఉండాలన్నాను.

ఈలాటి పిడివాదానికి సమాధానం చెప్పడానికి ప్రయత్నించడం సంగతి ఎలావున్నా, నాకూ కుమారసంభవంతో నకలునవీసుగా కొంత సంబంధంపుంది గనుక ఆ సంబంధం వివరాలు తెలియజేస్తాను, సహృదయుల నిర్ణయంకోసం.

1909 నుంచి ప్రారంభమైన కుమారసంభవ కర్తృత్వ కూటసర్జనవాదం 1935 కు కొంత శాంతించింది. గురువర్యులు ప్రభాకరులు తంజావూరిలో ఒక కుమారసంభవ ప్రతి ఉన్నదని 1918 లో కాబోలు వ్రాయడంతో జిజ్ఞాసువులు

కొందరు తంజావూరు యాత్ర ప్రారంభించారు. కుమారసంభవాన్ని నిర్దుష్ట పాఠాలతో ప్రచురిద్దామని ప్రభాకరులకు సంకల్పం కలిగింది. కొన్ని పాఠాంతరాలు సేకరించుకొనిరమ్మని నన్ను తంజావూరు పంపారు. నేను కుమారసంభవాది పాఠాలతోపాటు హరవిలాసం మున్నగు కావ్యాల పాఠాలుకూడా సేకరించుకొని వచ్చాను. ఇది జరిగింది 1936 లో. దీనితో ప్రభాకరులకు సంతృప్తికలుగలేదు. యథామూలంగా—తప్పులతోసహా మక్కికి మక్కి—నకలు చేయించుకుంటే, ఆ వ్రాతనుబట్టి పరిశీలిస్తే చాల పద్యాలకు అర్థం కుదరడమేకాక, సరైన పాఠాలు స్ఫురించవచ్చునని అభిప్రాయపడ్డారు.

ఇలాటి అవకాశం 1938 లో కలిగింది. ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు ద్విపద భారతం ప్రచురించదలచి, తాళపత్ర గ్రంథాలయాల అనుభవం గల పండితులు కావాలని పత్రికలలో ప్రచురించారు. నేను అదివరకే మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో లేఖకుడుగా పనిచేస్తూ, అడపా దడపా పండితుడు గాను పనిచేసి వున్నందున దరఖాస్తు పెట్టుకున్నాను. ఎన్నికయాను. 1938 మధ్య నుంచి 1939 చివరివరకు తంజావూరులో వున్నాను. నాతోపాటు మిత్రులు శ్రీ కొమ్మన మంచి జోగయ్య శర్మగారూ పనిచేశారు. తర్వాత ఆయన ఆంధ్ర విశ్వవిద్యాలయం సర్వీసులో కొనసాగారు. నేను దేశాలు తిరుగుదామనే ఉద్దేశం కలవాడిని కనుక లాహోరు విశ్వవిద్యాలయ పుస్తక భాండాగారంలో తాళపత్ర విభాగంలో కాటలాగర్ పని లభించగా వెళ్ళిపోయాను.

నేను తంజావూరిలో ఉన్నప్పుడు ఉద్యోగరీత్యా నా కర్తవ్యం పూర్తయిన తర్వాత లభించిన తీరికలోను అధికారికమైన సెలవు దినాలలోను కుమారసంభ వాన్ని ఇతర గ్రంథాలను యథాపథంగా ప్రతి వ్రాసి ప్రభాకరులకు అందజేశాను.

అప్పటికే అది ప్రాత తాటాకుల ప్రతి. నా అనుభవంలో అది రెండు వందలేళ్లది. ప్రతితాటాకులోను అక్కడక్కడా క్రిమిదష్టాలు ఉండేవి. నేను దానిని నకలు చేయడంతప్పులుగాగ చేశాను. తాళపత్ర గ్రంథాల వ్రాతలు చాల విచిత్రంగా వుంటాయి.

అచ్చుతో ప్రారంభమయ్యే పద్యాలు దాదాపు హల్లులతో ప్రారంభ మవుతాయి. అచ్చు వ్రాయడం కూడా ఉంటుంది. అరసున్న స్థానంలో నిండు

సున్నను, నిండుసున్నను చూపడానికి సున్నపక్కని అక్షరానికి ద్విత్వము, ర్తృర్భలు, వ్రాయవలసి వచ్చినపుడు మంలకు వలపలగిలక; ఇఈ,ఎఏ, ఒఓ గుణింతాలలో హ్రస్వ దీర్ఘభేదాలు పాటించకపోవడం; ఆఆ గుణింతాలను స్పష్టంగా పాటించడం; ఐత్వౌత్వాలు అయి, అవులుగాను వ్రాయడం, వద్రసుడికి క్రావడికి అభేదం; ఒకొక్కప్పుడు కవులును కౌలుగా వ్రాయడం; పద్యం చివరి పదాన్ని దీర్ఘంగా వ్రాయడం పరిపాటి. ఇలాటివి యథాతథంగా వ్రాసి, క్రిమి దష్టాక్షరాల స్థానంలో చుక్కలుపెట్టి, అక్షరభాగం ఏమాత్రం కనిపించినా, దానిని ఆయా ప్రాంతాలలో వ్రాసి, ఫలానా అక్షరం అయివుంటుందని సూచించడం- ఈ పద్ధతిలో నకలుచేశాను. మచ్చుకు ఒక పద్యాన్ని ఉదాహరిస్తాను.

క. వొంక్క నలిని రజస్వల (పొం?)
సొంక్కిన దొషంబ్బువాయ సూర్యుండు గళితా
శంక్క నపరాంబ్బుధిలొం
గృంక్కె నాకొ యనంగం బ్రొద్దు గ్రుంక్కుడునంత్తను. (2-73)

దీనికి సరైన సంస్కరణ ఇది:-

పోంక నలినీ రజస్వల
సోంకిన దోషంబు వాయ సూర్యుఁడు గలితా
శంక నపరాంబునిధిలోఁ
గ్రుంకెనొకో యనఁగఁ బ్రొద్దుగ్రుంకుడునంతన్.

నేడు దక్షిణాంధ్రులు అర్ధబిందు సహిత పదాలను పేండ, కూంతురు, వాండు అని పూర్ణబిందు సహితంగావాడుతారు. పైపద్యంలో పోంక,సోంకు అనే పదాలలోని బిందువు పూర్ణమనే దృష్టితో బిందుపరమైన కలకు కు ఒత్తులు పెట్టాడు లేఖకుడు. దోషంబు అన్నప్పుడు పూర్ణ బిందువుకనుక బకుబ ఒత్తు. సూర్యుండు అన్నప్పుడు అరసున్న అవసరం కనుక డుకు ఒత్తులేదు. శంక, అంబుధి, గ్రుంకె అంతన్ లలో పూర్ణబిందువుగనుక బిందుపరాక్షరాలద్విత్వం; యనంగ అనేచోట అర్ధబిందువుగనుక బిందువు ప్రక్కని గకుద్విత్వం రాలేదు.

ఈ విధంగా వ్రాసుకోవడంవల్ల పెక్కుపాఠాలకు సరైన రూపాలు స్ఫురించాయి.

తృతీయాశ్వాసంలో పార్వతీదేవిని కవి ఆపాదమస్తకం వర్ణించాడు. వీపుకు

స్మరకలహంబునఁ బతిదెస
గిరిసుత పిఱుఁదైన నక్షకేలి మహేశున్
మరుడు దగిలించి గెలుపఁగ
గరమమరిన .. ... .. గతి నిం పొప్పున్. (73) అని పార్వతీ

దేవి వీపు జూదమాడే నెత్తపలకలాగ వుందని వర్ణించాడు. నెత్తపలకపైన ఎడల్పుగాను, రానురానుసన్నగాను వంపుగాను వుంటుంది. నాలుగవ పాదంలో

"గరమమరిన .... క గతి నింపొప్పున్" అని వుంది. నేను చుక్కలు పెట్టిన భాగంలో అమరిన లోనిచివరిన న గలమధ్యవుంది. నవిత్వం కనిపిస్తూంది. తర్వాత ఒక అక్షరంలేదు. ప అక్షరం మొదటి సుడి, ప వంపు చివరికొన, తలకట్టు, ల ఊర్ధ్వకాయం కనిపిస్తున్నాయి. నింపొప్పున్ అనే పదాల లోని ని మొదట్లో పురుగు తినడంవల్ల సి గాను వి గాను చదవడానికి వీలుంది. కనుక ఆలోచించి వీపును నెత్తపలకగా వర్ణించడం సంస్కృత కావ్యాలలో వుంది గనుక ఏదో పలక అయివుంటుందని భావించి ప్రభాకరులకు సూచించాను. ఆయన చాలసంతోషించి వెంటనే నెత్తపలకగా సవరించారు.

ఈ విధంగా అక్షరభాగాలుకూడ వదలకుండా నకలుచేయడంవల్ల ఎంతో ప్రయోజనం కలిగింది, ప్రభాకరులు చాల పాఠాలు నిర్ణయించగలిగారు.

ఇలాటిదే మరొక పాఠం పాకు. ఈ 'పాకు' కుమారసంభవంలో మూడు చోట్ల ఉంది. మొదటిది — దుఃఖవివశయైన దక్షుని ధర్మపత్ని వర్ణన లోనిది.

"కడిసన్న తమ్మిఁ బాఁకడరెనోయన దీన
వదనంబుపై నెఱుల్ సెదరి తూల" (2-88)

దక్షుని ధర్మపత్ని దుఃఖిస్తూంది, ఆమె ముఖం చుట్టూ విడివడినకేశపాశం అలముకొంది. అది కాంతివిహీనమైన పద్మాన్ని చుట్టుముట్టిన పాచిలాగ వుంది. తంజావూరు పాఠంలో

" గడి సన్నతమ్మిం బాంకడరెనాయన పిన
వదనంబుపై నెరులు సెదరితూల"

అని వుంది. రెండవ ప్రయోగం తపస్విని అయిన గిరిజా వర్ణనలోనిది.

"కురులతోఁ గూడ విలసిల్లు గిరిజ మొగము
జడలుదాల్చిన గడు బెడం గడరి పొల్చె
భృంగములు మూఁగి చెలువొందు బిసరుహంబు
పాఁకు దాల్చియుఁ గరమొప్పు భంగివోలె" (6-85)

దీని అర్థం స్పష్టం గనుక వివరణ అనవసరం. తంజావూరుప్రతిలో

"పాంకు దాల్చియుం గరమొప్పు భంగివోలె"

అని వుంది. ఈ రెండు వర్ణనలు కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలంలోని "సరసిజ మనువిద్ధం శైవలే నాపి రమ్యం" అనే భావం ఆధారపడినవని స్పష్టం.

మూడవది సైనికుల వీరాలాపాలలోనిది:

"పోరఁబాఁకదల్చి నీరుగొన్నటు ప్రతి
బలమునెల్లఁ బాయపడఁగఁ దోలి" 11-37

ఈ పాకు గురించి వాదప్రతివాదాలు చెలరేగాయి. రామకృష్ణకవిగారు "పోరఁ బాఁకు దాల్చి" అని గ్రహించి పాఁకును బాకనుకొని అరసున్నను తొలగించి చేయూతె అనే అర్థమిచ్చారు. మద్రాసు విశ్వవిద్యాలయ ప్రచురణలోను ఈ పాఠమే ఉంది. తంజావూరు ప్రతిలో

గీ. పొరంబాంకుదల్చి నిరుగొన్నట్లు ప్రతి
బలమునెల్లం బాయపడంగం దొలి"

అని ఉంది. సరోవరంలో పాచి కమ్మిన నీటిని పాచితొలగించి తీసుకొన్నట్టు రాజును రక్షించే సైన్యాన్ని అటూ ఇటూ తొలగించి రాజును [గొడుగుద్రెంచి చూపును - ఛత్రం రాజ లక్షణం] చంపి జయం కలిగిస్తానని ఒక భటుని వీరాలాపమిది. భటుని వాక్యాలలో మధ్యన "పాఁకుదల్చి నీరుగొన్నటు ప్రతి" అనే ఉపమానం వచ్చిపడింది. వీరుని ఆలాపాలకు ఇది సహజం.

కాని, రామకృష్ణకవిగారు దీనిని బాకని భ్రమపడ్డారు. మద్రాసు విశ్వ

ముద్రించి వుందరు. శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు కూడ బాకుగా గ్రహించి మూడుపుటల సుదీర్ఘచర్చ కావించారు. [నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీన గ్రంథమా ? పుటలు –19,20, 21].

వీరుని మాటలమధ్య ఈ ఉపమానం రావడం వల్ల దూరాన్వయ దోషం కలుగడం నిజమేకాని, బాకు మాత్రం కాదు. వీరుడు చెప్పదలచింది. ''నేను రాజును రక్షిస్తూ రాజు చుట్టూవున్న సైన్యాన్ని తొలగించుకొంటూపోయి - పాచిని తొలగించినీటిని గ్రహించినట్టు రాజును పొడుస్తాను''అని కనుక బాకు ప్రసక్తేలేదు.

తంజావూరు ప్రతిలో స్పష్టంగా 'పొరం బాఁకుదల్చి' అని వుండగా 'దాల్చి' అని గ్రహించవలసిన అవసరం ఎందుకు కలిగిందో! వాఁకును ఉదల్చి, లేక అదల్చి - తొలగించి నీరుకొన్నట్టు అని అర్థంస్పష్టం.

ప్రభాకరులు మద్రాసు విశ్వవిద్యాలయం ప్రతి మార్జినులో ''పొరంబాఁకు దల్చి'' పద్యం వద్ద ''శైవలం కిల విహాయ నిర్మలం కేవలం కిల జలం హి పీయతే'' అనే యోగవాశిష్ఠం ప్రయోగం గుర్తుగా వ్రాసుకొన్నారు. నన్నెచోడుడు ఈ ప్రయోగం గ్రహించి ఉంటాడు. అతడు యోగశాస్త్రజ్ఞుడుగదా! ఇలా చాలా పాఠాలు చెప్పవచ్చు.

పాఠ నిర్ణయం విషయంలో మాత్రం బృహస్పతి సూత్రం పాటించడం అవసరమనుకుంటాను – మానవస్వభావ పరిజ్ఞానంలో ఎలా వున్నా. ఎవరో చెప్పారు అని కాకుండా, స్వయంగా మూలపాఠాలు చూచి సత్యనిర్ణయానికి ప్రయత్నించాలి. నన్నెచోడుని కుమారసంభవం ప్రతి ఉన్నది ఒక్కటే. అది తంజావూరులో వుంది. దానిని చూడడం అంతకష్టమేమీకాదు. అందులోను పెద్దపదవులలో వున్నవారికి సుతరామూకష్టంకాదు. కనులారాచూచి, మనసారా ఆలోచించుకొని సత్యాన్ని సమీపించడానికి ప్రయత్నించవచ్చు. ఇలాటి అవకాశాలు జారవిడుచుకొని పరప్రత్యయనేయబుద్ధులు కావడంవల్ల ప్రమాదం తప్పదు. అలా చూచి ఆలోచించినా తప్పులు జరిగితే, ప్రమాదో ధీమతా మపి.

రామకృష్ణకవిగారి తాళపత్ర పరిశీలన శ్రద్ధాతిశయాన్ని గురించిన ఒక ముచ్చట చెప్పి ఈ వ్యాసం ముగిస్తాను. నేను 1939లో లాహోరుచేరి ఒద్ద

లందరికీ ఉత్తరాలు వ్రాశాను. రామకృష్ణకవిగారి నుంచీ జవాబువచ్చింది, అందరి జవాబులలాగే. కవిగారు తన జాబులో అక్కడ లాహోరు విశ్వవిద్యాలయ గ్రంథాలయమునన్‌నో, విశ్వబంధుశాస్త్రిగారి పరిశోధన సంస్థలోనో నన్నెచోడుని కుమారసంభవము కలదని వింటిని. చూచి వ్రాయుడు' అని వుంది. నేను వెళ్ళి గాలించాను. కుమారసంభవము — అని కన్నాకుపై వ్రాసిన ఒక తాటాకుల గ్రంథం కనిపించింది. యథాలాపంగా తెరిచాను. లోపల తెలుగుపద్యాలు. సంతోషంతో — మండోదరిని చూచి సీత అని భ్రాంతిపడి కుప్పిగంతులు వేసిన హనుమంతునిలాగా కుప్పిగంతులువేశాను. సంతోషపుపొంగు చల్లారిన తర్వాత పుస్తకం ప్రతి ఆకూ చూచాను. సంస్కృత కుమారసంభవంలోని కొన్నిసర్గలు, తెలుగుకావ్యాలలోని కొన్ని పద్యాలు ఉన్నాయి. మూర్ఛవచ్చినట్లయింది. కవిగారికి ఈ విషయం వ్రాశాను.

---

దీనిని పీఠిక xiii-వ పుట 3-వ బంతిలో జేర్చి చదువునది :—

కవిగారు కుమారసంభవము రెండవభాగపుఁ బీఠికలో నిట్లు వ్రాసినారు. "కుమారసంభవ ప్రతులలో నొకటి నాకు నైజామురాజ్యమునఁ బ్రాచీనశాసన శోధనార్థము పోవుచుండఁగాఁ గర్ణాటదేశముననే లభించెను. తక్కినవి రెండును శుద్ధద్రవిడదేశముననే యగపడెను" ద్రవిడకర్ణాటదేశములందు మూఁడుప్రతులు దొరకినను నచ్చులోఁ బెక్కులు గ్రంథపాతము లుండుట వింతగానున్నది. ఆ మూఁడుప్రతులు నొక్కమాతృకకే పుత్త్రికలా యేమి? కాకున్నచో నవి పాఠభేదములులేకయు నమానగ్రంథపాతములు గలిగియు నుండుట వింతగాదా? పట్టికలో ముఖ్యపాఠభేదములని వారు చూపినవి ప్రాయికముగా ముద్రణమందర్థానుగుణముగాఁ జేయఁబడిన సంస్కారములకు వ్రాఁతప్రతిలో నున్న తప్పు పాఠములుగా గోచరించుచున్నవి. కుమార సంభవప్రతులయొక్కయుఁ బాఠములయొక్కయు రహస్యము లింకను బయల్పడ వలసియే యున్నవి.

[ప్రబంధరత్నావళి ప్రథమ ముద్రణము (1918) పు. 190.]

ఇందే చూ. పు. ౯ మరియు ౧౨

# తంజావూరు లైబ్రరీ తెలుగు కేటలాగు

## డా॥ వేటూరి ఆనందమూర్తి

["తంజావూరు రా. మహారాజువారి నగరి శ్రీ సరస్వతీమహల్ అనే లైబ్రరీలో నుండెడు తెలుగు పుస్తకముల పట్టిక"—శీర్షిక.

ఇందులో పేర్కొనబడిన నన్నెచోడదేవుని కుమారసంభవము వ్రాత ప్రతి 189 నెం॥ గలది.సం॥]

మా వద్ద పై శీర్షిక గల పట్టిక ఉంది. ఇది పితృపాదులు శ్రీ ప్రభాకర శాస్త్రిగారు 1916 ప్రాంతాలలో తమ నోట్‌బుక్ నెం. 7 లో, తంజావూరు మాతృక నుండి కాపీ చేయించుకొన్న 20 పేజీల పట్టిక. ఈ నోట్‌బుక్‌లోనే వారు ఇంకా ప్రయోగరత్నాకరాదుల నుండి కాపీ చేసికొన్న ఇతర విశేషాలు, సేకరించిన జానపద గేయాలూ, చాటు పద్యాలూ, ఛందోగ్రంథాల వివరాలు వగైరాలున్నవి. (ఇందులోనే ప్రయోగరత్నాకరంలోని — నన్నెచోడుని కళా విలాసము నుండి గ్రహించిన 'పాథోనిధి' పద్యం కూడా ఉన్నది. కాని దానిని వారు తమ ప్రబంధరత్నావళిలో చేర్చుకోలేదు.)

పరమ ప్రామాణికులైన పండిత పరిశోధకులు కూర్చిపెట్టుకొన్న ఇలాటి క్రిటికల్ నోట్సు ఎందరివద్ద ఎన్ని ఉన్నాయో వాటిని తర్వాతి తరాల వారెలా ఉపయోగిస్తున్నారో నాకు తెలియదుగానీ మా వద్ద—వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు వారికి మేమిటీవల అంకితం చేసిన "శ్రీ ప్రభాకరశాస్త్రి లైబ్రరీ"లో శ్రీ ప్రభాకరులు చేకూర్చిపెట్టుకొన్న నోట్సు ఇట్టివి—పోయినవిపోగా కొన్ని అయినా నేటికి మిగిలి భద్రముగా ఉన్నవి. వాటి వర్గీకరణ ప్రకటన అవశ్యము చేయవలసిన పని. ఆ కార్యాన్ని సాగించి యథావకాశం మా ఋూ మణిమంజరి సంపుటాలు నూతనాంశాలను వెలుగులోనికి తెస్తున్నవి.

ఈ నాడు పరిశోధకులు పరిశోధక రంగంలో ఎదుర్కొంటున్న ఎన్నో సమస్యల పరిష్కారానికి ఇలాటి ప్రామాణికులైన పండిత పరిశోధకుల క్రిటికల్ నోట్సు ఎంతగానో ఉపకరించగలవు. అందువల్ల వీటి ప్రాముఖ్యాన్ని గుర్తించగల

తెలుగుపాఠకలోకమూ ప్రభుత్వమూ ఈ విషయమై మేము గావిస్తున్న ఈ కృషిలోని విలువ నెరిగి వీటిని పరిశీలించగలదనీ ప్రోత్సహించి తగిన చేయూత నీయగలదనీ ఆశిస్తాను.

కీట్స్ రాసుకొన్న మార్జినల్ క్రిటికల్ నోట్సు గల షేక్స్పియర్ రచనలను పాశ్చాత్యులు భద్రంగా సేకరించి పరిశోధకుల పరిశీలన కనువు గల్పించిన సన్నివేశాలను అల్టిక్ మహాశయుడు తన "ది ఆర్ట్ ఆఫ్ లిటరరీ రీసెర్చ్" అనే ఉద్గ్రంథంలో ఉద్ఘాటించినాడు. మన జాతికింకా ఆ మెలకువ కలుగలేదు కదా అన్న విచారం నా కున్నది. మనవారు అట్టి సామగ్రిని భద్రపరచు కోవడం లేదు. ఒకవేళ సేకరించి భద్రపరచినా దానిని వినియోగంలోనికి తేపడం లేదు. ఒకవేళ అలా తెస్తున్న ప్రయత్నమెవరైనా చేస్తున్నా దానికి తగిన ప్రోత్సాహం ఇవ్వడంలేదు. అదీ వ్యథ!

కొమర్రాజు లక్షణరావుగారి నోట్సులన్నీ ఏమైనట్టు? మల్లంపల్లి వారివి పోలెడుపోయినా తక్కినవాటిని అంతర్జాతీయ తెలుగు సంస్థ వారు సేకరించి పెట్టినట్లు వినికిడి. మరి వాటి విశ్లేషణ ప్రకటన ఏమైనా జరుగుతున్నదా? ప్రభాకరుల నోట్సును మేము మణిమంజరిలో ఉన్నంతలోనే తంటాలుపడి ప్రకటించే ప్రయత్నం చేస్తున్నాము. దానికి వస్తున్న ప్రశంస ఎలాటిదో, రావలసిన ప్రఖ్యాతి ఎంతటిదో తెలుగుదేశం ఇస్తున్న ప్రోత్సాహం ఏపాటిదో గుర్తింపుడని మనవి.

ప్రస్తుతం ఈ వ్యాసంలో "తంజావూరు మహారాజువారి నగరి శ్రీసరస్వతీ మహలు" అనే లైబ్రరీలోని తెలుగు గ్రంథాలను సూచించే తెలుగు గ్రంథముల పట్టికను గురించీ, దానికి సంబంధించిన అంశాలను కొన్నింటిని గురించీ మాత్రమే విస్తరిస్తాను.

*ఈ పట్టిక (*A*) లో క్రిందివిధమున వర్గీకృత వివరణ మున్నది. (చూ. బ్లాకు పు. 120) వరుస సంఖ్య—పుస్తకముల పేరులు—ఎన్ని—సమగ్రా సమగ్ర వివరము—ఏ కావ్యము—కవి పేరు.

---

* ఇందులో (*A*), (*B*), (*C*) అనే సంకేతాలు సౌకర్యంకోసం నేను ఈ వ్యాసంలో కూర్చినవి. (*A*) తంజావూరి కేటలాగుకు మాతృకా ప్రతి. (*B*), (*C*)లు 1933 ; 1959లో ముద్రింపబడిన కేటలాగులు.

మొత్తం 20 పుటలు గల ఈ పట్టికలో "అన్ని చేరిన తెలుగు పుస్తకములు" 675 ఉన్నవి. ఇవి ప్రధానంగా 1. కావ్యములు, 2. నాటకములు, 3. వేదాంతము, 4. వ్యాకరణ శాస్త్రము, 5. జ్యోతిషం, 6. సంగీతశాస్త్రము, భరతశాస్త్రము—అనే ఆరు విభాగములలో ఉన్నవి.

| | | | |
|---|---|---|---|
| 1. కావ్యములు | 1 470 | అంతు పద్యకావ్యముల పుస్తకములు | 470 |
| 2. నాటకములు | 1-162 | అంతు- | 162 |
| 3. వేదాంతము | 1-3 | అంతు- | 3 |
| 4. వ్యాకరణశాస్త్రము | 1-12 | అంతు- | 12 |
| 5. జ్యోతిషం | 1- 3 | అంతు— | 3 |
| 6. సంగీతశాస్త్రం, భరతశాస్త్రం | 1-25 | అంతు— | 25 |
| అన్ని చేరిన తెలుగు పుస్తకములు | | | 675 |

ఈ పట్టికలోని గ్రంథాల వివరాలకు, దరిమిలా ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు (1963) ముద్రించిన డిస్క్రిప్టివ్ కేటలాగు (*B*) లో *I* కావ్యవాఙ్మయము, *II*. శాస్త్రవాఙ్మయము, *III*. వివిధ విషయములు అనే మూడు విభాగాలలోని మొత్తం 816 గ్రంథాలను గూర్చిన వివరాలకు కొన్ని కొన్ని తావుల భేదాలున్నవి. మచ్చుకి ఒకటి రెండు భేదాలను ఈ వ్యాసంలోనే పేర్కొంటున్నాను.

ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి ముద్రణంలో ఈ పట్టిక (*A*) ఉనికిని గూర్చిన ప్రస్తావన లేకున్నా దీనిని వారు చూచి యుందురనే అనుకోవచ్చును. (సుగ్రీవ విజయం- గుణ రుద్రకవి ఆరోపించూడదగును.) 1916 ప్రాంతాలలో ప్రభాకరులు కాపీ వ్రాయించుకొన్న ఈ పట్టిక అంతకు పూర్వమే తంజావూరులో ఉన్నట్టిది కావలెను.

తంజావూరు సరస్వతీమహలు లైబ్రరీ ప్రజాగ్రంథాలయంగా మారి 'తంజావూరు మహారాజా శరభోజి సరస్వతీ మహలు గ్రంథాలయము' (*T M.*

*S.S.M. Library*) అనే పేరును సంతరించుకొన్న తేదీ 14-10-1917 అని శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు విశదీకరిస్తూ "తంజావూరు సరస్వతీ భండారము 1918 సంవత్సరము నుండి తంజావూరు శరభోజి సరస్వతీ గ్రంథాలయము" అని చెప్పి, "కనుక సంస్కృతాంధ్ర గ్రంథ పట్టిక అప్పటిది కావచ్చును" ['నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీన గ్రంథమా?' (పు. 257-260] అని తాము ప్రతిపాదించిన సిద్ధాంతమునకు అనుకూలంగా ఒక ఉపపత్తిని చూపిరి. అంతకు పూర్వము 1869-70లో ప్రొఫెసర్ పిక్‌ఫర్డ్ లిఖిత గ్రంథములకు పట్టిక వ్రాయనారంభించినా ఆ అసమగ్ర పట్టిక కూడా లభించలేదనీ వారే అందు పేర్కొన్నారు. అంతకెంకాపూర్వం 1856లో కొంత ప్రయత్నం జరిగినా గ్రంథ పట్టిక తయారు కాలేదనీ వారు పేర్కొన్నారు. 1798-1800లో వేదమూర్తి గంగాధరభట్లు సదాశివభట్లు ఋజువు చూచి వ్రాయగా తయారైనది సంస్కృత గ్రంథ పట్టిక అని కూడా వారందు వ్రాసినారు. ఫలితార్థముగా తంజావూరులోని తెలుగు గ్రంథముల పట్టిక 1917-18కి పూర్వ మక్కడ లేదన్న విషయం శ్రీరామమూర్తిగారి రచనను చదివినవారికి బోధగట్టుతుంది.

మరి 1916 ప్రాంతాలలో ప్రభాకరులు కాపీ చేయించుకొన్న ఈ పట్టిక ఎప్పటిదో పరిశీలించవలసిన ఆవశ్యకమున్నది. ఇది అంతకు (1916కి) పూర్వమే అక్కడ ఉండిన తెలుగు గ్రంథముల పట్టిక కావలెను. దీని మీద 'తంజావూరు రా. మహారాజువారి నగరి శ్రీసరస్వతీ మహల్ అనే లైబ్రరీలో' అనే కానీ 'తంజావూరు మహారాజ శరభోజీ సరస్వతీ మహలు గ్రంథాలయము' అని లేదు. 1871లో బర్నెల్ తయారుచేసి 1878 - 80లో ప్రకటించిన కేటలాగు మీద "*A Classified Index to the Sanskrit Manuscripts in the Palace at Tanjore*" అని ఉన్నట్లే ఈ తెలుగు పట్టిక మీదను "మహారాజువారి నగరి.. అనే లైబ్రరీ" అని ఉండడం గుర్తింపదగిన అంశము. నాయకరాజుల కాలంలోనే అంకురించిన ఈ భండారం మహారాష్ట్ర ప్రభువుల పోషణలో వ్యాప్తి చెంది పందొమ్మిదో శతాబ్ది మధ్యభాగంలో పాశ్చాత్యుల వ్యవహారంలో "పేలస్ లైబ్రరీ" గాను, "సరస్వతీ మహల్ పేలస్ లైబ్రరీ" గానూ వ్యవహరింపబడేది. ఆ వ్యవహారాన్నే పై పట్టికమీది శీర్షిక సూచిస్తున్నది గనుక పిక్‌ఫర్డ్, బర్నెల్ పట్టికలు కూర్చే విషయమై పనిచేసిన సందర్భంలోనే ఈ తెలుగు గ్రంథముల

పట్టిక కూడా రూపొంది ఉండవలెను. ఇట్టి పట్టిక అక్కడ అప్పటికే ఉండడం వల్లనే వీరేశలింగముగారు (1870-90 సంవత్సరాల నడుమ నెప్పుడో-1890 సంవత్సరమే కావచ్చునుగాక) ఆ తెలుగు గ్రంథముల పట్టికను తెప్పించుకొని చూడడమూ, పిదప తామేవెళ్ళి కుమారసంభవాది కావ్యములను అక్కడ చూడ డమూ గల లేఖాంశమును విశ్వసించకపోవడానికి (చూ. మణిమంజరి పు. 120 మరియు ౧౨౧) హేతువు లేదు. ఏలంటే అప్పటికి ఆ తెలుగు గ్రంథముల పట్టికా ఉన్నది - అందులోని (189 నెంబరు గ్రంథముగా నన్నెచోడదేవుని కుమార సంభవము — తెలుగు పద్యకావ్యము సమగ్రము-ప్రతి ఒకటి-) కావ్యముల అంతు 470 గ్రంథాలలో నన్నె చోడుని కుమారసంభవకావ్యమూ ఉన్నది.

వీరేశలింగము పంతులుగారి వద్ద ఆనాడు 79 కావ్యములు మాత్రమే గల పట్టిక యుండెడిది — వంగూరు సుబ్బారావు శతక కవుల చరిత్ర :— మానవల్లి కవి రచనలు పుట 8 పాదసూచిక.

పంతులుగారునాడు ఆ (*A*)పట్టికను చూచి అందులో నుండి79కావ్యములను మాత్రము కాపీ చేసుకొన్నారు. ఉదాహరణకు వారు శ్రద్ధ వహించి గుర్తించిన ఉ.హ. 98, 99 నెం॥ గ్రంథములు; దశకుమార చరిత్ర 224 నెం॥ గలది కనుక నాడు వారు చూచిన పట్టికలో 79 గ్రంథములు మాత్రమే ఉండిన దనుట కును వీలులేదు. 675 గ్రంథములుగల ఈతెలుగు గ్రంథ పట్టిక నుండియే ఆనాడు వారు తమకు శ్రద్ధ ఉండిన ఒక 79 పుస్తకముల పేర్లను మాత్రము వ్రాసికొని యుందురు. అదే వంగూరి వారు ప్రస్తావించిన పంతులుగారి పట్టిక.

కనుక "తంజావూరు తెలుగు పుస్తకముల పట్టిలో 'నన్నెచోడుని కుమార సంభవము' ప్రసక్తి కలదేని" ఆచి శ్రీరామమూర్తిగారు సందేహింపనవసరములేదు. పోతే 1899లో ప్రకటించిన తమ కవుల చరిత్రలో నన్నెచోడుని కుమార సంభవమును గురించి 'నామమాత్రముగ'నైన లేకపోవడానికి పంతులుగారికి నాడు దానియందు "శ్రద్ధ" లేకపోవుటయే కారణమని వారి వ్రాతను బట్టియే యెంచ దగును. ఇంతకూ కవిగారు 1909లో కుమారసంభవమును ప్రకటించిన తరువాతనే కదా పలువురికి ఆ గ్రంథమును గూర్చిన "శ్రద్ధ" యెక్కువైనది! ఈచర్చ

నింతటితో ఆపి తంజావూరు తెలుగు గ్రంథముల పట్టిక (*A*) లోని కొన్ని వివరా లను ఆం॥ వి॥ వారి 1933 కేటలాగు (*B*) లోని వివరాలతో పోల్చి చూపుతాను.

(*A*) 187—188 కావ్యాలంకార సంగ్రహ మహా ప్రబంధము—2—సమగ్రము—పద్యకావ్యము—నరస భూపాల

189. కుమారసంభవము—1—సమగ్రము—పద్యకావ్యము—నన్నెచోడ దేవ.

(*B*) 152. * (ముద్రితమని సూచన) కుమారసంభవము (నన్నెచోడుడు).

*M*. 189—$16\frac{1}{4} \times 1\frac{1}{4}$; 127; 1—12 ఆ॥ సమగ్రము.

ఇందులో 152 వరుస సంఖ్య క్రొత్తది. ప్రాచీనమైనది *M*. 189 సంఖ్య. ఈ సంఖ్యతో వర్ణితమైన నన్నెచోడదేవుని కుమారసంభవమూ గంగాధర భట్లు (1800) ఋజువు చూచి వ్రాసిన సంస్కృత గ్రంథ పట్టికలోని కుమారసంభవమూ ఒక్కటే అన్న విషయము శ్రీధరమూర్తిగారి వ్యాసములో (చూ. మణిమంజరి పుట ౨౭) విశదీకరింపబడినది.

కనుక 1800 కు పూర్వమే నన్నెచోడుని కుమారసంభవము తంజావూరులో కలదనీ, గంగాధరభట్లు పేర్కొన్న ఆ గ్రంథమే అదే నెంబరుతో మా యీ పట్టిక యందునూ కలదనీ, ఈ పట్టికయొక్క మూలము కూడా 19 వ శతాబ్ది నడుమనే రూపొంది యుండుననీ, కనుక వీరేశలింగముగారి లేఖాంశ మది విశ్వాస్యమే కాదగుననీ తెలియదగును కదా! ఇవి నిరూపితమైనపుడు శ్రీరామమూర్తిగారు ప్రతిపాదించిన సిద్ధాంతములోని తక్కిన చర్చకు తావులేదు. అయినా దానికీ వక్తవ్యమున్నది. అది మరో సందర్భంలో. ప్రస్తుతం తంజావూరు తెలుగు గ్రంథముల పట్టికలోని మరికొన్ని అంశాలు వివరిస్తాను.

(*A*) 44—46. భారతము ఆరణ్యపర్వము—3—పద్యం—తిక్కన [దీనిలో 44 వ సంఖ్య తిమ్మయ ద్విపద రచనగా ప్రభాకరశాస్త్రి గారు గుర్తించియున్నారు.]

(*A*) 106 భారతము విరాటపర్వము—1—ద్విపద—సోమన
[ప్రభాకరులు దీనిని తిమ్మయ్య రచనగా గుర్తించిరి]

(*A*) 245. పద్యము—మన్నారు దాస విలాసము—తెలుగు భాష-గ్రంథ లిపి. 1—అ—రంగాజయ్య.
[దీనిని మేలుమేలు అనిమెచ్చి ప్రభాకరులు శ్రీకృతి — రంగాజమ్మ అని సవరించి వ్రాసిరి]

(*B*) 556. మన్నారు దాస విలాసము-(రంగాజమ్మ)
*M.* 705 $16\frac{1}{2} \times 1\frac{1}{2}$ . 51— అ.

(*A*) 261—262 పద్యం—కృష్ణలీలావిలాసము—1—స—వెంకటాచార్య
[బేషయినది అని ప్రభాకరుల నోట్]

(*B*) 505, 506—కృష్ణలీలావిలాసము—శాహరాజు—*M*-17

(*A*) 307. నళకూబర జయంత సంవాదము—1—అ-
[భేష్ భేష్ అని ప్రభాకరుల నోట్]

(*B*) 161, 162. జయంత నలకూబర సంవాదము—
జయంత నలకూబరీయము. [పేరులో మార్పు:]
*M.* 307 M. 455 ప్రతిపాద్యమునుబట్టి పై నామమీయబడెను. అని వీరు పేర్కొనిరి. (161, 162 రెండూ ఒకే గ్రంథము. ఇది కువలయాశ్వ చరిత్రలోని భాగమని నిడుదవోలు వారు గుర్తించిరి.

(*A*) 319. వచన కావ్యం—ఆచార్య విజయము—1—స—రామభద్ర
[పద్యకావ్యము అని వేటూరి వారి నోట్]

(*B*) 130. ఆచార్య విజయము (ఆంధ్ర కాళిదాస కవి)
M. 319. *S.* $17 \times 1\frac{1}{2}$; *L*—168; 11—7; *G*—4704.
కర్త నరసమాంబికా వెంకటేశ్వరార్యుల తనయుడగు ఆంధ్ర కాళిదాస కవి. ఈ గ్రంథము ముద్రితమైనట్లు నిడుదవోలువారు పేర్కొనిరి.

(*A*) 396. పద్యం—క్రీడాభిరంజనం—1—సమగ్రం—వల్లభరాయడు.

(*B*) 512 క్రీడాభిరామము (వల్లభరాయడు)
M. 396. $18\frac{1}{2} \times 1\frac{1}{4}$. 32 — సమగ్రము.
*R*. దీనిని క్రీడాభిరంజన మని వాడుటకలదు.

(*A*) 399. మహామదన కామేశ్వరం-1-సమగ్రం-యర్రయ.
స్త్రీ పురుష లక్షణం.

(*B*) 782. కొక్కోకము (ఎఱ్ఱయ)
M. 399. *S*-$14\frac{3}{4} \times 1\frac{1}{2}$: *L*-70. 11-5. *G*-1260.
*R*. మహామదన కామేశ్వరం అని కొన్ని సంస్కృత శ్లోకములు వ్రాయబడియున్నవి.

(***A***) 357. రాజగోపాలస్వామి ప్రబంధము-1-అ—రఘునాకథవి.
[కవి పేరు కొట్టివేసి విజయరాఘవరాయలు — మంచిది — అని ప్రభాకరశాస్త్రిగారి నోట్ కలదు.]

(*B*) 222—224 రాజగోపాల విలాసము
M. 256 (స): 257 (అ); 398 (అ). ఇవే కాని M. 357 నెంబరు గల రాజగోపాలస్వామి ప్రబంధ మిందు కానరాలేదు.

(*A*) 404, 405—యక్షగానము—సుగ్రీవ విజయము-1-స— గుణరుద్ర

(*B*) 497 - 498 సుగ్రీవ విజయము (గుణరుద్రకవి) M. 405. *S*. $15 \times 1\frac{3}{4}$, *L*-17; 11—6 *G*—408. (M.404. 17×1-20 అసమగ్రము)

(*A*)లో పేర్కొన్నట్లే (*B*)లోనూ కవి పేరు గుణరుద్రకవి అని కలదు. 'కోవిద స్తవనీయగుణ రుద్రధీర విరచిత' అను పంక్తిని అనుచితముగా విభాగించుటవలన ఈరీతిగా 'గుణరుద్ర' నామ మేర్పడిన విషయమును నిడుదవోలు వెంకటరావుగారు (*C*) కేటలాగు *Vol. II* (1959)లో వివరించినారు. (*B*)లో ఇట్లు పేర్కొనుటకు (*A*) ఆధారము. ఈ ప్రమాదము (*A*)లోనే దొరలినది.

(*A*) 11 — 12. నాటకం - ప్రబోధ చంద్రోదయ నాటకము—2 — స—
సూరయ్య కృతం.

[దీని ప్రక్కన శాస్త్రిగారు దివ్యమైన యక్షగానము అని గుర్తించి వ్రాసిరి.]

(*B*) 604, 605 వివేక విజయము (చల్ల సూరయ)

M. 497; M. 682. సంస్కృత ప్రబోధచంద్రోదయము వంటిది.

(*A*) 24. రామాయణము కన్నడ అర్థముతో గూడ-1-ద్విపద-
[రచయిత పేరు కుమార వాల్మీకి అని శాస్త్రిగారి నోట్]
25. వాసిష్ఠ రామాయణము 7 ఆ॥— 1—సింగనార్యుడు.
26. సంక్షేప రామాయణము [సంకలనము]— 1-పద్యము.
తిక్కనసోమయాజి.

(*B*) 249. వాసిష్ఠ రామాయణము (సింగనార్యుడు)

M. 24. 17 × $1\frac{1}{2}$. 824 — 1—3 ఆ॥ *D*. 165 కూడా ఇదే గ్రంథమని నిడుదవోలు వారు.

275 సంక్షేపరామాయణము.

M. 25. *S*, 13×1. *L*-20. 11—3. *G*-65 ఇవి పోతరాజు గారి పద్యములుగా నిడుదవోలువారు గుర్తించిరి.

పై పరిశీలనవల్ల తేలే అంశాలివి:— (*B*)లో పేర్కొనబడిన M నెంబర్లు చాలావరకు (*A*)లోని వరుస సంఖ్యలే. కొన్ని తాపుం లేడా ఉన్నది. (*A*) లో 675 గ్రంథాలే ఉండగా (*B*)లో M 682 వంటి సంఖ్యలు కూడా కానవస్తున్నవి. (*A*)లో ఉన్న కొన్ని పుస్తకాలు (*B*)లో చేరలేదని తోస్తున్నది. (*B*)లో 816 గ్రంథాలుండడం వలన 675 మాత్రమే ఉన్న (*A*)లో కొన్ని లేకపోవడం సహజమే. ఈ పరిశీలనబట్టి 675 గ్రంథాలుగల (*A*) పట్టిక పురాతనమైనదనీ, దాని మీద సవరింపబడి ఎక్కువ M నెంబర్లు గల మరో పట్టిక రూపొంది (*B*) కి ఆకరమై ఉండుననీ తెలుస్తుంది. (*B*)లో కూడా చేరనివి తర్వాత శ్రీ సుందరశర్మ గారి (*C*) కేటలాగులో మరికొన్ని చేరినవి. ఇలా పట్టికల్లో అక్కడి గ్రంథముల

పరిశీలన, పరిగణన సాధ్యమవుతున్నకొద్దీ సంఖ్య పెరుగుతూ పాత నెంబర్లకు కొత్త నెంబర్లు జత అవుతూ రూపాంతరాలు పొందడంతో కొంత అవ్యవస్థ యేర్పడినట్లున్నది. దీనికితోడు కొన్ని సంస్కృత భాషా గ్రంథాలు తెలుగు లిపిలోను, తెలుగు భాషా గ్రంథాలు దేవనాగరి లిపిలోనూ ఉండిన కారణంగా గుర్తించడంలో జరిగిన పొరపాట్లవల్ల సంస్కృతాంధ్ర గ్రంథాల పట్టికలలోనూ కొంత అవ్యవస్థ ఏర్పడినట్లున్నది.

కనుకనే కుమారసంభవం పేరునుబట్టి తెలుగు లిపిలో ఉన్న సంస్కృత గ్రంథంగా భాసించి **M.** 189గా సంస్కృతగ్రంథ పట్టికలో చేరడము, తర్వాత గుర్తింపబడి (*A*)లో తెలుగు గ్రంథంగా పేర్కొనబడడమూ, ఆదే తిరిగి (*B*)లో 152 నెంబరుగా గుర్తింపబడడమూ పైని పేర్కొన్న అవ్యవస్థనే సూచిస్తున్నది. ఇంతకూ అన్నిటా వర్ణితమైన ఆ గ్రంథ మొక్కటే — నన్నెచోడదేవుని కుమార సంభవము— అన్న విషయము గ్రంథసూచికలలోని వర్ణననుబట్టి తెలియవస్తున్నది. ముద్రింపబడిన గ్రంథసూచికల లోని కొన్ని అంశములను పునఃపరిశీలింపవలసిన ఆవశ్యకమునుగూర్చి శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు (*C*) కేటలాగు *Vol.II* (1959)లో విశదీకరించినారు. (చూడదగును).

ఈ (*A*) కేటలాగు మాతృక ప్రస్తుతము తంజావూరులో లేనట్లయితే మా లైబ్రరీలోగల దాని ప్రతికకు, అందులో శ్రీ ప్రభాకరులు గుర్తించి వ్రాసుకొన్న విశేషాంశాలకు ప్రాముఖ్యమధికమగుచున్నది.